# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అగ్నిపర్వతం

రచన: వసుంధర

## చదివింపు

రచన: వి. యస్. రావ్

## అంతిమశ్వాస

రచన: కె. వి. యస్. యన్. మూర్తి

రాక్షసవేట — ఆరవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—176
ఆగస్టు, 1988
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1.

# అగ్ని పర్వతం

వసుంధర

శ్రీరాములు ఆఫీసు నుంచి వచ్చేసరికి వంటింట్లోంచి పరిమళాలు గుబాళిస్తున్నాయి.

"సీతా!" అన్నాడతను.

అప్పుడు సీత లోపల్నుంచి అక్కడకు వచ్చింది. జడ నిండా మల్లెలు తురుముకున్నదేమో శ్రీరాములు నాసికా పుటాలకిప్పుడు మరో పరిమళాలు విందు చేస్తున్నాయి.

"మీరు వస్తారని తెలుసు. తలుపులు తీసే వుంచాను" అందామె తమాషాగా నవ్వుతూ.

శ్రీరాములూరికే వెళ్ళి అప్పుడే తిరిగివస్తున్నాడు.

"ఇలారా!" అన్నాడతడు.

సీత దగ్గరగా వచ్చింది.

అప్పుడతడికి సోకినవి వంటల గుబాళింపూ కాదు, మల్లెల గుబాళింపూ కాదు.

ఆమె శరీరంనుండి యేదో వింత పరిమళం!

శ్రీరాములామెను దగ్గరగా తీసుకోవాలనుకున్నవాడే

యెందుకో నిగ్రహించుకున్నాడు.

"త్వరగా బట్టలు మార్చుకోండి. మీకోసం మసాలా ఉప్మా చేశాను. చల్లారేలోగా...."

ఆమె యేదో అనబోతూండగా—"పిల్లలేరీ!" అన్నాడతను.

సీత యౌవనం తరగనిది. ఆమెను చూస్తే అప్పుడే పెళ్ళయిందా అనిపిస్తుంది. కానీ ఆమె నలుగురు పిల్లల తల్లి. పెద్దవాడికి పదేళ్ళు. రెండోదానికి ఎనిమిది. మూడో వాడికి ఏడు. నాలుగో వాడికి అయిదు. ఎవరైనా పిల్లల్ని ఆమెనీ కలిపిచూస్తే వాళ్ళామె అక్కపిల్లలా అనుకుంటారు.

"ఆడుకుందుకు వెళ్ళారు...." అంది సీత. అతడు తన్ను దగ్గరగా తీసుకుందుకు తటపటాయించడానికి కారణం తెలిసిన దానిలా ఆమె అతడికి మరింత దగ్గరగా జరిగింది.

శ్రీరాములామెను తాకనైనా తాకలేదు. కానీ పరిశీలనగా ఆమెవైపే చూస్తూ—"మన పెళ్ళై పన్నెండేళ్ళయింది. పదహారోయేట నువ్వు నా అర్ధాంగివయ్యావు. ఇప్పుడు చూస్తూంటే పెళ్ళినాటికన్నా చిన్నపిల్లలాగున్నావు. నీ ముఖంనిండా అమాయకత్వం. కానీ నువ్వు అమాయకురాలివి కాదని నాకు తెలుసు—" అన్నాడు.

"ఏమిటండీ — ఇలా మాట్లాడుతున్నారు!" అంది సీత.

"నీ ముఖం చూస్తూంటే పసితనపుటమాయకత్వం గోచరిస్తుంది. నువ్వు నాతో పన్నెండేళ్ళు కాపురంచేసి నలుగురు పిల్లల తల్లివయ్యావంటే నాకే నమ్మబుద్ధి కావడంలేదు. కానీ అది నిజం. అవునా?"

అది తనకు పొగడ్తగా తీసుకుని—"అయితే?" అంది సీత కుతూహలంగా.

"అంటే నీ ముఖంలో కనబడే అమాయకత్వం నిజం కాదు. నటన!" అన్నాడు శ్రీరాములు.

"ఏమిటండీ—ఇలా మాట్లాడుతున్నారు!" అంది సీత మళ్ళీ.

"హైదరాబాద్‌లో నేను కృష్ణమోహన్ని కలుసుకున్నాను...."

కృష్ణమోహన్ సీతకు స్వయానా బావ. వయస్సులో అతడు శ్రీరాములికంటే రెండేళ్ళు పెద్ద. చూడ్డానికి పదేళ్ళు చిన్నలా అనిపిస్తాడు.

"ఊఁ" అంది సీత.

శ్రీరాములు కాసేపు మాట్లాడలేదు.

సీత అతడి వంకే చూస్తోంది. అతడేం చెప్పబోతున్నదీ ఆమెకర్థమవుతున్నట్లు లేదు.

"ఎనిమిదేళ్ళ క్రితం అతడీ ఊళ్ళోనే వుండేవాడు—గుర్తుందా?"

"ఏమో!" అంది సీత.

"అదే నటన అంటే! ఏమో—ఏమిటి? ఈ ఊరు రాగానే అతడు మనింటికే వచ్చి తనకిల్లు దొరికేదాకా రెండు నెలలు మనింట్లోనే వున్నాడు. ఆ తర్వాత రోజూ వస్తూ పోతూ వుండేవాడు...."

"అవును—గుర్తొచ్చింది. బావకు మొహమాటం యెక్కువ. మీరు బాగా బలవంతపెట్టి ఒప్పించారు-" అంది సీత వెంటనే.

"అదీ తెలివి అంటే! ఎవరతణ్ని మనింటికి రమ్మన్నారో నువ్వు విడమర్చి చెప్పనవసరంలేదు. నేను బల

వంత పెట్టినప్పటికీ అతడు మనింట్లో రెండు నెలలుండడమే కాక నాలుగేళ్ళపాటు తరచుగా వస్తూ పోతూండేవాడంటే కారణం-నువ్వు, నీ ఆదరణ. కాదంటావా?"

సీత బదులివ్వలేదు. భర్త వంక చురుగ్గా చూసింది.

"నీ చూపులే చెబుతున్నాయి, కాదనలేవు. అవునా?"

"ఆదరణకు మారు పేరు నేను. నా పేరు సీత!" అందామె.

"ఆదరణకు మారు పేరువే నువ్వు. అందుకే నీ పేరు సీత కాదు—అహల్యగా మార్చుకుంటే బాగుంటుంది."

"ఎందుకు?"

"వివాహిత స్త్రీ పరపురుషుణ్ని భర్తకుమించి ఆదరిస్తే ఆమె అహల్య అవుతుంది."

"ఏమిటండీ మీరనేది?" బాధగా అంది సీత.

"నీకూ నీ బావకూ సంబంధముంది!"

"ఏమిటీ?" అంది సీత. అంతకుమించి ఆమెకు గొంతు పెగలలేదు.

"మనింట్లో పెరుగుతున్న చివరిద్దరు పిల్లలూ నా పిల్లలు కారు...."

"ఇలాంటి వేళాకోళాలు నాకు నచ్చవు...." చిరాగ్గా అంది సీత.

"నీకు నచ్చని వేళాకోళాలు నేనెప్పుడూ చేయను."

"మరిప్పుడు....?"

"నేను సీరియస్ గా చెబుతున్నాను..."

"ఏమిటండీ యిదంతా?"

"మాటిమాటికీ ఏమిటండీ, ఏమిటండీ అనకు. పెళ్ళికి ముందే నువ్వూ, నీ బావ ప్రేమించుకున్నారు. కానీ మీ రెండు కుటుంబాలకీ మధ్య కలహాలు రేగడంతో మీ

వెళ్ళి సాధ్యపడలేదు. వెళ్ళియ్యాక నీ బావ ఈ ఊరొచ్చాడు. ఇద్దరు పిల్లల తల్లివైనా నీ బావకు నీలో పాత ప్రియురాలే కనిపించింది. అతడు నిన్ను ప్రోత్సహించాడో, నువ్వతడికి సహకరించావో నాకు తెలియదు. నాకు తెలియకుండా మీరిద్దరూ నా యింట్లోనే కాపురం చేశారు. నీ బావ నిన్ను ఇద్దరు పిల్లల తల్లిని చేశాడు."

"ఇదంతా మీ కెవరు చెప్పారు?"

"నీ బావ!"

తెల్లబోయింది సీత—"ఎందుకు చెప్పాడు?"

"చెప్పినట్లతడికి తెలియదు."

"మీరు చెప్పేదంతా డొంకతిరుగుడుగా వుంది. నాకేమీ అర్థం కావడంలేదు."

"నీకు తెలిసిన విషయమేకదా యెలా చెప్పినా అర్థమవుతుందనుకున్నాను. సూటిగా కావాలంటే అలాగే చెప్పగలను. కాస్త దూరంగా అలా కూర్చో! నేను నిలబడి అటూ యిటూ పచార్లుచేస్తూ యేం జరిగిందో చెబుతాను."

సీత చటుక్కున అతడికి దూరంగా వెళ్ళి నేలమీదనే చతికిలబడింది.

శ్రీరాములు అటూ యిటూ పచార్లు ప్రారంభించాడు:

అక్కడ కాసేపు నిశ్శబ్దం

అప్పటికే సీత శరీరం పరిమళించడం మానేసింది. ఆమె తలలోని మల్లెలు వాడిపోయాయి. ఒంటింటి గుబాళింపు ఇగిరిపోయింది.

శ్రీరాములు చెప్పడం ప్రారంభించాడు.

"నేను కృష్ణమోహన్ని కలుసుకోవాలనుకోలేదు. అతడే వెతుక్కుంటూ వచ్చి నన్ను కలుసుకున్నాడు. నీ

క్షేమ సమాచారాలు పదేపదే అడిగాడు. యేడాదిక్రితం అతడి భార్య పోయింది. అప్పట్నించీ అతడికి పిచ్చిపట్టి నట్లుంటోందిట. ఒంటరితనం బాధపెడుతోందిట. నన్ను వాళ్ళింటికి పిలిచాడు. ఇల్లు పెద్దది. ఒక్కడే మనిషి. భార్యతో పట్టుమని అయిదేళ్ళు కూడా కాపురం చేసినట్లు లేదు. ఆమె ఫోటోలు చూపించాడు. మనిషి అంద మైనదే....కానీ నీ అంత కాదు. అతడితో యేంమాట్లా డాలో నాకు తెలియలేదు. అతడే నాకు తాగుడు ఆఫర్ చేశాడు. నేను తాగనని చెప్పినా వినలేదు. ఫలితంగా నేను తాగినట్లు నటించాను. అతడు తాగాడు. నేను తాగుతున్నానో లేదో పట్టించుకోకుండా తను విపరీ తంగా తాగాడు. కాసేపటికి అర్థంలేని వాగుడు మొద లయింది. అందులోంచి ఈ నిజం బైటపడింది."

"మీరు కూడా తాగారేమో! మీరు విన్నానను కున్నది మీ భ్రమేమో!"

"సీతా—ఇంతవరకూ పడ్డ భ్రమ చాలు నాకు!"

"అయితే ఇప్పుడేమంటారు?"

"నేనేమీ అనను. నువ్వే అనాలి!"

"ఏమనను?"

"ఇప్పుడే కదా—నీకు మాత్రమే తెలిసిన నిజం నాకూ తెలిసిందని నీకు తెలిసింది! దీనికి బదులేమిటో బాగా ఆలోచించుకో. ఆలోచించుకుని నాకు చెప్పు."

"మీరు నిజమంటున్నది అబద్ధమని నేనంటే మీరు నమ్ముతారా?" అంది సీత.

"నమ్మను."

"ఋజువులు చూపిస్తే!"

"నేను ఋజువులు చూసే వస్తున్నానన్న విషయం

నువ్వు గ్రహించాలి."

"మీరు ఋజువులు చూడలేదు. విన్నారు."

"విన్నవి చెప్పాను. చూసినవి కూడా చెప్పాలా?"

"చెప్పండి. ఇన్ని విన్నదాన్ని అవీ వింటాను."

"నీ బావ నీమీద ప్రేమతో నీ ఫోటోలు కోరాడు. అతడిమీద ప్రేమతో అతడు కోరినవిధంగా నువ్వు పోజులిచ్చావు. అతడు ఫోటోలు తీసుకున్నాడు."

సీత తెల్లబోయినట్లు తెలిసిపోతోంది.

"ఆ ఫోటోలు చూసి నేనూ తెల్లబోయాను. ఎటొచ్చీ నీ శరీరంలో అణువణువూ తెలిసిన నాకా ఫోటోలు నీవనటానికి సందేహంలేదు."

సీత యేడ్వడం ప్రారంభించింది.

"ఏడవకు. తప్పులు జీవితంలో అంతా చేస్తారు. కానీ మనం కలిసి పన్నెండేళ్ళు కాపురం చేశాం. నువ్వింతేనా నన్నర్థం చేసుకున్నది? నువ్వు చేసిన యేలాంటి తప్పునైనా నేను క్షమించడానికి సిద్ధం! నీలో తాత్కాలిక బలహీనత యేర్పడితే అందుకు నా లోపం కూడా ఉండి వుండాలి. మనం ఒకరినొకరు సానుభూతితో అర్థం చేసుకోవాలి. నేను నిన్ను ఇంట్లోంచి గెంటివేయబోవడంలేదు. నేను నీకు విడాకు లివ్వబోవడంలేదు. మనం యెప్పటికీ కలిసే ఉంటాం. అయితే ఒక్క విషయం నన్ను బాధిస్తోంది. నువ్వు నన్ను మోసం చేశావు. నీ తప్పుల్ని నేను క్షమించగలను. కానీ మోసాన్ని భరించలేను."

"తప్పుకీ మోసానికీ తేడా యేమిటి?"

"అనుకోకుండా నీవల్ల తప్పు జరిగితే అది వెంటనే నాకు చెప్పాలి. అప్పుడు నేను నిన్ను క్షమిస్తాను. ఆ తప్పు దాచిపెడితే అది మోసం!"

"అయితే చెబుతున్నాను వినండి. నేను తప్పుచెయ్య లేదు. కాబట్టి మోసమూ చెయ్యలేదు" గంభీరంగా అంది సీత.

"తగిన సాక్ష్యాధారాలు లభించడంవల్ల నేరం ఋజువై పోయింది. ఇప్పుడు కథను వినదల్చుకోలేదు మళ్ళించకు. మన మాలోచించవలసింది తీర్పు గురించి మాత్రమే!"

"అయితే మీ తీర్పేమిటి?"

"ఈ విషయంలో నేను నీ సలహా కోరుతున్నాను. అందుకు నీకు వారం రోజుల వ్యవధి ఇస్తున్నాను."

## 2

ఆ రాత్రి సీత వేరే పడుకుంది. ఆమె ఆలోచనలు గతం చుట్టూ తిరుగుతున్నాయి.

కృష్ణమోహన్ ఆ ఊర్లో చేప్పముందు వరకూ రెయింలో సాఫీగా సాగిపోయింది తన జీవితం. మంచి ఉద్యోగంలో, చక్కటి హోదా వున్న భర్త....ముచ్చటైన పిల్లలిద్దరు....

అసలిప్పుడిక పిల్లలు వద్దనే తాననుకుంది. శ్రీరాములు మాత్రం కనీసం నలుగురైనా పిల్లలుండాలి అనేవాడు. సీత మాత్రం నెమ్మదిగా అతడికి నచ్చచెప్పాలనుకుంది.

కానీ....

కృష్ణమోహన్ శ్రీరాములు ఆఫీసులో ముగ్గురాడ పిల్లలతో అక్రమ సంబంధం పెట్టుకున్నట్లు సీతకు చెప్పాడు. అందుకు తిరుగులేని ఋజువులూ, సాక్ష్యాలూ సంపాదించి పెట్టాడు.

సీతకు కళ్ళు తిరిగిపోయాయి. ఆమె భర్తను నిల దీసింది.

భర్త ముందు కాదన్నాడు. తర్వాత దబాయిం

చాడు. చివరకు "మగాణ్ని, నా యిష్టం" అన్నాడు.

"పవిత్రత ఆడదానికే కాదు, మగాడికీ వుండాలి" అంది సీత.

"మరి నేను పవిత్రుణ్ని కాదుగా! అందుకని పోనీ నువ్వు కూడా మనింటికి వస్తూ పోతూంటే నీ బావతో కలుసు. కాదన్నానా?" అన్నాడు శ్రీరాములు.

సమాజం ఆడదాన్నెంతగా అణచి ఉంచిందో తెలియడం వల్లనేమో—చాలామంది మగాళ్ళు భార్యలపై ఇలాంటి సవాళ్ళు విసురుతూంటారు.

"ఛా—అదేం మాటలండీ" అంది సీత.

"అమాయకంగా మాట్లాడకు. ఇప్పటికే మీ ఇద్దరికీ యే సంబంధం లేదని నన్ను నమ్మమంటావా?" అన్నాడు శ్రీరాములు.

"మీరు నమ్మకపోతే అబద్ధం నిజం కాదు."

శ్రీరాములు నవ్వి "ఎలాంటి ఋజువులున్నా నేను నిన్ను నమ్ముతాను. అలాగే నువ్వూ నన్ను నమ్మాలి. భార్యాభర్తలకు నమ్మకం ముఖ్యం" అన్నాడు.

"ఋజువులుంటే మీరూ నన్ను నమ్మకండి. ఇకమీదట మీరు మీ ప్రవర్తనను సరిదిద్దుకోండి" అంది సీత.

"నా ప్రవర్తన గురించి ఒక్క ముక్క మాట్లాడినా నేను సహించను. ఆఫీసులో నేనెలాగుంటున్నానూ అన్నది నీ కనవసరం. ఆఫీసునుంచి వచ్చిన మగాడినెలా ఆదరించాలీ అన్నదే నీ బాధ్యత. ఇల్లు నీ పరిమితి. నీ పరిమితులు తెలుసుకుని మసులుకో" అన్నాడు శ్రీరాములు.

"లేకపోతే!"

"లేకపోతే నేను నీ ప్రవర్తనను తప్పుపడతాను."

శ్రీరాములామెను దారుణంగా బెదిరించాడు,

మగాడు తప్పుచేస్తే సమాజమతణ్ని క్షమిస్తుంది. ఆడది తప్పుచేస్తే ఆమెకు నిలువ నీడ లేకుండా చేస్తుంది సమాజం. మగాడు తప్పుచేసి చేయలేదని బుకాయిస్తే అంతా నమ్ముతారు. ఆడదానిపై అబద్ధపుటారోపణ చేస్తే చాలు—సమాజమామెను వన్యమృగంలా వేటాడుతుంది.

సీత తన బాధను కృష్ణమోహన్‌కు చెప్పుకుంది. కృష్ణమోహన్ ఆమెలో భర్తపట్ల ద్వేషాన్ని రెచ్చగొట్టాడు.

"నీ భర్తను నువ్వేం చేయలేవు. అందువల్ల మానసికంగా అతడంటే నీకు ఏహ్య భావం కలుగుతుంది. ఫలితంగా మీ కాపురం నరకమవుతుంది. నువ్వతడిమీద ప్రతీకారం సాధించు. అప్పుడు నీ మనసు తేలికగా ఉంటుంది" అన్నాడు కృష్ణమోహన్.

"ప్రతీకారమంటే యేం చేయాలి?"

"ప్రతికారంలో కరుణను కలిపితే—కరుణ నాపైనా ప్రతీకారం నీ భర్తపైనా అవుతుంది"

ఏం చేయాలో సీత కర్థమయింది.

"తప్పుకదూ!" అంది సీత.

"నీ భర్తను తప్పుచేయకుండా ఆపలేవు. నువ్వూ తప్పుచేశాననుకో. అప్పుడు నీలో తప్పుచేశానన్న అనుభూతి కలిగి—అతణ్ని క్షమించగల్గుతావు."

"కానీ తప్పు కూడా చేస్తున్నానుగా!"

"తప్పు చేస్తున్నానన్న అనుభూతి నీలో ఉండవచ్చు కానీ నిజానికి ప్రతీకారం తప్పుకాదు."

పెళ్ళికి ముందు సీత కృష్ణమోహన్ అంటే ఇష్టపడింది. ఇద్దరికీ బాల్యంనుంచీ పరిచయముంది. కృష్ణమోహన్ తెలివిగా ఆమెను ప్రోత్సహిస్తున్నాడు.

సీత అతడికి లొంగిపోయింది.

తప్పు ఒకసారే తటపటాయించేలా చేస్తుంది.

భర్తపై ప్రతీకారం తీర్చుకుంటున్నానని ఆత్మవంచన చేసుకుంటూ సీత కృష్ణమోహన్‌తో మూడేళ్ళు వ్యవహారం నడిపింది. భర్తమీద ద్వేషంతో ఆమె తన అభీష్టానికి వ్యతిరేకంగా మరో యిద్దరు పిల్లల తల్లి అయింది.

ఆమె తప్పుకు కృష్ణమోహన్ ప్రతీకారం అన్న పేరు పెట్టాడు. కానీ అది తప్పేనని సీతకు తెలుసు. అయితే ఆ తప్పు ఆమెను భర్తకు దూరం కాకుండా చేసింది. భర్త తప్పులు చేస్తున్నా అతడికామెపట్ల అనురాగం పెరగసాగింది.

ఆడది భర్త తప్పుల్ని క్షమించగలిగినట్లు తన తప్పులు క్షమించుకోలేదు. కృష్ణమోహన్ కారణంగా సీత శ్రీరాములు జీవితకాలంపాటు చేసే తప్పుల్ని క్షమించ గల మానసిక స్థితికి వచ్చేసింది.

కృష్ణమోహన్ ఆ ఊరొదిలి వెళ్ళిపోయాక వారి సంసార జీవితం మరింతత సాఫీగా సాగిపోతోంది.

ఇప్పుడు కృష్ణమోహన్ వారి జీవితంలో కలతలు సృష్టించాడు. ఇలా జరుగుతుందని ఆమె ఊహించలేదు.

శ్రీరాములు తెలుసుకున్నదంతా నిజం! కానీ సీత తన ప్రాణంపోయినా ఆ నిజాన్నొప్పుకోదు శ్రీరాములి ముందు.

శ్రీరాములు సీతకు వారం రోజుల వ్యవధి నిచ్చాడు. ఈ లోగా యేదో చేయాలి.

మర్నాడు సీత "స్టార్టు ఇమ్మీడియెట్లీ" అని కృష్ణ మోహన్‌కి టెలిగ్రాం ఇచ్చింది.

# 3

అది ఉదయం పదకొండు గంటల సమయం.

శ్రీరాములు ఆఫీసుకు వెళ్ళాడు. పిల్లలు నలుగురూ స్కూలుకి వెళ్ళారు.

డ్రాయింగ్ రూంలో యెదురెదురు కుర్చీల్లో కృష్ణమోహన్, సీత కూర్చుని వున్నారు.

సీత ముఖం గంభీరంగా ఉంది.

కృష్ణమోహన్ ముఖంలో ఉత్సాహం తొంగి చూస్తూంది.

"నువ్వు నా కాపురంలో నిప్పులు పోశావు" అంది సీత.

"అవును."

"ఎందుకిలా చేశావు?"

"సీతా— నాకు నువ్వు కావాలి."

"కానీ నాకు పెళ్ళయింది. నలుగురు పిల్లలు."

"మొదటి యిద్దర్నీ నీ భర్తకు విడిచిపెట్టి విడాకులు తీసుకో. చివరి యిద్దర్నీ తీసుకుని నా దగ్గరకు వచ్చేయి. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను."

"నాకు పెళ్ళయింది. మళ్ళీ పెళ్ళెందుకు?"

"మరి నాకు భార్య పోయిందిగా!"

"అయితే భర్తపోయిన మరో అమ్మాయిని వెతికి పెళ్ళిచేసుకో."

"సీతా! నాకు నువ్వంటే యిష్టం. నీకూ నేనంటే యిష్టం. నా పిల్లలిద్దరు నీ దగ్గర పెరుగుతున్నారు."

"జరిగింది మర్చిపో."

"మర్చిపోయి ఏం చేయను?"

"ఏంచేసినా మళ్ళీ నా జీవితంలో అడుగుపెట్టాలను

కోదు."

"అలాగనకు సీతా! నాకు నువ్వు కావాలి!"

"కానీ నువ్వు నాకు వద్దు. అగ్నిసాక్షిగా నా మెడలో తాళికట్టిన భర్త శ్రీరాములు. నా ప్రాణం పోయేవరకూ అతడే నా భర్త. అతడు తప్పుచేశాడన్న కోపంతో నేనూ తప్పుచేశాను. నా ప్రతీకారం అయిపోయింది. ఇక నువ్వు నామీద ఆశలు పెట్టుకోకు. ఇది నా నిర్ణయం. నీకు హెచ్చరిక!"

"అయితే నువ్వు నన్నెందుకు పిలిపించినట్లు?"

"వెళ్ళి నా భర్తకు చెప్పు. నువ్వు చెప్పిన మాటలూ, చూపించిన సాక్ష్యాలూ అన్నీ అబద్ధమని నా భర్తను నమ్మించు."

"అలా చేయడానికే అయితే నేను నీ భర్తనెందుకు కలుసుకుంటాను? మనకు సంబంధించిన నిజాలన్నీ ఎందుకు చెబుతాను?"

"తాగుడు మైకంలో యేమైనా అనొచ్చు. చేయొచ్చు. అది తప్పుగా గ్రహించి సవరించుకోవాలి."

"నేను తాగను. నా యింట్లో తాగుడుకు సంబంధించిన పదార్థాలేమీ ఉండవు. ఉన్నవల్లా సీసాలు. సీసాల్లో ఫలరసాలు. నేను తాగినట్లు నటించాను. తాగుడు మైకాన్ని అభినయించాను. కావాలనే శ్రీరాములుకు మన గురించిన నిజాలు చెప్పాను."

సీత కళ్ళెర్రబడ్డాయి.

"నా భర్త తప్పుల్ని క్షమించాను. నిన్ను మాత్రం ఈ జీవితంలో క్షమించలేను. తక్షణం బైటకు వెళ్ళు. నీకు నామీద ప్రేమాభిమానాలున్నాయనుకుంటే మా వారికి నా గురించి మంచిగా చెప్పు. నా మంచితనం

గురించి వారిని నమ్మించు. అలా చేయకుండా మరోసారి నా కళ్ళబడ్డావో నేను నిన్ను హత్య చేస్తాను."

కృష్ణమోహన్ అదోలా నవ్వి—"నీ పవిత్రత చిత్రమైనది. అర్థంలేనిది. నీకు పెళ్ళయ్యాకే నువ్వు నా దానివయ్యావు. ఇప్పుడిలా యెందుకు మాట్లాడుతున్నావో నాకు తెలియడంలేదు. పెళ్ళయ్యాక నాతో వ్యవహారం నడిపినదానివి—నన్ను పెళ్ళిచేసుకుందుకు నీకేమభ్యంతరం? నేనేం తప్పుగా మాట్లాడలేదే! నిన్ను సగౌరవంగా, భార్య స్థానంలో నా జీవితంలోకి ఆహ్వానిస్తున్నాను-" అన్నాడు.

"గెటౌట్!" అంది సీత.

"నా మాట విను" అన్నాడు కృష్ణమోహన్.

"ఐసే గెటౌట్!" అంది సీత.

అప్పుడు సీత యే క్రూరమృగంలాగో కనబడితే కృష్ణమోహన్ భయపడి ఉండేవాడు కాదు.

దేవతో, దెయ్యమో—ఆమె అతడికి మానవాతీత శక్తిలా కనబడింది.

కృష్ణమోహన్ అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

## 4

"వారం రోజులూ అయిపోయాయి. నువ్వింకా నాకు నీ సలహా చెప్పలేదు" అన్నాడు శ్రీరాములు.

"బావ మిమ్మల్ని కలుసుకోలేదా?"

"అతగాడు నన్ను కలుసుకున్నాక నే కదా నేను సలహా అడిగాను."

"ఆ తర్వాత?"

శ్రీరాముడామె వంక చురుగ్గా చూసి—"నువ్వతణ్ణి కలుసుకున్నావా?" అన్నాడు.

"అవును. టెలిగ్రాం కొట్టి రప్పించాను."

"ఎందుకు?"

"మీకు నిజం చెప్పగలిగినది అతనొక్కడే!"

"చెప్పేవాడుగా పాపం!"

"చెప్పింది నిజం కాదు."

"సాక్ష్యాలు కూడా వున్నాయి."

"అబద్ధాన్ని నిజం చేసే సాక్ష్యాలతడికెలా వచ్చాయో నాకు తెలియదు. అవి అబద్ధపు సాక్ష్యాలని అతడు నా దగ్గర ఒప్పుకున్నాడు. మీ నుంచి విడాకులు తీసుకుని తన్ను నేను పెళ్ళి చేసుకుంటానన్న ఆశతో అతడు సృష్టించిన అబద్ధపు సాక్ష్యాలు మీరు నమ్మారు. మీరిప్పటికిప్పుడు హైదరాబాదు వెళ్ళి అతడింట్లో పరీక్షించవచ్చు. ఆ ఇంట్లో విస్కీ బాటిల్సుండొచ్చు కానీ బాటిల్సులో విస్కీ ఉండదు. తాగుడు మైకాన్ని నటించి అతడు మీకన్నీ అబద్ధాలే చెప్పాడు."

శ్రీరాములామె మాటలకు వ్యంగ్యంగా నవ్వాడు.

"అలా నవ్వకండి. బావ అన్నీ ఒప్పుకున్నాడు. మీకు చెబుతానన్నాడు. నన్ను నమ్మండి."

"నేను నిన్ను నమ్మను."

"మీదాన్ని నన్ను నమ్మకుండా పరాయివాడు బావని నమ్ముతారా?" అంది సీత ఉక్రోషంగా.

"ఇకమీదట నీ బావని కూడా నమ్మనని హామీయిస్తున్నాను."

సీతకు యేడుపు వచ్చింది.

"ఏడుపు నీకు ఉపశమనాన్నిస్తుందేమో! నాకు నీ సలహాయే ఉపశమనాన్నిస్తుంది"

సీత కళ్ళు తుడుచుకుంది. గొంతు సవరించుకుంది.

"మీ గతం మాకేమిటి?"

ఆ ప్రశ్న గదిలో ప్రతిధ్వనించింది.

శ్రీరాములు నవ్వి—"నేను మగాణ్ని" అన్నాడు.

గదిలో ప్రతిధ్వనిస్తున్న ప్రశ్న నా సమాధానం పరిహసించింది.

"మగాడికాడదాని సలహా కావాలా?" అంది సీత.

"మగాడడిగితే సలహా ఇవ్వాలి. అడిగితేనే ఇవ్వాలి. ఇచ్చిన సలహా మగాడు మెచ్చేదిగా ఉండాలి."

"నాకు నలుగురు పిల్లలున్నారు. వాళ్ళ భవిష్యత్తు నాకు ముఖ్యం. మీరనుకునే భయంకర గతం నాకు లేదు. ఉందని మీరు నమ్మే పక్షంలో అది గతించిందనుకోండి. భవిష్యత్తులో నావల్ల తప్పు జరుగదు. జరిగితే నేనే ఈ యిల్లు వదిలి పోతాను" అంది సీత.

"నీ సలహా నాకు నచ్చింది. కానీ ఈ ఇంట్లో యిక మీదట నీవు నా సహధర్మచారిణివి కావు. దాసివు" అన్నాడు శ్రీరాములు.

"ఆ రెండు పదాలకూ తేడా ఉంటుందని ఇంతవరకూ ఈ ఇంట్లో నాకు అనిపించలేదు" అంది సీత.

"ఇకమీదట అనిపిస్తుంది" అన్నాడు శ్రీరాములు.

## 5

శ్రీరాములు ఆఫీసునుంచి వస్తూ రెండు ప్యాకెట్లు తెచ్చాడు.

"ఏమిటండీ యివి?" అంది సీత.

"ఫ్యామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకుని రెండేళ్ళయితే ఆ యింక్రిమెంటు ఇప్పటికి అమలు జరిగి అరియర్సు వచ్చాయి. పిల్లలకోసం బట్టలు తెచ్చాను"

అన్నాడు శ్రీరాములు.

సీత ఉత్సాహంగా పిల్లల్ని పిలిచింది.

తండ్రి తమకోసం యేదో తెచ్చాడని పిల్లల
హంగా పరుగున వచ్చారు.

శ్రీరాములు పెద్దకొడుక్కి పాంటు, షర్టు ఇచ్చా
పెద్దకూతురికి మాక్సీ యిచ్చాడు. బట్టలతోపాటు
స్వీట్సు ప్యాకెట్లు కూడా తెచ్చాడు. అతడవి కూ
పెద్ద కొడుక్కి, కూతురికే యిచ్చాడు.

చిన్నవాళ్ళిద్దరూ దిక్కు మొహాలు వేశారు.

ఆఖరి పిల్ల కాస్త తెగించి—"మాకేవి నాన్నా" అంది.

"బట్టలు మీకు లేవు చిన్నవాళ్ళు కదా! మీ కొత్తబట్టలవసరం. పెద్దవాళ్ళకు పొట్టి అయిన వుంటా
కదా—అవి మీకు!" అన్నాడు శ్రీరాములు.

"మరి బిళ్ళలు!" అన్నాడు రెండో కొడుకు.

"పెద్దవాళ్ళను మంచి చేసుకోండి. వాళ్ళు పెడితే మీకు స్వీట్సు!"

"అలా అంటే వాళ్ళేడిపిస్తారు నాన్నా!"

"చిన్నపిల్లలకు బుద్ధి రావాలంటే పెద్దవాళ్ళను మంచి చేసుకోవాలి! వెళ్ళండి" కసిరాడు శ్రీరాములు.

పిల్లలు నలుగురూ అక్కణ్నించి వెళ్ళిపోయారు.

"యేమిటి మీరు చేస్తున్నది?" అంది సీత.

"నా పిల్లల్ని నీ పిల్లల్నుంచి వేరు చేస్తున్నాను."

"వాళ్ళు మన పిల్లలు."

"అందులో ఇద్దరే మన పిల్లలు. ఇద్దరు నీ పిల్లలు."

సీత మాట్లాడలేదు.

"ఈ యింట్లో నా పిల్లలు మహారాజులు. నీ పిల్లలు

వారికి బానిసలై ఊడిగం చేయాలి."

"ఎందుకని?"

"నలుగురూ సమంగా ఉండడం నేను సహించలేను."

"తేడా చూపిస్తే నేను సహించలేను."

"సహించక నువ్వేం చేయగలవు? నువ్వు నా బానిసవు."

సీత కళ్ళలో నీళ్ళు తిరిగాయి "అలా మాట్లాడకండి!" అందామె.

"అలా మాట్లాడితే సహించి ఉండగలిగినప్పుడే నువ్వూ నేనూ కలిసి ఉండడం సాధ్యపడుతుంది."

"మీరు చాలా క్రూరంగా ప్రవర్తిస్తున్నారు" అంది సీత.

శ్రీరాములు నవ్వాడు. ఆ నవ్వు కూడా క్రూరంగా వుంది.

# 6

ఆ రోజు కూడా శ్రీరాములు ఇంటికి రెండు ప్యాకెట్లు తెచ్చాడు. ఈసారి సీత అవేమిటి అని అడగలేదు. పిల్లల్ని పిలవలేదు. అతడు పిలవమంటే మీరే పిల్చుకోండి అందామె.

సీత ఆశ్చర్యపోయే విధంగా అతడు చివరిపిల్లలిద్దర్నీ పిలిచాడు. తండ్రి పిలుపు వింటూనే వాళ్ళు పరుగున వచ్చారు.

తను తెచ్చిన రెండు ప్యాకెట్సు నుంచీ చెరో రెండు స్వీట్సుతీసిచ్చాడు శ్రీరాములు. వాళ్ళు వెళ్ళిపోబోతూంటే__"ఆగండి. నా కళ్ళెదురుగా మీరిద్దరూ ఇవి తిని యెలాగున్నాయో చెప్పండి" అన్నాడు.

పిల్లలిద్దరూ స్వీట్సు చకచకా తినేసి "చాలా బాగు

న్నాయి నాన్నా!" అన్నారు.

ఈలోగా పెద్దవాళ్ళిద్దరూ అక్కడికి వచ్చారు. నిన్నటి దినం తమకు జరిగిన మర్యాద ఈ రోజు తమ కంటే చిన్నవాళ్ళిద్దరికీ జరిగేసరికి వాళ్ళోర్వలేక పోయారు. ఇద్దరూ తండ్రిని సమీపించి "మాకో స్వీట్సు" అన్నారు.

"మీకు అప్పుడే కాదు. కాసేపున్నాక" అన్నాడు శ్రీరాములు. వాళ్ళు మారాం చేయబోతే అతడు కసిరాడు.

నలుగురు పిల్లలకూ కూడా తండ్రి దగ్గర చేరిక తక్కువ. వాళ్ళు భయం భయంగా అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

"ఎంత లేదన్నా పితృహృదయం! మీ పిల్లల్ని మీ రవమానించలేరు. నిన్న జరిగినదానికి మీ మనసు వ్యథ పడుతోంది" అంది సీత సంతోషంగా.

శ్రీరాములు నవ్వాడు. ఆ నవ్వు క్రూరంగానే ఉంది.

"క్రూరత్వం మీకు సరిపడదు. అలా నవ్వకండి" అంది సీత.

"అసలు జరిగినదేమిటో తెలిస్తే నీవిలా తాపీగా ఉండలేవు" అన్నాడు శ్రీరాములు తాపీగా.

"ఏం జరిగిందో చెప్పండి!"

"ఆఫీసులో పార్టీ కోసం తయారయిన స్వీట్స్వి. అందులో కొంత పోర్షన్లో విషం కలిసిందని అనుమానం. అది పొరపాటున జరిగింది. మొత్తం స్వీట్సన్నీ అవతల పారేసే బాధ్యత నా కప్పగించారు. అందులో కాసిని తీసి నేను రెండు పొట్లాలుగా కట్టి ఇంటికి తెచ్చాను."

సీత కంగారుగా "నా పిల్లల్ని విషం పెట్టి చంపేయా లనుకుంటున్నారా? నేనిది సాగనివ్వను" అంది.

"అలా కంగారుపడకు. స్వీట్సులో విషం కలవలేదనీ వంటవాడి అభిప్రాయం పొరపాటనీ నా అనుమానం. అందుకే రెండు పొట్లా లింటికి తెచ్చాను. అయితే అను మానమున్నప్పుడు నివృత్తి చేసుకోవాలిగదా! మహారాజు లింట్లో ఇలాంటి వాటికోసమే పిల్లుల్ని పెంచేవారు. నా ఇంట్లో బానిస పిల్లల్ని పెంచుతున్నాను" క్రూరాతి క్రూరంగా నవ్వాడు శ్రీరాములు.

సీత ఆక్రోశించి పరుగెట్టింది.

శ్రీరాములు వెంటబడి ఆమెను గట్టిగా పట్టుకుని పడక గదిలోకి లాక్కొని వెళ్ళిపోయాడు.

"నన్ను వదలండి!" అందామె గింజుకుంటూ.

"కాసేపు నువ్విక్కడే ఉండాలి" అంటూ అత డామెను మంచంమీదకు తోసి తను గదిలోంచి బయ టకు వచ్చి తలుపులు వేసి గొళ్ళెం పెట్టాడు.

తర్వాత తనక్కడే కూర్చుని పేపరు తీశాడు.

అతడు పేపరు చదువుతూండగా కాసేపటికి పిల్లలు నలుగురూ అక్కడకు వచ్చారు.

"అమ్మేదీ?" అంది ఆఖరుపిల్ల.

"అమ్మకు తలనొప్పిగా ఉండి బెడ్రూంలో పడు కుంది" అన్నాడు శ్రీరాములు.

"అమ్మ కావాలి" అందాపిల్ల ఏడుపుగొంతుతో.

"ఏడవకు" గద్దించాడు శ్రీరాములు.

ఆఖరుపిల్ల ఏడుపు నాపుకుందుకు ప్రయత్నిస్తోంది.

శ్రీరాములు పెద్దపిల్ల లిద్దరివంకా చూసి "మీ రిద్దరూ వీళ్ళిద్దరిచేతా పనులేం చేయించుకోవడం లేదేం?"

అన్నాడు.

"పనులంటే?" అన్నాడు పెద్దకొడుకు.

"మీ బట్టలు మడత పెట్టడం, పుస్తకాలు సర్దడం, పెన్నుల్లో ఇంకు పోయడం, బూట్లు పాలిష్ చేయడం వగైరా వగైరా...."

"భలే భలే" అంది పెద్దకూతురు.

"మీరు వీళ్ళచేత అన్ని పనులూ చేయించుకుంటే కోటా మీద మంచి బహుమతు లిస్తాను" అన్నాడు శ్రీరాములు.

"అమ్మ కావాలి" అంది ఆఖరి కూతురు యేడుపు నాపుకోలేక.

శ్రీరాములు చేతిలోని పేపరు మడతపెట్టి పెద్దకొడుక్కిచ్చి—"ఇది దాచు" అన్నాడు. వాడది తీసుకుని వెళ్ళబోతూంటే—"నేను చెప్పిందప్పుడే మర్చిపోయావా?" అన్నాడు.

"ఏమిటి?" అన్నాడు వాడర్థంకాక.

"నీ పనులు నువ్వు నీకంటే చిన్నవాళ్ళకు చెప్పాలి."

"ఈ పేపరు దాచిరావే" అన్నాడు వాడు వెంటనే తన పెద్దచెల్లిపై అథార్టీ చేస్తూ.

"మగపిల్లల్లో నువ్వు పెద్ద. ఆడపిల్లల్లో అది పెద్ద. మీ ఇద్దరూ ఒకరిమీద ఒకరు అథార్టీ చేసుకోకూడదు. ఒకరిపను లొకరు చేయకూడదు. ఏ పనులైనా మీరు చిన్నవాళ్ళిద్దరికీ చెప్పి చేయించుకోండి."

"అయితే ఒకేయ్ ఈ పేపరు దాచరా" అంటూ పెద్దవాడు తమ్ముడిమీద అథార్టీ చేశాడు.

"నాన్నా! నాకూ యేదైనా పని చెప్పు. చెల్లికి చెబు

కాను" అంది పెద్దకూతురు సరదాగా.

"ఇప్పటికేం పనిలేదు. కావాలంటే నీ కాళ్ళు నొక్కుమను."

"ఓసేవ్ నాకు కాళ్ళు లాగుతున్నాయ్. నా కాళ్ళు నొక్కవే!" అంది పెద్దకూతురు వెంటనే. చిన్నది ఏడుస్తూ—"అమ్మ కావాలి" అంది.

"నాతో రా!" అన్నాడు శ్రీరాము లేమనుకున్నాడో.

ఇద్దరూ గుమ్మందాకా వెళ్ళారు. శ్రీరాములు గొళ్ళెం తీశాడు.

సీత అంతవరకూ తలుపుల దగ్గరే ఉన్నట్లుంది. గొళ్ళెం తీసిన చప్పుడయిన వెంటనే భళ్ళున తలుపులు తెరుచుకున్నాయి.

"అమ్మా! అంతా నన్నేడిపిస్తున్నారు" అందాఖరి కూతురు ఏడుపు గొంతుతో. కానీ ఆశ్చర్యంతో దాని ఏడుపు వెంటనే ఆగిపోయింది. ఎందుకంటే దానికంటే ఎక్కువగా సీత వెక్కి వెక్కి ఏడుస్తోంది.

## 7

ఇంట్లో జరిగే సంఘటనలు సీతకు బాధాకరంగా పరిణమించాయి. శ్రీరాములులో మార్పు వస్తుందని ఆశిస్తూంటే రోజు రోజుకీ పెచ్చుమీరిపోతున్నాడతడు.

సీత ఆఖరి పిల్లలిద్దరికీ కష్టాలు ప్రారంభమయ్యాయి. శారీరకంగా శ్రమను మించి మానసికంగా హింసించబడుతున్నారు వాళ్ళు. ఇంట్లో అంతవరకూ సమాన హోదాలో పెరిగి అప్పుడున్నట్లుండి అవమానాలకు గురవడం వాళ్ళు తట్టుకోలేకపోతున్నారు. ఎవరైనా కలిసి యెన్ని కష్టాలయినా రిభించగలరు. కానీ అన్నదమ్ముల్లో, అక్క

చెల్లెళ్ళలో, అయినవారిలో ఒకరి సధికులుగా, ఒకరి నధములుగా గుర్తిస్తే ఆ బాధ అనుభవించినవారికే తప్ప అర్థంకాదు. అందులోనూ లేత మనసులు!

సీత తన పెద్దపిల్లలిద్దర్నీ అదుపుచేయాలని చూసింది. కానీ తండ్రి ప్రోత్సాహంతో వారూ పెడ్రేగిపోతున్నారు.

"మీ ద్వేషం కారణంగా మనింట్లో అంతా చెడిపోతున్నారు. చిన్నవాళ్ళ మనసుల్ని కలుషితం చేయకండి" అంది సీత.

"ఈ రోజున చెబుతున్నాను విను. మన యిల్లొక సౌతాఫ్రికా. ఈ యింట్లో నేను, నా యిద్దరు పిల్లలు తెల్లవాళ్ళు. నువ్వు నీ యిద్దరి పిల్లలు నల్లవాళ్ళు. తెలిసిందా....?" అని గద్దించాడు శ్రీరాములు.

ఏం చేయాలో తెలియక సీత అర్ధంటుగా బయల్దేరి రావలసిందిగా తల్లికి ఉత్తరం రాసుకుంది.

సీతకు తండ్రి లేడు. తల్లి మంచి వ్యవహారజ్ఞురాలు. ఉత్తరం చదవగానే సీత తల్లికి అర్థమయింది—కూతురి కాపురంలో యేవో కష్టాలున్నాయని! ఆమె తక్షణం కూతురి దగ్గరకు బయల్దేరింది. కూడా ఆఖరి కొడుకు గౌతమ్‌ని కూడా తీసుకుని వెళ్ళింది.

గౌతమ్ బీకాం ప్యాసై యేడాదయింది. అతని కుద్యోగం దొరకడం పెద్ద కష్టమేమీ కాదు. కానీ వ్యాపారం చేయాలని అతడనుకుంటున్నాడు. ఇంకా యే నిర్ణయానికీ రాలేదు. గౌతమ్‌కీ, శ్రీరాములుకీ మంచి స్నేహం. అత్తారింటికి వెళ్ళినప్పుడల్లా శ్రీరాములు గౌతంతో గంటల తరబడి మాట్లాడుతూంటాడు. గౌతమ్ యెంతలేని మాటలన్నా అతను ముచ్చటపడడమే తప్ప

కోపగించుకోడు.

అందుకే సీత తల్లి గౌతమ్‌ని వెంటబెట్టుకొని వెళ్ళింది.

వాళ్ళిద్దరూ సీత ఊరు చేరుకునేసరికి సాయంత్ర మయింది. ఇల్లు చేరుకునేసరికి శ్రీరాము లింట్లోనే ఉన్నాడు. అత్తగారినీ, బావమరిదినీ చూసి మాటవరస కూడా పలకరించలేదు.

సీత తల్లి తనకు తానై "హలాసా బాబూ!" అని పలకరిస్తే అతడు వినకట్లూరుకున్నాడు.

"ఏం బావా—పీకు చెవుడొచ్చిందా?" అన్నాడు గౌతమ్ నవ్వుతూ.

శ్రీరాములతడికూడా బదులివ్వలేదు. విసురుగా లేచి లోపలకు వెళ్ళిపోయాడు. మరో అయిదు నిముషాల్లో అతడు తన యిద్దరు పిల్లల్నీ తీసుకుని ఇంట్లోంచి వెళ్ళి పోయాడు.

పరిస్థితి సీరియస్‌గా ఉన్నట్లు అర్థమయింది సీతతల్లికి. కూతుర్ని పలకరించగా ఆమె యేడుస్తూ జరిగిందీ, జరుగు తున్నదీ చెప్పింది.

గౌతమ్ ఆవేశపడ్డాడు. తల్లి ఆవేదన చెందింది.

"అమ్మా! మీరెలాగో ఆయనలో మార్పు తీసుకు రావాలి" అంది సీత.

"అల్లుడికి నే చెబుతాలే" అంది తల్లి.

"మాటలతో వినకపోతే అప్పుడు నే నున్నాను" అన్నాడు గౌతమ్.

"ఒరేయ్—నువ్వేం కలగజేసుకోకు. అన్నీ నేను చూసుకుంటాను" అంది తల్లి కంగారుగా.

"అవసరమనిపిస్తే తప్ప కలగజేసుకోను. అవసరమని పించేనప్పుడు మాత్రం నన్నా దేవుడు కూడా ఆపలేడు"

అన్నాడు గౌతమ్.

రాత్రి తొమ్మిది కిల్లు చేరాడు శ్రీరాములు. అతడు, పిల్లలు బయట భోంచేసి వచ్చారు.

అల్లుడు ముభావంగా ఉన్నాడని తెలిసి కూడా తప్పనిసరై సీత తల్లి అతణ్ణి పలకరించింది.

"నా కిప్పు డెవరితోనూ మాట్లాడాలని లేదు" అన్నాడు శ్రీరాములు.

"కానీ తప్పదు. ఒక్కసారి నా మాట వినాలి నువ్వు" అంది సీత తల్లి.

"నాకా అవసరం లేదు."

"అవసరం నాదే—ఒప్పుకుంటున్నాను. ఒక్కసారి నా మాట విను."

శ్రీరాములదోలా నవ్వి—"అత్తయ్యా! మీకు భర్త పోయి ఆరేళ్ళయింది. అందుకు నా సానుభూతి. అయితే మీ అవసరాలు నా ద్వారా తీరాలని నన్ను బలవంత పెడితే మీరంటే నా కసహ్యం వేస్తుంది. సమాజం విధించిన నీతి నియమాలు నాకు చాలా ముఖ్యం" అన్నాడు.

సీత తల్లి మ్రాన్పడిపోయింది.

తల్లి పక్కనే ఉన్న గౌతమ్ బావగారన్న మాటలకు ఆవేశంతో ఊగిపోతూ "అన్న మాటలు వెనక్కి తీసుకుని అమ్మకు క్షమార్పణ చెప్పరా! లేకుంటే ఈ క్షణమే నిన్ను చంపేస్తాను" అన్నాడు.

"మీ యింట్లో ఆడాళ్ళు చరిత్రహీనులని నాకు తెలుసు. మగాళ్ళు హంతకులయితే ఆశ్చర్యపోను."

"ఏం కూశావ్?"

గౌతమ్ ముందడుగు వేయబోతూంటే చేయి పట్టుకుని

ఆపింది తల్లి.

“నన్నాపకమ్మా!” అన్నాడు గౌతమ్.

“ఆమె ఆపినా ఆపకపోయినా అసలు విషయం తెలిస్తే నువ్వే ఆగిపోతావు. నీ తండ్రి ఫలానా అని మీ అమ్మ కచ్చితంగా నీకు చెప్పగలదేమో అడుగు” అన్నాడు శ్రీరాములు.

గౌతమ్ ఆవేశం పెరిగిపోయింది. కానీ అతణ్ని తల్లి చేయి పట్టుకుని చరచరా ఈడ్చుకొని వెళ్ళిపోయింది.

అంతవరకూ గుమ్మం దగ్గర నిలబడ్డ సీత లోపలకు వచ్చి—“మీరు హద్దులు దాటిపోతున్నారు” అంది.

“హద్దు లాడవాళ్ళకే—మగాళ్ళకు లేవు.”

“ఏ ఆధారంతో మీరు మా అమ్మనంత లేని మాట అన్నారు?”

“పండును చూసి చెట్టు పేరు తెలుసుకోవచ్చు!”

“ఓహ్—అయితే మిమ్మల్ని చూసి మీ అమ్మగురించి నేనూ తెలుసుకోవచ్చు నన్నమాట!”

సీత చెంప చెళ్ళుమంది.

“కొట్టండి. అయినా మళ్ళీ మళ్ళీ అంటాను. మీ అమ్మ కులట.”

మరోసారి సీత చెంప చెళ్ళుంది.

సీత అనడం మానలేదు. అతడు కొట్టడం మానలేదు.

చివరకు పశుబలమే నెగ్గింది. సీత స్పృహతప్పి పడిపోయింది.

## 8

మర్నాడుదయం....

పిల్లలందరూ స్కూలుకి వెళ్ళిపోయారు. శ్రీరాములు ఆ వెంటనే ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

"అక్కా! ఈ పశువుతో నువ్వు కాపురం చేయలేవు. మాతో బయల్దేరి వచ్చేసెయ్" అన్నాడు గౌతమ్.

"మీరు వెళ్ళిపోండి. నా కారణంగా మీ కవమాన మయింది" అంది సీత బాధగా.

"మా గురించి నాకేం బాధ లేదమ్మా! ఆడపిల్ల నిచ్చుకున్నవాళ్ళం దేనికైనా సహించాలి. కానీ నిన్న రాత్రి నువ్వు నీ అత్తగార్ని నిందించావు. అల్లుడు దిగజారాడని నువ్వూ దిగజారితే అతడికీ నీకూ సంస్కారంలో తేడా ఏముందమ్మా?" అంది సీత తల్లి.

"మాటకు మాట బాగా చెప్పిందక్క. ఇంక నేను దెబ్బకు దెబ్బ తీస్తాను. అమ్మా! నువ్వు నన్నాపద్దు" అన్నాడు గౌతమ్.

"మనమిక్కడికి వచ్చింది దాని కాపురం నిలబెట్టడానికి. కూలదోయడానికి కాదు. తెలుసా?" అంది సీత తల్లి.

ఆమె సీతకు భర్తతో ఎలా మసులుకోవాలో మరి కొన్ని నీతులు చెప్పి కొడుకును తీసుకుని వెళ్ళిపోయింది.

సాయంత్రం భర్త ఆఫీసు నుంచి తిరిగిరాగానే—

"అనవసరంగా అత్తగార్ని మాట లన్నాను. నన్ను క్షమించండి" అంది సీత.

శ్రీరాము లాశ్చర్యంగా ఆమెవంక చూశాడు.

"మీరు మా అమ్మ నవమానించారు. ఆ ఆవేశంలో నా మనసు వశం తప్పింది. అప్పుడు నేనేం మాట్లాడాలో నాకే తెలియదు. నన్ను మన్నించండి" అంది సీత.

"తప్పు తెలుసుకున్నావు. వెరీ గుడ్!" అన్నాడు శ్రీరాములు.

"మీరు కూడా ఆవేశంలో మా అమ్మనవమానించారు. క్షమార్పణ అడుగుతూ ఒక్క ఉత్తరం రాయండి. ఆవి డెంతో సంతోషిస్తుంది" అంది సీత.

"ఇందుకా నువ్వు నాకు క్షమార్పణ చెప్పావు...."

"అవును. నా తప్పును నేను తెలుసుకున్నాను. మీ తప్పును మీరు తెలుసుకోవాలి."

శ్రీరాములామెను సమీపించి రెండు చేతులతో ఆమె జుట్టును గట్టిగా పట్టుకుని—"మనమిద్దరం సమానులం కాదు. నువ్వు బానిసవు. నేను యజమానిని" అన్నాడు.

"అయితే?"

"మరోసారి సమానత్వం గురించి మాట్లాడితే నీ తలను గోడకేసి కొడతాను" అన్నాడతడామె జుట్టునింకా వదలకుండానే.

"అప్పుడు మీరు హంతకులవుతారు."

"నేను నిన్ను చంపను. హింసిస్తాను."

సీత ఏడుస్తూ "ఇంక మన కాపురం యెప్పటికీ ఇంతేనా?" అంది.

"నువ్వు బానిసలా పడుండి నేను చెప్పినట్లల్లా వింటూంటే నిన్ను కొట్టను. తిట్టను. ఇంట్లోంచి గెంటను. నీకు, నీ పిల్లలకు సమాన హోదా మాత్రం అడక్కు" అన్నాడు శ్రీరాములు.

సీత మారుమాట్లాడకుండా చీర చెంగులో కన్నీళ్ళొత్తుకుంది.

శ్రీరాములామె జుట్టు వదిలిపెట్టి "నేను రాక్షసుణ్ని కాను. స్వేచ్ఛావిహారం చేసి నువ్వే రాక్షసవనితలా ప్రవర్తించావు. మానసికంగా నిన్ను భరించడం నాకు

కష్టంగా ఉంది. అందుకే నిన్ను మానసికంగా హింసించి కొంత తృప్తి చెందుతున్నాను. మరో మగాడైతే నీకంటి దానికి నేనిచ్చిన స్థానం ఇస్తాడనుకోను" అన్నాడు.

"నాకే నేను తెగించి నా కాపురంలో నిప్పులు పోసుకోలేకపోతున్నాను. మీరందరి మగాళ్ళలాగే ప్రవర్తించి ఉంటేనే నాకు బాగుండేది. నన్ను నేను తప్పుపట్టుకోనవసరంలేకుండా మీకు దూరమయ్యేదాన్ని" అంది సీత.

"ఇప్పుడు నీకేం లోటు? తిండి, గుడ్డ, నీడ అన్నీ ఉన్నాయి నీకు. నీ పిల్లల్లో యిద్దరు మహారాజభోగంలో వెలిగితే మరో యిద్దరు సామాన్యులే అయినా తిండికీ గుడ్డకీ లోటులేకుండా వుంటారు" అన్నాడు శ్రీరాములు.

"మనిషి మనిషిని భరించవచ్చు. రాక్షసుణ్ణి భరించవచ్చు. కానీ రాక్షసుడిలాంటి మనిషిని భరించడం అసాధ్యం" అంది సీత.

## 9

సూర్యప్రకాశరావు ఉత్సాహంగా ఆటో దిగాడు. శ్రీరాములాయన కెదురై — "టెలిగ్రాం ఇప్పుడే అందింది నాన్నా — ఇంకా స్టేషన్‌కు బయల్దేరాలనుకుంటున్నాను. ట్రెయిన్ టైముకే వచ్చేసిందా" అన్నాడు.

"ఊఁ అమ్మాయింట్లోనే వుందా!" అన్నాడు సూర్యప్రకాశరావు.

"ఉంది" అన్నాడు శ్రీరాములు ముభావంగా.

ఇద్దరూ లోపల అడుగు పెట్టాక — "ఇలాంటి కాపురం ఎన్నాళ్ళు? నీ ఉత్తరం చూడగానే నేను నీ సమస్యకు పరిష్కార మార్గం ఆలోచించాను" అన్నాడు సూర్యప్రకాశరావు.

"కూర్చోండి నాన్నా!" అన్నాడు శ్రీరాములు.

సూర్యప్రకాశరావు కుర్చీలో కూర్చుని "అనుకోకుండా ఓ విశేషం జరిగింది. మా పెద్దన్నయ్య పెద్ద కొడుక్కి పిల్లలు లేరుగదా! అన్ని పరీక్షలూ చేయించుకున్నాడు. లోపం వాడిలోనే వుందిట. తన యోగం అంతేనని ఊరుకున్నాడు. కానీ నెల్లాళ్ళక్రితం వాడి తరఫు దూరపు బంధువు చనిపోతూ పదిలక్షల ఆస్తి ఇచ్చిపోయాడు. అంత ఆస్తికి వారసుడు లేకుండా పోవడం వాడికి నచ్చలేదు. వాడు నీ పెద్దపిల్లలిద్దర్నీ దత్తత చేసుకుంటాట్ట. నువ్వింకో పిల్లను పెళ్ళిచేసుకుని హాయిగా ఉండొచ్చు. ఆపరేషన్ చేయించుకున్నానన్న సంగతి పెళ్ళికిముందు చెప్పక్కర్లేదు. అటు నీ పిల్లలకు సవతిపోరూ ఉండదు. నీకు కాస్త మంచిపిల్ల భార్యగానూ వుంటుంది. అన్నింటికీ అణగిమణగి పడివుంటే సీత నీతో ఉంటుంది. దాని పిల్లల్ని నువ్వు ఆదరించవచ్చు. లేదా విడాకులిచ్చేసేయ్" అన్నాడు.

"నా పిల్లల్ని నేను దత్తతిచ్చేస్తే మరి నాకు పిల్లలుండరు. అప్పుడు సీత పిల్లలే నాకు గతి" అన్నాడు శ్రీరాములు.

"సీత పిల్లలు నీ పిల్లలు కాదన్న గ్యారంటీ ఏమీ లేదుకదా! లేనిపోని శంకలు మనసులో పెట్టుకోకు. ఆడాళ్ళు తప్పులుచేస్తే మగాళ్ళు వాటిని తెలివిగా ఉపయోగించుకోవాలి. నువ్విప్పుడు మళ్ళీ పెళ్ళిచేసుకుంటే యాభై వేలు కట్నం..."

"యాభై వేలా?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీరాములు.

మొదటి పెళ్ళికే అతడికి పదిహేను వేలు కట్నం వచ్చింది. రెండో పెళ్ళికి యాభై వేలిస్తారా?

"అవును. అలాగని పిల్లెలాగుంటుందని కంగారుపడకు. నేనే స్వయంగా చూశాను. చిదిమిదీపం పెట్టుకునేలా ఉంటుంది."

"మరైతే?"

"ఆఁ ఉన్నవాళ్ళమీద గిట్టనివాళ్ళు ప్రచారాలు చేస్తూనే ఉంటారుగదా! అలాగే ఆ పిల్లమీద కూడా యేవో అపవాదులున్నాయి. కళ్ళతో చూస్తే తప్ప ఏదీ నిజమని నమ్మకూడదంటాను నేను. పిల్లను చూశానుగదా! ఎంతో అమాయకంగా వుంది ముఖం. చూడగానే దేవత అనిపిస్తుంది. అలాంటి దేవతమీద అపవాదులు వేయడానికి మనుషులవల్లకాదు. వాళ్ళు డబ్బిచ్చి మంత్రుల్నైనా కొనేయగలరు. కానీ సంప్రదాయమంటే ప్రాణలాదే వాళ్ళు కావడంవల్ల నీవంటివాడికోసం వెతుకుతున్నారు. నీవంటివాడైతే—రెండో పెళ్ళి వాడేం—మూడో పెళ్ళి వాడైనా ఫరవాలేదని విద్యుల్లతకుగారు నాతో అన్నాడు."

శ్రీరాములంతా విని ఊరుకున్నాడు.

"నీ అభిప్రాయం చెప్పుమరి!" అన్నాడు సూర్యప్రకాశరావు.

"అంతా మీ యిష్టం" అని అన్నాడు శ్రీరాములు.

"అయితే ఒక్కసారి కోడలితో కూడా మాట్లాడతాను.

"కేనీ యింట్లో బానిసను. నాతో మాట్లాడ్డానికేముంటుంది?"

సూర్యప్రకాశరావులిక్కిపడి అటు తిరిగాడు. గుమ్మంలోంచీ సీత వారిని సమీపిస్తోంది.

"అయితే అంతా విన్నాకన్నమాట!" అన్నాడు సూర్యప్రకాశరావు.

"మీకు మంచినీళ్ళు తెస్తున్నాను. కానీ అప్పటికే మీ సంభాషణ ప్రారంభమైపోయింది" అంది సీత.

"సరే_ నేను చెప్పిందానిపై నీ అభిప్రాయమేమిటి?"

"బానిసను_నాకు అభిప్రాయాలేముంటాయి?" అంది సీత.

"నువ్వు బానిసవేంటమ్మా! ఇప్పుడు నీ భర్త మరో పెళ్ళి చేసుకోవాలంటే నువ్వే అనుమతినివ్వాలి" అన్నాడు సూర్యప్రకాశరావు.

"నేను బానిసను కాని పక్షంలో నా సందేహాలు తీర్చాలి మీరు!"

"అడుగు" అన్నాడు సూర్యప్రకాశరావు.

"అసలు నా భర్తకు రెండో పెళ్ళెందుకు? నేను కులటనన్న అనుమానం — అంతేకదా! చేసుకోబోయే పిల్లకూ_డా కులట అన్న అపవాదుంది. అది నమ్మకూడదని మీరనుకుంటున్నారు. అలాంటప్పుడు నామీద అపవాదను మాత్రం ఎందుకు నమ్మాలి? ఆ పిల్ల యాభై వేలు విలువచేయవచ్చు. కానీ తర్వాత జీవితాంతం మీరే పోషించాలి గదా? నేనైతే లక్షలు విలువచేసే పిల్లల్నిచ్చాను. నా విలువను గుర్తించరేం?"

సూర్యప్రకాశరావు నవ్వి — "నీ తప్పు తెలిసి కూడా నిన్నేలుకుంటున్న నీ భర్త ఔదార్యం అయుదైనది. ఆ ఔదార్యానికి నువ్వు తలవంచాలి. ఇక పిల్లల విలువంటావా? బిడ్డల విలువ తండ్రినిబట్టే కానీ తల్లినిబట్టి కాదు. రోడ్డుపక్కన అడుక్కుతినే ముష్టిది కూడా పిల్లల్ని కంటుంది. అదో పెద్ద విశేషం కాదు" అన్నాడు.

"అయితే మీ రేమంటారు?"

"నీ పెద్ద బిడ్డలిద్దర్నీ దత్తతకిచ్చి, నీ భర్త గొంతో పెళ్ళికంగీకరించి, చివరిద్దరి పిల్లలతోటీ నీ భర్త వద్ద జీవిత శేషకాలం వెళ్ళబుచ్చు."

"అన్నింటికీ నేనంగీకరిస్తాను. కానీ నా చిన్న పిల్లలిద్దర్నీ దత్తత ఇచ్చి పెద్దవాళ్ళిద్దర్నీ దగ్గరుంచుకుంటాను" అంది సీత.

"అలా వీల్లేదు" అన్నాడు శ్రీరాములు.

"ఎందుకని?"

"చిన్నవాళ్ళిద్దరూ లక్షాధికార్లు కావడం నేను సహించలేను. వాళ్ళిద్దర్నీ నా దగ్గరే వుంచుకుని వాళ్ళ జాతకాలను నేను కాసేస్తూంటాను" అన్నాడు శ్రీరాములు.

"వాళ్ళు చేసిన తప్పేమిటి?"

"వాళ్ళ పుట్టుకకు కారణమే తప్పు...."

సీత చటుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

## 10

ఆ రోజు ఆదివారం.

పిల్లలకు స్కూలు లేదు. శ్రీరాములు ఆఫీసు లేదు.

ఎన్నడూ లేనిది శ్రీరాములారోజు పెందరాళే లేచి స్నానాదులు నిర్వర్తించుకుని తండ్రితో మంతనాలాడుతున్నాడు.

సూర్యప్రకాశరావు కోడల్ని పిలిచాడు.

సీత వెళ్ళింది.

"నీ నిర్ణయం చెప్పు!" అన్నాడాయన.

"నా నిర్ణయం నిన్ననే చెప్పాను."

"ఏమిటది?"

"చిన్నవాళ్ళిద్దర్నీ దత్తతిస్తాను. పెద్దవాళ్ళు నాతో

వుంటారు. వారింకో పెళ్ళి చేసుకుంటే నే నభ్యంతర పెట్టను."

"నీ భర్త మరో పెళ్ళి చేసుకుంటే నిజంగా అభ్యంతర పెట్టవా?"

సీత నవ్వి — "తన సంస్కారం తెలిసినప్పట్నించీ వారిని చూస్తూంటే నే నా కంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్లుంటోంది. ఈ సమాజంలో వుంటున్నాను కాబట్టి గతిలేక వారిని భర్తగా చెప్పుకుంటాను. వారు నాకు భర్త కాని భర్తగా ఉంటే అంతకంటే సంతోషించ వలసిన విషయమేముంది?"

శ్రీరాములు కోపంగా "ఏమైనా సరే — పెద్దపిల్లల్నే దత్తతివ్వాలి. చిన్నవాళ్ళనివ్వడం కుదరదు" అన్నాడు.

"చిన్నవాళ్ళు దత్తతకు వెడితే అక్కడ సుఖంగా వుంటారు. పెద్దవాళ్ళు మనదగ్గరుంటే మీకల్లా సుఖపడ తారు."

"ఇక్కడ శాసించేది నువ్వు కాదు" అన్నాడు శ్రీరాములు.

"అమ్మాయ్ — నీ అదృష్టాన్ని నువ్వు గుర్తించడంలేదు. అబ్బాయి సంస్కారాన్ని నువ్వర్థం చేసుకోవడంలేదు" అన్నాడు సూర్యప్రకాశరావు.

"సంస్కారం — నా పిల్లల్లో ఇద్దరు కాముకులై తమ తోడబుట్టిన వాళ్ళనే వేధించేలా చేయడం సంస్కారమా? నా కన్నతల్లిని చరిత్రహీనురాలనడం సంస్కారమా? అగ్ని సాక్షిగా వివాహమాడిన భార్య సమాన హోదా అడిగితే నువ్వు బానిసవనడం సంస్కారమా?" అంది సీత.

"కానీ నీ అదృష్టం!"

"అదృష్టమా? నా హృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు రగులుతున్నాయో మీకేం తెలుసు?"

"ఏమిటే—అంత అగ్నిపర్వతాలు రగలాల్సి వచ్చిన అవసరం నీకేమొచ్చింది?" అన్నాడు శ్రీరాములు.

"కొంతకాలంగా మీతో కాపురంచేస్తున్న ప్రతి క్షణం నాలో అగ్నిపర్వతాన్ని రగులుస్తోంది."

"నాన్న దగ్గర సింపతీ కొట్టేయాలని చూడకు—"

సీత అదోలా నవ్వి—"ఎవరి సింపతీ నాకవసరంలేదు. నా ఏర్పాట్లు నేను చూసుకోగలను. దత్తతకు చివరి పిల్లలిద్దర్ని మాత్రమే యివ్వండి. పెద్దవాళ్ళ నిద్దామన్నా వీలుపడదు" అంది.

"ఎందుకు వీలుపడదు?"

"పాడిపంటలతో మానవజాతిని ఆదరించే భూమాత హృదయంలో అగ్నిపర్వతం బద్దలైతే ఆమె కన్నబిడ్డలే ఆ లావాలో మాడిపోతారు. ఇప్పుడూ అంతే జరిగింది. రాత్రి తిన్న విషంతో యింతవరకూ నిద్ర లేవలేదు పెద్దవాళ్ళిద్దరూ!"

శ్రీరాములు మ్రాన్పడిపోయాడు.

"పాపిష్టిదానా! కన్నబిడ్డలకు విషం పెట్టావా?" అన్నాడు సూర్యప్రకాశరావు.

"ఈ ప్రపంచానికి వారి అంశ మిగల్చకూడదని నేను చేసిన ఈ పాపం నన్నే నరకానికి తీసుకువెళ్ళినా అది నా కడుపు చిచ్చును మించి బాధ పెట్టదు. ఇక మీకు మిగిలినదిద్దరు బిడ్డలు. వాళ్ళను మీరే చంపుకుంటారో యేమౌతారో నాకు తెలియదు. అది చూడ్డానికి నేనూ ఉండను. నేను నా పగ తీర్చుకున్నాను. ఇప్పుడు నాకు తృప్తిగా ఉంది. కన్నబిడ్డలనే చంపుకున్న మహాపాత

కిగా మీరు నా గురించి చెప్పుకోవచ్చు. అలా చెప్పుకునే ముందు ఒక్కసారి మీరూ మీ గురించి ఆలోచించుకోండి. ఒక బిచ్చగత్తె పిడికెడు మెతుకులకోసం తన బిడ్డనే వికలాంగుణ్ణి చేస్తోంది. సమాజంలో ఆ బిచ్చగత్తె స్థానానికీ, ఇక్కడ మీ యింట్లో నా స్థానానికీ తేడా లేదు" అంది సీత.

"నువ్వు నిజమే చెబుతున్నావా?" అన్నాడు శ్రీరాములు తేరుకుని.

"నిజం తెలుసుకోవాలంటే పిల్లల గదిలోకి వెళ్ళండి" అంటూ చటుక్కున నేలమీద పడిపోయింది సీత.

సూర్యప్రకాశరావామెను సమీపించబోయి ఆగాడు.

అప్పుడే పేలిన అగ్నిపర్వతంలా ఉంది సీత!

—: ఐపోయింది :—

# చదివింపు

## ఎ.యస్. రావ్

ఆటో ఆగింది. పదిరూపాయల నోటు డ్రైవర్‌కి అందించి, ఆమె కిందికి దిగింది. సన్నటి, పొడుగాటి ఆకారం. ఆమె నడుస్తూంటే, ఖటావ్ 'వాయిల్' చీరమీదున్న మల్బరీ ఆకు డిజైన్స్ గాలికి కదుల్తున్న ఆకుల్లా గమ్మత్తుగా కదుల్తున్నాయి. తన అందాన్ని ఆశతో వెంటాడుతున్న మగ కళ్ళనీ, అసూయతో వెంటాడుతున్న ఆడకళ్ళనీ నిర్లక్ష్యం చేస్తూ ఆమె కుడివేపు రోడ్లోకి తిరిగింది.

కొంచెందూరం నడిచి ఆగి, ఆమె తలతిప్పి ఎడంవైపున్న సైన్‌బోర్డుని చూసింది. రిబ్బన్ ముడిలో ఇరుక్కున్న ఆమె జుట్టు పొట్టి కొరడాలా చివాల్న కదిలింది....

'విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్'....

ఆమె మొహంమీద చిరునవ్వు మెరిసింది. కాలేజీకి వెళ్ళాలనీ, డిగ్రీ, మాస్టర్స్ డిగ్రీ చదవాలనీ తనెంతో ఉబలాటపడింది పెద్దచదువులు చదవడానికి ఉబలాటం

ఒక్కటే చాలదని పరిస్థితులు ఆమెకి స్పష్టంగా చెప్పాయి. కాలం గడిచేకొద్దీ కాలేజీకి వెళ్తూ యేళ్ళ తరబడీ హాబీగా చదువు సాగించే అవకాశం పూర్తిగా కనుమరుగైంది. నిన్న సాయంత్రం యెవరో చెప్తేగానీ విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ గురించి తనకి తెలిసిరాలేదు. వంటగదిలో పీటమీద కూచుని పీజీ సంపాదించే సువర్ణావకాశాన్ని విద్యా ఇంటర్నేషనల్ అందిస్తోందని యింత కాలం తనకి తెలీకపోడం ఆశ్చర్యమే....

ఉల్లాసంగా మేడమెట్లెక్కి ఆమె తెరిచిన గుమ్మం ముందు నిలబడింది. విశాలమైన గది, విశాలంగా వున్న రెండు టేబుల్స్, వాటికి రెండువైపులా కుర్చీలు. గోడ వారగా సోఫాలు. ఫర్నిచర్ తప్పించి గది ఖాళీగా వుంది. క్షణకాలం తటపటాయించి ఆమె గుమ్మం దాటి లోపలికి ప్రవేశించింది.

ఎదురుగావున్న గోడని ఖరీదయిన ఫ్రేముల్లో వున్న ఫోటోలు సగంపైగా దాచిపెట్టేసున్నాయి. కలర్ ఫోటోలకిందున్న పేర్లు ఆమె దృష్టిని ఆకర్షించాయి. ఫుల్‌సూట్స్‌లో వున్న ఆరుమంది వ్యక్తులు.... పేర్లని ఆమె అప్రయత్నంగా చదివింది. జస్టిస్ స్వామి; జస్టిస్ కన్హయ్యాలాల్, జస్టిస్ కరుణాకర్, జనరల్ మాబే, కర్నల్ జయకాంతన్, సరోజినీరాణా ఎం.పి....అన్నీ తను విన్న పేర్లే; అందరూ ప్రముఖవ్యక్తులే. వీళ్ళంతా విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ గవర్నింగ్ కౌన్సిల్ సభ్యులు....

పక్కనే వున్న ఫోటోలో పి.హెచ్.డి. పట్టా స్వీకరిస్తున్న విద్యాశాఖా మంత్రి శివకుమారి....ఆమె

చూపులు ఫోటోల వెంట పరుగులు పెట్టాయి. రోజూ తను పేపర్లో చూసే నాలుగైదు మొహాలు....విద్యా ఇంటర్నేషనల్ ద్వారా సర్టిఫికెట్లు స్వీకరిస్తున్నారు! ఆలస్యంగా అయినా యింత చక్కటి సంగతి గురించి తనికి తెలిసినందుకు ఆమె లోపల్లోపలే సంతోషించింది....

'కాలాన్నీ, ధనాన్నీ వృథా చేయకుండా చదువుకోవాలనుకుంటున్నారా? విద్యా ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూట్ని ఆశ్రయించండి!'

'ఉన్నత విద్య....అందిస్తుంది మా 'విద్యా!''

అందంగా గోడలమీద పెయింట్ చేయబడిన ప్రకటనల్ని చదువుతూ అప్రయత్నంగా కుడివేపుకు తిరిగిందామె.

"హాలో...."

ఉలిక్కిపడి ఆమె తిరిగింది. ఎదురుగా కర్టెన్ ముందు లావుగా, పొడుగ్గావున్న స్త్రీ నిలబడింది. డోర్ కర్టెన్లో చాలా చాలా భాగాన్ని ఆమె భారీ శరీరం దాచిపెట్టేసింది. భుజాల్ని తాకుతున్న బాబ్డ్ హెయిర్, వెడల్పాటి మొహం, గోల్డ్ రిమ్డ్ కళ్ళద్దాలు, దట్టంగా అతుక్కున్న ఫేస్ పౌడర్, వెడల్పాటి పెదాలకి పులిమిన రక్తంలా అంటిన లిప్ స్టిక్, ఎర్రటి పల్చటి చీర. ఎర్రటి, పల్చటి స్లీవ్ లెస్ జాకెట్. టైట్ జాకెట్లో ఇరుక్కుపోయిన ఆమె శరీరం బిగుతుగా మూటకట్టిన మాంసంముద్దలా వుంది.

"హాలో...." యువతి మెల్లిగా అంది.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ మిస్...."

"మిసెస్ ....సాగరిక" యువతి నవ్వుతూ అంది.

"నైస్ టూ సీయూ....అయామ్ మిసెస్ రాణీ రాజా. విద్యా ఇంటర్నేషనల్ కరస్పాండెంట్...." అందామె సగర్వంగా. టేబుల్ వెనక కుర్చీలో హుందాగా కూచుని మహారాణిలా వెనక్కి నిలిగింది. "మిసెస్ సాగరికా, ప్లీస్ సిడౌన్!"

సాగరిక ఆమె యెదురుగా కుర్చీలో కూచుంది. పెదాల్ని ఒకసారి నాలుకతో తడుపుకుంది.

"మిసిస్ రాణీరాజా, మీ సంస్థ ద్వారా నేను పై చదువులు చదవాలనుకుంటున్నా...."

"వాటీస్ యువర్ క్వాలిఫికేషన్" రాణీరాజా అడ్డు తగిలింది.

"ఏ క్వాలిఫికేషనూ లేకుండానే పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులు చదవమంటూ చాలా యూనివర్సిటీలు ప్రకటన లిస్తూవుంటాయి. అన్నింటికీ అప్లై చేశాను. సీటు రాలేదు. అంచేత మీ సంస్థలో...."

"ఒక్కక్షణం...." రాణీరాజా ఆమెను ఆపింది. "విద్యా ఇంటర్నేషనల్‌కి ఇండియన్ యూనివర్సిటీస్‌తో అఫిలియేషన్ లేదు. న్యూయార్క్ యూనివర్సిటీ, కాంటన్ యూనివర్సిటీ, న్యూపోర్ట్ యూనివర్సిటీ, క్లేటన్ యూనివర్సిటీ వగైరా ప్రముఖ అమెరికన్ యూనివర్సిటీస్‌తోనే మాకు సంబంధాలున్నాయి. ఇవన్నీ ఉన్నప్పుడు ఇండియన్ యూనివర్సిటీస్‌తో పనేముంటుంది? సో....మీరు బిఏ, ఎమ్.ఏ, బియెస్సీ; ఎమ్మెస్సీ, ఎం.బి.యే, ఎమ్.బి.బి.యస్, బి.ఇ....వగైరా యేదైనా చదవొచ్చు. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన అమెరికన్ యూనివర్సిటీలు మీకు సర్టిఫికెట్లు జారీ చేస్తాయి!"

"అలాగా!" సాగరిక ఉద్రేకంతో అరిచింది.

"నిస్సందేహంగా. అయితే ఫీజులు కొంచెం ఎక్కువ గానే ఉంటాయి. ఎందుకంటే, ఇండియాలో వుండి, అమెరికాలో చదివినంత ఎఫెక్ట్ రావాలిగా?"

సాగరిక ఔనన్నట్టు తల పంకించింది. "మిసెస్ రాణీ రాజా....ఒక సందేహం...."

"అడగండి!"

"అమెరికాలోని యూనివర్సిటీ సర్టిఫికెట్స్ ఇచ్చేటప్పుడు కాంటాక్ట్ క్లాసులూ, పరీక్షలూ—వీటికి అక్కడికి వెళ్ళాలిగా?"

రాణీరాజా కిలకిల నవ్వింది. "మన యూనివర్సిటీస్ యేర్పాటు చేస్తున్న కాంటాక్ట్ క్లాసులూ వగైరా యేర్పాటుచేస్తూ అమెరికన్ వర్సిటీలు కాలాన్నీ, డబ్బునీ వృధా చేయవు! నన్నడిగితే కాంటాక్ట్ క్లాసులు దేనికి? హాలిడేస్‌లో లెక్చరర్లకి రెండో మూడో గంటలు ఓవర్ టైమ్ క్లాసులు తగిలించి, వాళ్ళకి గంటకి రెండు మూడు వందలు చదివింపులు చేయడం తప్పించి ఆ క్లాసులవల్ల క్యాండిడేట్సుకి బొత్తిగా ఉపయోగంలేదు. ఇంక పరీక్షలు....మా కరస్పాండెన్స్ కోచింగ్ సిస్టమ్ ప్రతీనెలా మీ శక్తిసామర్థ్యాల్ని బేరీజు వేస్తుంది. మీరు రాసిపంపే సమాధానాలు మీ ఇంటరెస్టునీ, తెలివినీ మాకు చెప్తాయి. నెలనెలా మేం సప్లై చేసే రీడింగ్ మెటీరియల్ ద్వారా అభ్యర్థి సత్తాని మేం చక్కగా విలువకడ్తాం. దాని ఆధారంతో, సంబంధించిన అమెరికన్ వర్సిటీకి రాస్తాం. అఫ్‌కోర్స్....మీ పేపర్లనీ పంపిస్తాం. మా రికమెండేషన్ బేస్ మీద తగువిధంగా యూనివర్సిటీ సర్టిఫికెటు ఇస్తుంది!"

"ఐసీ...." సాగరిక మంత్రముగ్ధలా అంది. "నేను ఎమ్.ఏ—లిటరేచర్ చేయాలనుకుంటున్నా.... రెండేళ్ళు పడుతుందంటారా?"

'ఇంకా తొందరగా పి. జి. పూర్తిచేసే వీలుందా?' అన్న ప్రశ్న ఆమె మాటల్లో రాణీరాజాకు స్పష్టంగా వినిపించింది.

"ఐ థింక్....మిసెస్ సాగరికా...." రాణీరాజా సాలోచనగా ప్రారంభించింది.

"నేను చెప్తాను...." డోర్ కర్టెన్ వైపునుంచీ వినిపించిన పురుషకంఠం సాగరిక తలని కటాలున అటువేపు తిప్పింది. గుమ్మం ముందు చిరునవ్వుతో ఆతను నిలబడ్డాడు.

పొట్టిగా, పీపాలా వున్న ఆకారం. ఖరీదైన సూటు, రిమ్‌లెస్ కళ్ళద్దాలు, రాగిచెంబులా మెరుస్తున్న బట్టతల. గుండ్రటి మొహం, వెడల్పాటి ముక్కు, వెడల్పాటి పెదవులు, వాటి మధ్య పొడుగాటి ఫిల్టర్ కింగ్ సిగరెట్.

"మిసెస్ సాగరికా, దిసీజ్ మిస్టర్ రాజా....డైరెక్టర్, రిజిస్ట్రార్, ప్రిన్సిపాల్, యాక్టివ్ కరస్పాండెంటు అండ్ వాట్ నాట్!" రాణీరాజా హుషారుగా పరిచయం చేసింది.

"నమస్తే!" సాగరిక పైకి లేస్తూ అంది.

"కూచోండి కూచోండి కూచోండి!" రాజా హలాసాగా అన్నాడు. రౌండ్ టేబుల్ ముందు కూచుని సిగరెట్‌ని యాష్‌ట్రేమీద పెట్టాడు. నవ్వుతూ సాగరిక వైపు చూశాడు.

"మిసెస్ సాగరికా, తొందరగా పీజీ చేసే వీలుం

టుందా అని మీరు అడిగారు. ఎందుకు చేయకూడదు అని నేను...."

"డార్లింగ్, గిమ్మీ ఏ సిగరెట్!" రాణీ అతనికి అడ్డు తగిలింది.

రాజా కోటుజేబులోంచీ జాన్ ప్లేయర్స్ స్పెషల్ సిగరెట్ని ఇవతలికి లాగాడు. పెదాల మధ్య ఇరికించి, లైటర్తో వెలిగించాడు. ఎడంచేత్తో దాన్ని రాణీకి అందించాడు. ఎర్రటి నెత్తురు పెదవుల మధ్య సిగరెట్ ఇరికించి, రాణీ అలసటగా వెనక్కి వాలింది. ఆమె నే ఆశ్చర్యంగా చూస్తూన్న సాగరికను అతని కంఠం ఆకర్షించింది.

"మిసెస్ సాగరికా, యెంత త్వరగా కావాలంటే అంత త్వరగా మనిషి విద్యను ఆర్జించవచ్చు అని నేను స్వయంగా స్థాపించిన విద్యా ఇంటర్నేషనల్ ద్వారా చాలాసార్లు నిరూపించాను...." సగర్వంగా అంటూ అతను ఆగాడు.

"అలాగా....వీలవుతుందంటారా?" సాగరిక సందేహిస్తూ అడిగింది.

"ఎందుకొకూడదు? మాటవరసకి....మీకు ఈ మధ్యే పెళ్ళయిందనుకుందాం. పెళ్ళయ్యేదాకా మీరు వంటగది మొహం చూశ్శేదు. గరిట పట్టుకోవడం చేతకాదు. అలాంటి మీరు అత్తారింటి కెళ్ళారు. వంట యెలా చేయాలో రెండ్రోజులు మీ అత్తగారు వివరించారు. తరవాత గరిట మీ చేతికిచ్చి, ఆధ్యాత్మరామాయణం ముందేసుకు్కూచున్నారు. చచ్చీ, చెడీ, భయపడీ మీరు వంటపనిలోకి దిగారు. ఏకాగ్రతతో వంట చేయడం ప్రారంభించారు. మూడో రోజుకల్లా ఇంటిల్లిపాదికీ,

ముఖ్యంగా మీ అత్తగారికి నచ్చేలా వంట తయారుచేయ డంలో ఎక్స్‌పర్టు అయ్యారు...."

"రియల్లీ....యూ ఆర్ కరెక్టు! నిజంగా నాకు ఇలాగే జరిగింది! పెళ్ళయ్యేసరికి నాకు...." సాగరిక ఉత్సాహంతో చెప్పసాగింది.

"ఫర్గెటిట్! పిండాకూడు వండటం గురించి మరిచిపోయి పీజీ గురించి మాట్లాడండి!" అంతసేపటినుండీ దమ్ము కొడుతున్న రాణీ విసుగ్గా అంది.

సాగరిక నవ్వే ప్రయత్నంచేస్తూ రాజావైపు చూసింది. రాజా చిన్నగా నవ్వాడు. "ఇట్స్ ఓకే! రాణీకి వంట అంటే మంట! ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే మనసుంటే మార్గం వుండి తీరుతుంది! ఆర్నెల్లలో పీజీ చేసేయాలన్న తపన మీలో వుందనుకోండి. అయిదు నెలల్లో ఎగ్జామ్స్ రాసిపారేయడానికి మీరు సిద్ధమవుతారు. ఫెయిలవాలనుకున్నా కాలేరు! మనిషిలోని ఈ తత్త్వాన్ని ఆధారంగా చేసుకుని నేను ఈ సంస్థను అభివృద్ధిలోకి తెచ్చాను...."

"అది కాదు....యిప్పుడు అకడెమిక్ యియర్‌లో సగం...."

"గడిచిపోయింది!" రాజా సాగరికకి నవ్వుతూ అడ్డు తగిలాడు. "అంటే ఇంకా సగం వుంది! అంటే, మీరు ఇప్పుడు మా ఇన్‌స్టిట్యూటులో ఎన్‌రోల్ అయి, ప్రారంభంలో చేరినవాళ్ళతో సమానంగా ఏడాది చివరికి పీజీ పూర్తి చేసేయొచ్చు...."

"ప్రిలిమినరీయా?" సాగరిక అడిగింది.

"ప్రిలిమినరీ గిలిమినరీ అంటూ వాయిదాలు లేవ్! రెండేళ్ళ కోర్స్‌నీ మీరు ఒకేసారి పూర్తిచేసుకోవచ్చు.

చేయాలన్న తాపత్రయం, శ్రద్ధా, ఓపికా, డబ్బూ అన్నీ వుంటే ..."

"అంటే...."

రాజా సిగరెట్‌ని వేళ్ళమధ్య పట్టుకుని పైకి లేచాడు. గున్న ఏనుగులా సాగరిక దగ్గరగా నడిచాడు. నవ్వుతూ ఆమె మొహంలోకి చూశాడు.

"మిసెస్ సాగరికా, మీకు అర్థం కావడానికి ఇంకొంచెం వివరిస్తాను. ఇండియాలో విద్యా విధానం, పరీక్షా విధానం భయంకరంగా వున్నాయి. పరీక్షలు విద్యార్థుల్ని ఛాలెంజ్ చేసే విధంగా తయారయ్యాయి. పేకాటలో ఒకడు యెదటివాణ్ని చిత్తు చేయడానికి వ్యవహరించే పద్ధతి పరీక్ష నిర్వాహకులు అనుసరిస్తున్నారు. పరీక్ష రాసేవాణ్ని యెలా ఫెయిల్ చేయడమా అన్న ఆలోచన ప్రాతిపదికగా తతంగం జరుగుతోంది...."

"యూ ఆర్ రైట్....!" సాగరిక ఉషారుగా అంది.

"దేశంలో విద్య నేలబారు అయిపోవడానికి కారణం ఈ నెగటివ్ దృక్పథమే! అందుకు కారణం కూడా వుంది. మీకు తెలిసివుండాలి...."

"నాకు.... తెలీదు...." సాగరిక మెల్లిగా అంది.

"పరీక్షలన్నీ పాసైపోయి, సంచీనిండా సర్టిఫికెట్లు పోగుచేసుకున్న వ్యక్తి తరవాత యేం చేస్తాడు?" రాజా పొగ ఊదుతూ ప్రశ్నించాడు.

" ఉద్యోగం!"

"కరెక్ట్! ఉద్యోగాల కోసం యెగబడి, ప్రభుత్వాన్ని ఇబ్బంది పెడతాడు. చదువుకుని సర్టిఫికెట్లు సంపాదించిన

వ్యక్తుల సంఖ్య విపరీతంగా పెరిగితే యేమవుతుంది? ఉద్యోగాలకోసం కుమ్ములాట! గలభా! విమర్శలు! సమ్మెలు! గవర్నమెంట్ విమర్శలకి గురై పోతుంది. చాలా తక్కువమంది చదువు ఫ్యాక్టరీల్నుంచీ విజయవంతంగా బైటికి వచ్చారనుకోండి. అప్పుడు? ఉద్యోగా లివ్వడం ప్రభుత్వానికి మంచినీళ్ళప్రాయం; పద్మశ్రీ లిచ్చినంత ఈజీ! సో.... సర్టిఫికెట్లు దొరక్కుండా చేసే? అంటే పరీక్షల్లోనే అభ్యర్థుల్ని ఫిల్టర్ చేసిపారేసే?" రాజా మెరిసే కళ్ళతో ప్రశ్నిస్తూ ఆగాడు.

"గుడ్ గాడ్!" సాగరిక నిర్విణ్ణురాలౌతూ అంది.

"గుడ్! మీకు అర్థమైంది. ఈ భయంకర పరిస్థితివల్ల మీలాంటి ఔత్సాహికులు అనుకున్న విధంగా, అనుకున్న చదువులు చదవలేకపోతున్నారు. అనుకున్న విధంగా అన్నీ చదివే అవకాశం మేమిస్తాం. అందరూ అర్రులు చాచే ఫారిన్ డిగ్రీస్‌ని మీ గడపముందుకే తెచ్చిస్తాం. కోచింగ్ విధానం, పరీక్షావిధానం పూర్తిగా కొత్తగా, భిన్నంగా వుంటాయి...."

"అంటే...."

"అంటే యేళ్ళతరబడీ కోచింగ్ వుండదు. తలగడలుగా ఉపయోగపడే బరువైన టెక్స్ట్‌బుక్స్ వుండవు. టెక్స్ట్‌బుక్స్‌లోని పేజీల్ని యథాతథంగా కంపోజ్ చేసి, అచ్చువేసి అరవయ్యేసి రూపాయలకే అమ్మే గైడ్స్ వుండవు. అమెరికన్ లెవెల్లో లెసన్స్ ఇస్తాం. మీ తెలివినీ, అభిరుచినీ వ్యక్తం చేస్తూ ఇవతలికి లాగే విధంగా హాయిగా వుండే పద్ధతిలో నామినల్ ఎగ్జామ్స్ నిర్వహిస్తాం. డిగ్రీలు అందిస్తాం!"

"చాలా సంతోషం. నేను ఎమ్.ఏ. లిట్—రాస్తాను. తరవాత ఎమ్.బి.ఏ. కూడా...."

"ఒక్క క్షణం!" రాజా అడ్డు తగిలాడు. "నేను చేయాలనుకున్నది ఇలాంటి చేసెయ్!" అన్నారు అనుభవజ్ఞులు. మీకు శక్తివుంటే, ఫీజులు కట్టగలిగితే, క్లాంటన్ యూనివర్సిటీ నుండీ ఎమ్.ఏ; లిట్; న్యూపోర్టు యూనివర్సిటీ నుండీ ఎమ్.బి.ఏ—ఒకేసారి, ఈ యేడాదిలో నే—సంపాయించుకోవచ్చు. పైగా...."

"అలాంటి డిగ్రీలకి ఇక్కడ విలువ...." సాగరిక ఆశ్చర్యంతో అంది.

రాజా సగర్వంగా నవ్వాడు. "అమెరికా డిగ్రీలంటే మీకు అంతగా తెలిసినట్టులేదు. మీకు అర్థంకావడానికి ఒకేఒక ముక్కలో చెప్తాను. అమెరికా డిగ్రీలు డాలర్లు; ఇండియా డిగ్రీలు రూపాయలు!"

సాగరిక నవ్వు చిలకపలుకులా ధ్వనించింది. నవ్వుతున్న ఆమె ఎర్రటి పెదవుల్నీ, తెల్లటి పళ్ళనీ ఆశగా చూస్తున్న రాజాని రాణీ ఓరగా చూసింది. సాగరికలా నవ్వగలిగివుంటే, తను ఈ రాజానుకాదు; సార్వభౌముణ్ణే కొంగున ముడేసుకుని వుండేది.

"రాజా డార్లింగ్, మొదట ఆమెకి డాలరంటే యేమిటో, రూపాయంటే యేమిటో వివరించు!" అంది రాణీ ఎగతాళిగా.

సాగరిక నవ్వు ఆపేసి, ఆమెవేపు చూసింది. రాజా చిన్నగా నవ్వాడు.

"అవసరంలేదు. మన ఎమ్.బి.యే. కోర్సులో ఆమెకి అంతా చెప్తాగా!"

సాగరిక అతన్ని ప్రశ్నార్థకంగా చూసింది, "రాజా గారూ...."

"యస్!"

"చదువంటే నాకు ఇష్టం. పరీక్షలంటే భయం. మరోలా అనుకోకండి....పాసవుతానంటారా? డిగ్రీలు వస్తాయంటారా?"

రాజా ఆమెవైపు సీరియస్‌గా చూశాడు. "మా విధానం మీకు ఇప్పుడు తెలీదు. మీ భయాన్ని మా కోచింగ్ ఛాలెంజ్‌గా మారుస్తుంది!"

"అంతేనంటారా?"

"మిసెస్ సాగరికా, మరోసారి చెప్తాను. మేం నిర్వహించే పరీక్షలు గవర్నమెంటు పరీక్షల్లా శతృభావంతో వుండవు. మా పరీక్షలు స్నేహ భావంతో, సానుభూతితో వుంటాయి! పరీక్షలు రాస్తున్నట్టు మీరు గ్రహించకుండానే, పరీక్షలకి అప్పియర్ అయివుంటారు!"

"అయితే నేను ఒకేసారి ఎమ్. ఏ., ఎమ్. బి. ఏ. చేయొచ్చంటారా?" సాగరిక ఆశగా అడిగింది.

"వై నాట్? ఒకేసారి, ఏక కాలంలో మీరు పాట నేర్చుకుంటారు; ఆటా నేర్చుకుంటారు! అవునా?"

"అంటే....?"

"అంటే మీరు—భరతనాట్యం నేర్చుకోవాలనుకుంటే, దాంతోపాటు గాత్రసంగీతం కూడా నేర్చుకుంటారు! నిర్భయంగా రెండు కోర్సులూ తీసుకోండి. మా సంస్థద్వారా డిగ్రీలు పొందినవాళ్ళల్లో రాజకీయ నేతలు, బ్యాంక్ ఆఫీసర్లూ, డైరెక్టర్లూ, కాలేజీ ప్రిన్సిపాల్సూ-ఇలా ఎందరో, ఎందరెందరో వున్నారు."

"ఓ.కే.....,అప్లికేషన్స్ ఇవ్వండి..........రెండింటికీ!"

సాగరిక ఉత్సాహంతో అంది.

రాణి సిగరెట్‌ని యాష్‌ట్రేలో నొక్కి ఆదరా బాదరా లేచింది. షెల్ఫ్ తెరిచి, రెండు సెట్లు ఫారమ్స్ ఇవతలికి లాగి రాజాకి అందించింది. రాజా వాటిని తన ముందు జాగ్రత్తగా పెట్టుకున్నాడు. సాగరికవైపు అదోలా చూశాడు.

"మిసెస్ సాగరికా ......ఫీజు మొదటే, ఇప్పుడే చెల్లించాలి. ఏమ్.ఏకి ఇరవై రెండు వేలూ. ఎమ్.బి.ఏకి పదహారూ అవుతుంది."

"అంటే....ముప్ఫైఎనిమిది.." సాగరిక ఆశ్చర్యంతో అంది.

"ప్లస్ ఆరువేలు....మీరు మొదట్నుంచీ కోర్సులో చేరనందుకు ఆరువేలు కట్టాలి, ఎక్స్ట్రాగా...."

"లేట్ ఫీజా?" సాగరిక ప్రశ్నించింది.

"అలా అనుకోండి. మొత్తం నలభై నాలుగు వేలు మీరు చెల్లిస్తే న్యూయార్క్ యూనివర్సిటీనుండి మీకు రెండు డిగ్రీలూ ఇప్పిస్తాం....ఆర్నెల్లు తిరిగేసరికే!"

"రాజా డార్లింగ్....ఇంకా అప్లికేషన్ కాస్టూ, ఎన్‌రోల్‌మెంట్ ఛార్జీ, స్టడీ మెటీరియల్....వాటికి మరిచిపోయావ్!" రాణి ఆత్రంగా అందుకుంది.

రాజా ఆమెని సాభిప్రాయంగా చూశాడు. "డియర్, రూల్స్ కొద్దిగా రిలాక్స్ చేస్తున్నా. ఒకటికన్నా ఎక్కువ కోర్సులు తీసుకునే అభ్యర్థులకి ఆ చిల్లర మొత్తాల్ని వదిలేస్తాం!"

"అలా చేస్తే ఒక్కో వ్యక్తిమీదా మనకి మూడు వేలదాకా నష్టం!" రాణి కళ్ళు చిట్లిస్తూ అంది.

"నా దగ్గర ప్రస్తుతం ముప్ఫై వేలే వున్నాయ్...."

సాగరిక మెల్లిగా అంది.

"మరేం ఫర్వాలేదు. మొత్తం ఇప్పుడు కట్టండి. కలిమ్మాకపద్దాలుగూ....ఇవాళ పన్నెండు....పదిహేను లోగా—ఇవ్వండి. పదిహేను దాటితే లేట్ ఫీజు మరో రెండు వేలు పెరుగుతుంది!"

సాగరిక సాలోచనగా పెదవి కొరుక్కుంది. "పది హేనుదాకా అవసరంలేదు....మరో గంటలో మొత్తం కట్టేస్తాననుకోండి....అన్నట్టు నా డిగ్రీ సర్టిఫికేట్స్.... లేవు....మా అత్తగారు కాల్చిపారేశారు....మళ్ళీ అప్లై చేయలేదు...."

రాజా ఆమెని సానుభూతితో చూశాడు. "మిసెస్ సాగరికా, మీరు డిగ్రీ ప్యాసయ్యారుగా?"

"సెకండ్ క్లాస్...."

"సర్టిఫికేట్స్ పంపితేగానీ ఆ యూనివర్సిటీవ్ డిగ్రీలు ఇష్యూ చేయవు....మీరు కొత్తవి సంపాయించా లంటే....ఇట్ టేక్స్ టైమ్! ఏం చేద్దాం...." రాజా సాలోచనగా బుర్ర గోక్కుంటూ ఆగాడు.

"ఇంతకీ మీ అత్తయ్యగారికదేం పొయ్యేకాలం?" రాణి తన అసహ్యాన్నంతా మొహంలోకి ఎగుమతి చేస్తూ సాగరికను అడిగింది.

"తన కూతుళ్ళకెవరికీ డిగ్రీల్లేవు. వాళ్ళకి లేనప్పుడు కోడలికెందుకని, గొడవ చేసి, కాల్చిపారేసింది!" సాగరిక చిన్నగా నవ్వింది.

"మొట్టమొదట ఈ దేశంలో అత్తల్ని ఎడ్యుకేట్ చేయాలి!" రాణీ కంఠంలో కోపం ధ్వనించింది.

"ఆల్ రైట్... మిసెస్ సాగరికా..మీకు అన్యాయం జరిగింది. అయినా మీ అత్తగారు కోడలి మీద కిరోసిన్

దిమ్మరించకుండా, సర్టిఫికేట్లమీద దిమ్మరించింది. ఆమెని మెచ్చుకోవాల్సిందే!" రాజా నవ్వుతూ ఆగాడు.

"ఎందుకలా? అడిగినంత కట్నం ఇచ్చేశాంగా? ఒకటా రెండా? యాభై వేలు!" సాగరిక నవ్వింది.

"ఫిఫ్టీ!" రాజా ఆశ్చర్యం నటిస్తూ అరిచాడు.

"అన్యాయం!"

సాగరిక నవ్వింది. "ఫర్వాలేదు లెండి. ఆ కట్నం పైకం ఆయన బ్యాంక్‌లో దాచాడు. అదే ఇప్పుడు నా చదువుకి అక్కరకొస్తోంది!"

"నైస్! వెరీ నైస్!" రాజా అరిచాడు.

"రాజా డార్లింగ్, అలాంటప్పుడు మనం సాగరికకి మూడువేలు రిబేట్ ఇవ్వక్కర్లేదు!" రాణీ కల్పించుకుంది.

"లాభంలేదు లెండి.........కొంత ఖర్చయిపోయింది!" సాగరిక నవ్వింది.

"ఓ.కే....మీ సర్టిఫికెట్స్ గురించి ఆలోచించాలి. మీరో పని చేయండి. ఫలానా కాలేజీలో, ఫలానా సంవత్సరంలో డిగ్రీ చదివి, ప్యాసయ్యాననీ, సర్టిఫికెట్స్ అగ్ని ప్రమాదంలో పోయాయనీ, తరవాత—కొత్తవి తెప్పించి సబ్‌మిట్ చేస్తాననీ రాసివ్వండి. నేను తగు విధంగా రికమెండ్ చేస్తాను. దానికి ప్రిస్క్రైబ్డ్ ఫారమ్సున్నాయి. సర్టిఫికెట్స్ లేనివాళ్ళు మరో వెయ్యి అదనంగా చెల్లిస్తే, ఆ సంగతి మేం చూసుకుంటాం!" రాజా భరోసా ఇచ్చాడు.

"అంటే..నలభై అయిదువేలు....రిసీట్ ఇస్తారుగా?" సాగరిక అడిగింది.

"ఖచ్చితంగా! రేపొద్దున మీకు డిగ్రీలు సప్లై

చేయకపోతే మీరు వాటి ఆధారంతో కోర్టుకి కూడా వెళ్ళొచ్చు!"

సాగరిక నవ్వింది. "సరే. అప్లికేషన్స్ రాయండి... అరగంటలో కష్టపడిన మొత్తం తెప్పిస్తాను...."

రాజా ఉద్రేకంతో టేబుల్ మీదున్న పేనా అందుకున్నాడు.

"మిస్టర్ రాజా...."

రాజా సాగరికవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మా చెల్లాయి ఈ ఊళ్ళోనే వుంది. ఎమ్.బి.బి. యస్. చేయాలని కలలు కంటోంది."

"ఆమె కలల్ని మేం నిజం చేస్తాం!" రాజా ఉషారుగా అన్నాడు.

"ప్రాక్టికల్స్....హౌస్ సర్జన్సీ....అన్నీ ఎట్లా?" సాగరిక అనుమానిస్తూ అంది.

"లక్షలకి లక్షలు డొనేషన్‌లు కట్టి అయిదేళ్ళు మెడికల్ కాలేజీలో శిక్ష—శిక్షణ కాదు—శిక్ష అనుభవిస్తే వచ్చే వైద్యపరిజ్ఞానం మీకు మేం అందిస్తాం. అల్లాటప్పా వైద్యంకాదు; అమెరికన్ వైద్యం! మీ చెల్లెల్ని రమ్మనండి! నేను చెప్తాను!" రాజా ఊరిస్తూ అన్నాడు.

"రైట్. ఎల్లుండి చెల్లాయి, గిరిక మిమ్మల్ని కల్సుకుంటుంది. నేను రాలేను. దానికి హెల్ప్ చేయండి!"

"తప్పకుండా! సో........మీ అప్లికేషన్స్ ఫిలప్ చేద్దాం...." అంటూ రాజా మరో సిగరెట్ వెలిగించాడు....

సాగరిక యేదో చెప్పబోయింది. గుమ్మం ముందు చప్పుడు ఆమెకి అడ్డుతగిలింది. రాజా, రాణీ ఇద్దరూ

గుమ్మం వైపు చూస్తున్నారు. సారిక తలతిప్పి చూసింది. నలుగురు — ముగ్గురు ఆడా, ఒక మగా — లోపలికి వస్తున్నారు.

"గుడ్ మార్నింగ్ మిస్టర్ రాజన్!" అన్నాడు జుబ్బాలో వున్న వ్యక్తి.

"... మార్నింగ్, రండి రండి!" రాజన్ పైకి లేచి ఆహ్వానించాడు.

"వీళ్ళు ముగ్గురూ మా బ్రాంచిలోనే పని చేస్తున్నారు.... మొన్న నేను చెప్పింది వీళ్ళ గురించే. ఎమ్.బి.ఏ. చేయా అనుకుంటున్నారు"

"వెరీ నైస్! ప్లీస్ టేక్ యువర్ సీట్స్. రాణీ మీకంతా ఎక్స్‌ప్లెయిన్ చేస్తుంది. ఈలోగా కొంచెం పని ముగిస్తాను" కింద పెట్టేసిన పెనా అందుకుంటూ అన్నాడు రాజా.

## 2

"ఎమ్.ఏ. ఎమ్.బి.ఏ.—రెండింటికీ ఫీజు కట్టేశాను" అతని యెదురుగా సోఫాలో కూచుంటూ అందామె.

"నైస్."

"ఎల్లుండి నా చెల్లెలు గిరిక ఎమ్.బి.బి.యస్. కోర్స తీసుకుంటుందని చెప్పి, సీటు రిజర్వ్ చేయించాను."

"వెరీ నైస్...."

"నాకు చెల్లెలు.... లేదుగా?" ఆమె కంఠం నవ్వింది. కళ్ళు చిలిపిగా మారాయి.

"ఎల్లుండి చీర తీసెయ్. చూడీదార్‌లో దాక్కో. జుట్టు ముడి విప్పెయ్. బాబ్డ్ హెయిర్ని అలాగే వుంచుకో. గడ్డం కింద కాటుకతో గురివిందగింజ సైజు పుట్టుమచ్చ— ఐమీన్ — పెట్టుమచ్చ—తయారు చేసుకో. ఎల్ కే జీ

గిరిక ఇంగ్లీషు మీడియంలోనే చదువుతుంది. పూర్తిగా ఇంగ్లీషులోనే. నిర్లక్ష్యంగా మాట్లాడు ”

“ఓహ్....ఫర్వాలేదా?”

“లేదు. నువ్వు ఎంత త్వరగా, ఎన్ని యెక్కువ డిగ్రీలు తీసుకుంటే మనకి అంత మంచిది. ఎన్ని ఎక్కువ పేర్లతో తీసుకుంటే అంత యెక్కువ మంచిది!”

“రెండింటికీ నలభైఅయిదు వేలు కట్టించుకున్నారు.... మెడిసిన్‌కి లక్షల్లో అడుగుతారేమో....” ఆమె అనుమానిస్తూ అంది.

“అడిగినప్పుడు, అడిగినంతా ఇచ్చేయ్. చదువుమీద ఐమీన్—‘విద్య’మీద పెట్టిన పెట్టుబడి వృధాకాదు!” అతను నవ్వుతూ అన్నాడు.

“ఇవాళ నేనక్కడున్నట్టే చాలామంది రకరకాల కోర్సుల్లో చేరిపోయారు!”

పెదాల మధ్య సిగరెట్ ఇరికించి అతను అగ్గిపుల్ల గీచాడు. అగ్గిపుల్ల ఉషారుగా చప్పుడు చేసింది. “నైస్.. వాళ్ళ పేర్లూ, ఊర్లూ....”

“ఈ గుప్పిట్లో ఉన్నాయ్!” అందామె చేత్తో బిగించిన చిన్న పర్సుని చూపిస్తూ....

అతను సాలోచనగా ఆమెవైపు చూశాడు. “కళ్ళు మూసుకుని, గుడ్డిగా మనం ఫీజులు కట్టేస్తున్నాం....”

“విద్యమీద పెట్టింది వృధాకాదన్నావుగా?” ఆమె అడ్డుకగిలింది.

“అఫ్‌కోర్స్....అయితే, వెనకా ముందూ చూడాలి. గతం, భవిష్యత్తూ—ఈ రెండూ శుభ్రంగా తెలీకపోతే వర్తమానం మనకి పనికిరాదు!”

ఆమె ప్రశ్నార్థకంగా చూసింది. అందమైన కను

బొమలు మధ్యలో కలుసుకుంటూ కొత్త ఆకారం ధరించాయి.

"గతంలో విద్యా ఇంటర్నేషనల్స్ ద్వారా డిగ్రీలూ, డాక్టరేట్లూ సంపాయించిన వాళ్ళనీ, ప్రస్తుతం సంపాదిస్తున్న వాళ్ళనీ మనం కలుసుకోవాలి....అంటే...."

"వాళ్ళందరి పేరూ అడ్రెసులూ మనకి కావాలి.... అంతేగా?" ఆమె నవ్వుతూ అడిగింది.

"ఎగ్జాక్ట్లీ!"

"మెడిసిన్‌లో చేరేముందు ఆ వివరాలు కావాలని అడుగుతాను" అందామె.

అతనామెవైపు సాలోచనగా చూశాడు. "వద్దు. నేనే వెళ్తాను."

"నువ్వు కూడా యేదేనా కోర్స్ తీసుకుంటావా?"

అతను చిన్నగా నవ్వాడు.

"అదికాదు" ఆమె అనుమానిస్తూ అంది. "అన్ని కోర్సులు....అన్ని డిగ్రీలు తీసుకోవాలంటావా, నేను?"

అతను చిన్నగా నవ్వాడు. "ఎన్నోరకాల అర్హతలుంటే గానీ. ఈ రోజుల్లో నీకు ఒక ఉద్యోగం రాదు!"

"నా ప్రశ్నకి నువ్వు సమాధానం చెప్పలేదు: నువ్వూ యేదో కోర్సులో చేరి, చదువుతావా?" ఆమె సందేహిస్తూ అడిగింది.

అతను పకపక నవ్వాడు. సిగరెట్ వెలిగించి ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు. "కాలేజీల్లో విశ్వవిద్యాలయాల్లో నేను చదవను. విశ్వమే నా విద్యాలయం! నేను పుస్తకాల్ని చదవను; మాట్లాడే పుస్తకాల్ని—మనుషుల్ని చదువుతాను....!"అన్నాడతను సగర్వంగా.

ఆమె కళ్ళు పెద్దవిగా విచ్చుకున్నాయి. "అయితే నువ్వు కావాలన్న పేర్లూ అవీ యెలా సంపాయిస్తావ్ ....?"

"తొందరేంలేదు. నీకు డిగ్రీలు రావడానికి ఇంకా అయిదు నెల్ల వ్యవధి వుంది. ఆ వ్యవధి చాలా, చాలా ఎక్కువ నాకు!" అన్నాడతను నవ్వుతూ.

# 3

తలుపు తెరిచిన వ్యక్తిని అతను ఎగాదిగా చూశాడు ఖరీదయిన ఫుల్ సూటు. గోల్డురిమ్ అద్దాలగుండా చూస్తున్న చిన్న కళ్ళు. చక్రంమీంచీ తీశాక కుమ్మరి చేత, కొయ్యకత్తి దెబ్బలు తిని నున్నగా మెరుస్తున్న మట్టికుండలాంటి బట్టతల, కోటుబటన్ హోల్ లోంచొచ్చిన ఎర్రగులాబీ. అతని మొహంమీద చిరునవ్వు పర్మనెంటుగా కాపురం చేస్తోంది. తనలాగే, అతనూ తనని పరిశీలనగా చూస్తున్నాడని గుమ్మం అవతల నుంచున్న వ్యక్తి గమనించాడు.

"మిస్టర్ రాజా?"

"మిస్టర్ మిత్రా...." రాజా ఉషారుగా అంటూ చేతిని ముందుకు చాచాడు.

అతనిలాగే ఫుల్ సూటులో, అతనికన్నా యెత్తుగా హుందాగా నించున్న మిత్రా, రాజా పొట్టి ఆకారాన్ని యేరియల్ వ్యూలాగా కలయజూశాడు.

"యస్....జోనల్ డైరెక్టర్ ఎమ్ ఆర్.టి.పి.సి.— మోనోపోలీసు అండ్ రెస్ట్రిక్టివ్ ట్రేడ్ ప్రాక్టీసెస్ కమిషన్....గవర్నమెంటు ఆఫ్ ఇండియా."

సగర్వంగా అంటూ అతను రాజా చేతిని పట్టుకుని, చేతిని దూరంగా లాగాడు,

రాజా ధారాళంగా చిరునవ్వు నవ్వుతూ కొంచెం వెనక్కి జరిగాడు. ముందుకి వంగి, ఆహ్వానసూచకంగా రెండు చేతుల్నీ చాచాడు.

"దయచేయండి....దయచేయండి! ప్లీజ్ గెటిన్!"

"మీ ఆఫీసుకి రావాలనుకున్నాను...." గుమ్మం దాటుతూ అన్నాడు మిత్రా.

"తప్పకుండా తీసికెళ్తాను! ఇట్ విల్ బీ మై ఫార్చ్యూన్! టెలిఫోనులో మీరు మాట్లాడేక, ఆఫీసు కన్నా యిక్కడే బావుంటుందని ఈ ఫైవ్ స్టార్లో ఆరేంజ్ చేశాను. ఆఫీసులో గొడవగా వుంటుంది. ఇక్కడయితే ఉయ్ కెన్ డిస్కస్ ఇన్ పీస్!" రాజా ఉల్లాసంగా అంటూ సోఫా చూపించాడు.

మిత్రా సోఫాలో కూచుని కాలుమీద కాలు వేసుకున్నాడు. రాజా ఆదరాబాదరా కోటుజేబులోంచీ ఇండియా కింగ్స్ పాకెటు తీసి, తెరిచి, ఒక సిగరెట్ని సగం ఇవతలికి లాగి, పాకెట్ని అతనిముందు పట్టుకున్నాడు. మిత్రా నవ్వుతూ చూపుడువేలి గోరుతో ఆ సిగరెట్ని పాకెటులో మూసేలా మీటాడు. కోటుజేబులోంచీ బ్రయర్ పైప్ తీసి, పొగాకు కూరడం ప్రారంభించాడు. రాజా చిరునవ్వుతో యెదురుగా కూచుని సిగరెట్ వెలిగించాడు. "మిస్టర్ మిత్రా, ఎనీథింగ్ హాట్? ఎనీథింగ్ కూల్?"

పైప్ వెలిగించి మిత్రా అతన్ని సూటిగా చూశాడు. "మిస్ట రాజా, మీ విద్యా ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూటుని పరిశీలించడానికి ఆఫీషియల్గా వచ్చాను. మీ ఆతిథ్యం కోసం కాదు!"

రాజా మొహంమీదున్న చిరునవ్వుని మిత్రా మాటలు

చీపురుకట్టల్లాగా తుడిచేశాయి. ప్రయత్నించి రాజా చిరునవ్వుని మళ్ళీ తన మొహానికి తగిలించాడు. "అఫ్ కోర్స్....పొద్దుట ఫోన్ లో ఆ సంగతి చెప్పారు - .... కానీ...."

"ఆల్ రైట్ .... ఈ హోటల్లో ఇన్ స్టంట్ టీ కమ్మగా వుంటుందని విన్నాను. లెట్స్ హావ్ సమ్!" మిత్రా నవ్వుతూ అన్నాడు.

రాజా ఆదరాబాదరా టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు....

"మీ సంస్థమీద పబ్లిక్ కంప్లెయింట్స్ వచ్చాయి. ఇక్కడవున్న ఎమ్.ఆర్.టి.పి.సి. డైరెక్టర్ ద్వారా కాకుండా నేనే తనిఖీ చేయాలని సెంటర్ ఉత్తరు విచ్చింది...."

"పబ్లిక్ కంప్లెయింట్స్! ఐకాంటు బిలీవ్!" రాజా ఆశ్చర్యంతో అరిచాడు. "మా సంస్థ రెండేళ్ళుగా పబ్లిక్ సిర్వీస్ చేస్తోంది! ఇంతకీ ఫిర్యాదు చేసిం దెవరు?"

మిత్రా పొట్టిగా ట్రిమ్ చేసిన తన గెడ్డాన్ని ప్రేమగా వేళ్ళతో తడువుకున్నాడు.

"మీ ద్వారా డిగ్రీ సంపాయించుకున్న వ్యక్తి అనుకుంటా....ఇంద్రకుమార్ ....రంగం పేట...."

"ఇంద్రకుమార్ ...." రాజా సాలోచనగా ముక్కు మీద చూపుడువేలితో గోక్కున్నాడు. "మిస్టర్ మిత్రా, ఆ పేరే యింతవరకూ నేను వినలేదు....పైగా మా సంస్థ ద్వారా డిగ్రీ సంపాదించుకున్న వ్యక్తి యెవరూ మా మీద ఫిర్యాదు చేయరు! తక్కువ ఖర్చుతో, తక్కువ శ్రమతో అమెరికా డిగ్రీలు అందించే సంస్థ మాది!"

“అదంతా నాకు తెలీదు. కంప్లెయింటు వచ్చింది. అందులోని ఆరోపణలు అబద్ధాలని రుజువయ్యేదాకా దానికి మేం విలువయిచ్చి తీరాలి....”

“ఇంతకీ ఆరోపణలు — యేమిటి?” రాజా కళ్ళు చిట్లిస్తూ ప్రశ్నించాడు.

“అతి యెక్కువ ఫీజులు గుంజుకుని మీరు ఫేక్ డిగ్రీలు ఇస్తున్నారు. తరువాత ....”

రాజా నవ్వు మిత్రాకి అడ్డు తగిలింది. తీరుబడిగా కాసేపు నవ్వి, ఆపి, రాజా మిత్రా మొహంలోకి ఉల్లాసంగా చూశాడు. “అదొక్కటి చాలు; మీకు అందిన ఫిర్యాదులో అన్నీ అబద్ధాలే వుంటాయని చెప్పడానికి! నకిలీ డిగ్రీలు! మైగాడ్! ముగ్గురు మినిస్టర్లకి నేను చదువు చెప్పి—డిగ్రీలిచ్చాను. నలుగురైదుగురు ప్రిన్సిపాల్స్ కూడా నా ద్వారా డాక్టరేట్లు పొందారు. లెక్కలేనంత మంది బ్యాంక్ యెంప్లాయీస్ ఎమ్.బి.ఎ. చదివి, ఇంక్రిమెంట్లు ప్రమోషన్ లూ పొందారు. నకిలీ డిగ్రీల్ని ఈ సంస్థలన్నీ యెలా అంగీకరించాయి?””

“అదికూడా ఆలోచించాలి” మిత్రా క్లుప్తంగా అన్నాడు.

“మిస్టర్ మిత్రా, మీకు కంప్లెయింటు యిచ్చిన ఇంద్రకుమార్ ఇంద్రకుమార్ కాడు! యెవరో నాకు తెలుసు! నేను ఊహించగలను!”

“ఎవరు?” మిత్రా కంఠంలో కుతూహలం ధ్వనించింది.

“తిరపతిలో ఈమధ్య శ్రీవిద్యా ఇంటర్నేషనల్ ఇన్స్టిట్యూటు వెలిసింది. మా సంస్థ పేరుకి శ్రీ తగిలించారు; ఇమిటేషన్! అఫిలియేషన్ కోసం అతను స్టాంటన్,

న్యూయార్క్, న్యూపోర్టు తరగయిరా యూనివర్సిటీస్‌కి అప్లై చేశాడు. ఆ సంగతి ఆ విశ్వవిద్యాలయాల డీన్స్ జోనాథన్, క్లిప్స్, ట్రూమన్, ఫెర్డినాండ్ వాళ్లు రాశారు. శ్రీవిద్య గురించి అడిగారు .. ”

“ఎందుకు?” మిశ్రా ప్రశ్నించాడు.

“సౌతిండియాలో నాది ప్రముఖ విద్యాసంస్థగా రూపొందింది. నేను సూచించిన కోచింగ్ విధానం, డిగ్రీ లకీ, డాక్టరేట్లకీ నేను రూపొందించిన సిఫార్సు విధానం వాళ్ళకి బాగా నచ్చాయి. సౌత్ జోన్‌లో మా సంస్థ ఒక్కటే చాలని వాళ్ళందరి అభిప్రాయం! వాళ్ళ అభి ప్రాయాన్ని బలపరుస్తూ శ్రీవిద్య శాస్త్రీకి అఫిలియేషన్ యివ్వొద్దన్నాను. అతనిది విద్య అందించే మోటివ్ కాదు! అతను స్వార్థపరుడు. అతను....”

“మీకెలా తెలుసు?”

“శ్రీ విద్యను ప్రారంభించిన గరుడాచలం అర్నెల్ల క్రితందాకా నా దగ్గర అసిస్టెంటుగా అఘోరించాడు. ఒకమ్మాయి చెల్లించిన పన్నెండువేల రూపాయల ఫీజుని గల్లంతు చేశాడు. పీకి పారేశాడు. తరవాత ఫీజు తీసుకో కుండా ఆ అమ్మాయికి డిగ్రీ ఇప్పించాననుకోండి—అది వేరే సంగతి. పీకేశాక, గరుడాచలం ఇక్కడి అనుభవం ఆధారంతో తనో సంస్థను స్థాపించి లక్షలు సంపా యించాలనుకున్నాడు....”

“అంటే మీరు లక్షలు సంపాదిస్తున్నారా?” మిశ్రా నవ్వుతూ అడిగాడు.

రాజా సిగ్గుపడుతూ నవ్వాడు. “ఇందులో దాపరికం యేమీ లేదు. నా ఆదాయం యేడాదికి లక్ష దాటులోంది. అత్యధిక సంఖ్యలో విద్యార్థులు ఎన్‌రోల్ అవుతున్నారు.

మిస్టర్ మిశ్రా, నా సంస్థని చట్టబద్ధంగా నడుపు తున్నాను; చట్టబద్ధంగా టాక్సులు కడుతున్నాను...."

మిశ్రా కుడిచెయ్యి పైకెత్తి రాజా ఆవేశప్రవాహానికి ఆనకట్ట వేశాడు. "అదలా వుంచుదాం. గరుడాచలం."

"యస్! గరుడాచలం. హి ఈజ్ ఏ బ్లాక్! తిరపతి ప్రాంతంలో నాకు చాలామంది అభ్యర్థులున్నారు. విద్యా ఇంటర్నేషనల్ బోగస్ సంస్థ అంటూ వాడు వాళ్ళల్లో చాలామందికి బ్రెయిన్ వాష్ చేశాడు. వాళ్ళు కంగారు పడిపోయి నన్ను కల్సుకున్నారు. అక్రెడిటెడ్ యూని వర్సిటీస్ ద్వారా అసలు సిసలు అమెరికా డిగ్రీలు ఇస్తున్న నా మోటివ్‌నీ, సర్వీసునీ, నిజాయితీనీ వాళ్ళకు వివరించా నుకోండి. సో....ఆ గరుడాచలంగాడు యేదో దొంగ పేరుతో మీకు ఫిర్యాదు చేశాడు! దయచేసి దాన్ని పట్టించుకోకండి!" రాజా ఉద్రేకంతో అన్నాడు.

మిశ్రా చిన్నగా నవ్వాడు. "గరుడాచలం—లేక పోతే—ఇంద్రకుమార్—అతని కంప్లెంట్‌ని నేను సీరి యస్‌గా పట్టించుకోడం మీకు చాలా చాలా మంచిది!"

రాజా గుడ్లు పెళ్ళగిస్తూ ప్రశ్నార్థకంగా చూశాడు.

మిశ్రా మళ్ళీ నవ్వాడు. "అతని కంప్లెయింటుని ఆధా రంగా చేసుకుని మీ సంస్థని నేను క్షుణ్ణంగా పరిశీలి స్తాను. మీరు చెప్పేదంతా నిజమే అయితే—అతని ఫిర్యాదు పచ్చి అబద్ధం అని తేలుతుంది. నా 'కమిషన్' సారాంశాన్ని నేను ప్రభుత్వానికి సబ్‌మిట్ చేస్తాను. విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూటు చక్కటి సంస్థ అని నేను ముద్ర వేయడం మంచిది కాదంటారా?"

"ఎందుకాకూడదు! దయచేసి ఆ పని చేయండి! ప్లీజ్ డూ ఇట్!" రాజా ఉద్రేకంతో అంటూ మరో సిగ

రెట్ అందుకున్నాడు.

"మీరు ఆవేశపడుతున్నారు. నేను తేల్చడంకాదు. మీది స్వచ్ఛమైన విద్యాసంస్థ అని మీరు నిరూపించుకోవాలి!" మిశ్రా నవ్వుతూ అన్నాడు.

"ఆఫ్ కోర్స్...."

"సో....మీరు నాతో సహకరించాలి. మీరు...."

"ఏం చేయాలో సెలవీయండి!"

"సంస్థ స్థాపించాక, మీరు గతంలో బోగస్ డిగ్రీలు-ఇంద్రకుమార్ ఆరోపించినట్టు—ఇవ్వలేదని నిరూపించాలి. వర్తమానంలో యివ్వడంలేదనీ, భవిష్యత్తులో యివ్వబోవడం లేదనీ నిరూపించుకోవాలి! ఔనంటారా?"

"కాదనలేముగా?" రాజా ఉషారుగా అన్నాడు.

"ఇప్పటిదాకా మీ నుండీ డిగ్రీలూ, డాక్టరేట్లూ పొందిన వ్యక్తుల వివరాలన్నీ మీరు సంపూర్ణంగా నాకు అందచేయాలి.ఇప్పుడు ఎన్ రోల్ అయినవాళ్ళ వివరాలు కూడా...."

"తప్పకుండా!"

"అలాగే యెవరెవరు యెంత ఫీజు చెల్లించిందీ కూడా...."

"ఆఫ్ కోర్స్....క్షమించండి....ఆ వివరాలన్నీ మీకు దేనికి? అందరినీ, వివిధ రాష్ట్రాల్లో వున్న వ్యక్తులందరినీ మీరు కలుసుకోలేరుగా?"

"కలుసుకోలేం. అయితే అందరికీ, లేదా సెలెక్టు చేసిన కొందరికి రాస్తాం. వాళ్ళ అభిప్రాయాల్ని వెల్లడించుకుంటాం. ఆ తరవాత ...."

"జస్ట్ మోమెంట్!" రాజా అడ్డు తగిలాడు.

అదంతా టైమ్ కన్స్యూమింగ్ టాస్క్! మా సంస్థ బోగస్‌ది కాదని మీకు త్వరగా నిరూపించాలి.... మిస్టర్ మిత్రా........ మీ రిపోర్టు కాపీని మాకూ పంపుతారుగా?...."

"సహజంగా."

"అలాంటప్పుడు మీ పరిశీలన త్వరగా ముగిసిపోతాలని కోరుతున్నాను. మీ రిపోర్టుని అన్ని పేపర్లలో— ఫుల్ పేజ్—వేసి, మా సంస్థ నిజాయితీని ప్రజలకి తెలియజేసుకుంటాను! దట్ వే, మాకూ, విద్య ద్వారా డిగ్రీలూ డాక్టరేట్లూ పొందగోరే వ్యక్తులకీ యింతో మేలు జరుగుతుంది!"

మిత్రా చిన్నగా నవ్వాడు. "మిస్టర్ రాజా, నా రిపోర్టు మీది బోగసు సంస్థ అని తేల్చిందనుకోండి. అప్పుడు?...."

రాజా అర్థంకానట్టు చూశాడు. "అప్పుడు.... అప్పుడు.... మా సంస్థని మూసేస్తాం!"

"మీరు మూసివేయరు" మిత్రా గంభీరంగా అన్నాడు. "మేం మూయిస్తాం!"

రాజా సగర్వంగా నవ్వాడు. "ఆ అవసరం రాదులెండి! మా సంస్థ ప్రజల్ని దోచుకోడానికి పుట్టలేదు. తహతహవున్న వాళ్ళకి విద్య చెప్పి, రీజనబుల్ ఫీజు తీసుకోడానికి జన్మించింది! మీ పరిశోధనలో మీరు యీ సత్యాన్ని గుర్తిస్తారు. మా సహకారంతో డిగ్రీలూ, ఫ్యాకల్టీలూ పొందినవాళ్ళూ, పొందే ప్రయత్నంలో వున్న వాళ్ళూ మీకు వెయ్యి నోళ్ళతో ఈ సత్యాన్ని వినిపిస్తారు!"

"అలా జరిగితే మీకే మంచిది! ఆల్ రైట్....రేపు నేను మీ ఆఫీసు విజిట్ చేస్తాను. రెండుగంటలపాటు మాత్రమే నేను రికార్డ్స్ అవీ చెకప్ చేస్తాను. నాకు అవసరమైన వివరాలు—అదే మీరు ఇందాకా చెప్పిన 'వెయ్యి నోళ్ళ' వివరాలన్నీ వున్న కాగితాల జిరాక్స్ కాపీలు శుభ్రంగా ఒక ఫైల్లో రెడీగా వుంచండి...."

"మిస్టర్ మిత్రా...." రాజా కంఠం అతనికి అడ్డు తగిలింది.

మిత్రా ప్రశ్నార్థకంగా చూశాడు. రెండు చేతివేళ్ళనీ ఒకటిగా చేర్చి, తయారయిన ఉయ్యాలని కాసేపు పరీక్షగా చూసుకున్నాడు రాజా. మెల్లిగా చూపుల్ని మిత్రా వేపు తిప్పాడు.

"మిస్టర్ మిత్రా....మీరు సాగించబోయే పరిశోధన మా సంస్థ రెప్యుటేషన్ని బ్రహ్మాండంగా పెంచేస్తుందని నాకు తెలుసు. మీ ఎంక్వయిరీ ఎంతత్వరగా పూర్తయితే అంత మంచిది. అంచేత....మీరు అపార్థం చేసుకోకపోతే....ఒక పని....చేద్దాం...."

పైప్ లోకి పొగాకు నింపుతూ మిత్రా అతన్ని కళ్ళు చిట్లించి చూశాడు. "ఏమిటి చెప్పండి!"

"నేను సప్లై చేసే అభ్యర్థుల లిస్టులో ఏయే ఊళ్ళలో వున్నవాళ్ళని యెంతమందిని మీరు ప్రశ్నిస్తారో నాకు తెలీదు. పోస్టుద్వారా సాగితే మీ యెన్క్వయిరీ యేళ్ళ తరబడి సాగుతూనే వుంటుంది. అంచేత...."

"త్వరగా చెప్పండి; నాన్చకండి!"

"అంచేత అభ్యర్థుల్ని తమరే ప్రత్యక్షంగా కలుసుకని...."

"అసంభవం!" మిత్రా అడ్డుతగిలాడు. "అందుక

డిపార్టుమెంటు నాకు పర్మిషన్ ఇవ్వలేదు. టి.ఏ; డి.ఏలు మంజూరు చేయలేదు!"

రాజా చిన్నగా నవ్వాడు. "నాకు తెలుసు... ఇందాకా చెప్పారుగా! మీ యెన్‌క్వయిరీ త్వరగా సాగేందుకు సహకరించే ఉద్దేశంతో విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూటు.........స్వచ్ఛందంగా టి.ఏ; డి.ఏ. వగయిరా ఖర్చులకోసం పాతిక అవసరమైతే యాభై వేలు బహూకరిస్తుంది...."

మిత్రా రెప్పలు పైకెత్తి అతన్ని ఆశ్చర్యంతో చూశాడు. రాజా ప్రోత్సాహకరంగా చిరునవ్వు. సిగ్గూ రెండూ మిళితంచేసి చిరునవ్వు తయారుచేసి, ముఖానికి పులుముకున్నాడు. మిత్రా మౌనంగా జేబులోంచి అగ్గిపెట్టె తీశాడు. పైప్‌ని పళ్ళమధ్య యిరికించి, అగ్గిపుల్ల గీశాడు. పైప్‌ని యివతలికి లాగి, పల్చగా పొగ ఊదుతూ రాజాని తదేకంగా చూశాడు.

"మిస్టర్ రాజా, మీ డబ్బుతో మీరు నన్ను ఇన్‌ఫ్లుయెన్స్ చేయలేరు!"

"మిమ్మల్ని ఇన్‌ఫ్లుయెన్స్ చేయడం నా ఉద్దేశం కాదు...."

"మీరు నాకు యివ్వాల్సింది డబ్బుకాదు; ఇన్‌ఫర్మేషన్!" మిత్రా అడ్డుతగల్తూ అన్నాడు.

"అదీ ఇస్తాను. ఇదీ తీసుకోండి!"

మిత్రా చటాలున పైకి లేచాడు. తీక్షణంగా రాజా మొహంలోకి చూశాడు. "మిస్టర్ రాజా, నేనెవరో మీకు తెలుసా?"

రాజా అర్థంకానట్టు చూశాడు. "చెప్పారుగా, ఎమ్.ఆర్.టి. ...."

"చెప్పావు. నే నెవరో కన్ ఫర్మ్ చేసుకోకుండా మీరు నేను అడిగిందంతా యెందుకిస్తున్నారు?" మిత్రా ప్రశ్న టపాకాయలా పేలింది.

రాజా ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. "జస్టు నమ్మాను...."

మిత్రా కుడిచెయ్యి కోటు జేబులోంచి ఐడెంటిటీ కార్డుని యివతలికి తీసి రాజా వొళ్ళోకి రువ్వింది. అప్రయత్నంగా రాజా దాన్ని అందుకుని చూశాడు. మెల్లిగా లేచి నిలబడ్డాడు.

"మీరు...మీరే!" అన్నాడను ఆశ్చర్యంగా.

"అఫ్ కోర్స్.... నేను నేను కాకుండా మరెవరిగానో మిమ్మల్ని కలుసుకున్నా మీరు మీ సహాకారం, సహాయం—ధనసహాయం—అందించే వ్యక్తిలా అవుపిస్తున్నారు! ఎందుకు మీకీ తాపత్రయం?" మిత్రా గంభీరంగా ప్రశ్నించాడు.

"మా సంస్థమీద అభాండాలు పడకుండా చూడాలన్న తాపత్రయమే...." రాజా మెల్లిగా అన్నాడు.

"మీ తాపత్రయం మోతాదు మించి మోతాదు మించిన వేగంతో ప్రదర్శించబడింది. ఆ మోతాదు మీ మీద అనుమానాన్ని పుట్టిస్తోంది!"

"మిస్టర్ ...మిత్రా...."

"ఆల్ రైట్ .... నేను వెళ్తాను. రేపు మీ సంస్థని ఇన్ స్పెక్ట్ చేస్తాను. నేను అడిగినవన్నీ తయారుగా వుంచండి. మీరు చెప్పినవి....అక్కర్లేదు!"

మిత్రా గిరుక్కున వెనక్కి తిరిగి, గుమ్మం వైపు జోరుగా కదిలాడు. స్లో మోషన్ లో రాజా సోఫాలో చతికిలబడ్డాడు. మూసుకున్న తలుపుమీదే అతని చూపులు

నాటుకుపోయాయి. మిత్రా ప్రవర్తన విచిత్రంగా అనిపిస్తోందతనికి....సాలోచనగా అతను సిగరెట్ తీశాడు. అతని మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది....

## 4

తెల్లారగట్టే వాళ్ళ నిద్రకి భంగం కలిగిస్తున్నందుకు విచారిస్తూ అతను కాలింగ్ బెల్ బటన్ మీద చూపుడు వేలిని నొక్కివుంచాడు. విసుగొత్తి, వేలిని తీసేశాడు. కోటు జేబులోంచి పాకెటు యివతలికి లాగి, సాలోచనగా సిగరెట్ ముట్టించాడు.

వాళ్ళు నిద్రలేచాక, తీరుబడిగా తను రావచ్చు. అయితే, ఆ సమయంలో వాళ్ళకోసం వాళ్ళూ వీళ్ళూ వస్తూంటారు. తన పనికి అంతరాయం కలుగుతుంది. ఎంత మొద్దునిద్ర పోతున్నా వాళ్ళని లేపక తప్పదు! నవ్వుకుంటూ అతను వొంగి ఎడమ చేతిలోని బ్రీఫ్ కేసుని గోడకి ఆన్చి, పైకి లేచాడు. ఎడమ చేతి బొటనవేలిని బెల్ బటన్ మీద నిర్లక్ష్యంగా అదిమాడు.

లోపలెక్కడో మోగుతున్న బజర్ శబ్దం తప్పించి మరే శబ్దమూ అతని చెవుల్ని తాకడంలేదు. పడుకునే ముందు—కాకపోతే—నిద్రకి ఉపక్రమించే ముందు వాళ్ళిద్దరూ నిద్రమాత్రలు వేసుకుంటారా?

తలుపు అటువైపున చప్పుడయింది. గంటని కత్తిలా పొడుస్తున్న వేలిని దూరంగా లాగాడతను. బ్రీఫ్ కేసుని అందుకుని, నిటారుగా నిలబడ్డాడు.

తలుపు కొద్దిగా లోపలికి లాగబడింది. అతని తల తొంగిచూసింది. వెడల్పాటి మొహం, బట్టతలా జిడ్డుతో మెరుస్తున్నాయి. ఎర్రటి కళ్ళు. ఉబ్బిన పెదవులు. అతని మొహంమీదున్న కోపం, కళ్ళలోని ఎరుపూ మాయం

కావడానికి రెండు మూడు క్షణాలు పట్టింది.

"హలా....ఓహ్....మీరా! ఎవరో అనుకున్నా...."

అతను కలవరిస్తున్నట్టు అన్నాడు.

"సాక్షాత్తుగా నేనే, మిస్టర్ రాజా!" అన్నాడతను; మిత్రా.

"పెందరాళే వచ్చారు....ప్లీస్ కమిన్...." రాజా కంఠంలో ఆహ్వానమూ, కొద్దిగా విసుగూ ధ్వనించాయి. తలుపుని బార్లా తెరుస్తూ అతను పక్కకి జరిగాడు.

"మీ బిజినెస్ ప్రారంభమయ్యాక వస్తే మీరు చాలా ఇబ్బందిపడతారు. అందుకే పొద్దుపొడవకముందే మీ ముందు ప్రత్యక్షమయ్యాను!" మిత్రా లోపలికి నడుస్తూ నవ్వుతూ అన్నాడు.

టేబుల్ దగ్గరగా పిపాలా నిలబడి, రాజా తన నైటుగౌన్ బెల్టుని సున్నితంగా బిగించాడు. వినాయకుడి బొజ్జచుట్టూ ఓగుసుకున్న పాములా అతని బొజ్జచుట్టూ అల్లుకుంది బెల్టు.

కుర్చీలో కూచున్న మిత్రా బ్రీఫ్ కేసుని టేబుల్ మీద పెట్టాడు. నవ్వుతూ రాజా వేపు చూశాడు.

"మిస్టర్ మిత్రా, ప్లీస్ రిలాక్స్....కాఫీ తయారు చేసి...."

"నెవర్ మైండ్!" మిత్రా అతన్ని అటకాయించాడు, "మీరు యేకాంతంలో నాకు కావాలి....సిడౌన్!"

అర్థం కానట్టు చూస్తూ రాజా కుర్చీలో చతికిల బడ్డాడు. రెండు చేతుల్తో బట్టతలనీ, కళ్ళనీ, మొహాన్నీ ఒకసారి రుద్దుకున్నాడు. ఇంకా ఎర్రగానే వున్న కళ్ళని ప్రశ్నార్థకాలుగా మార్చి, మిత్రావైపు చూశాడు.

"మనం కలుసుకుని మూణ్నెల్లు దాటింది. ఇవాళ్టి

దాకా, —ఐమీన్ —నిన్నటిదాకా మీ రిపోర్టు కోసం ఎదురుచూశాను...."

"నా రిపోర్టు....పోస్టుద్వారా పంపడానికి బొత్తిగా వీల్లేదు. అలాచేస్తే దాని కాపీల్ని నేను సంబంధించిన అధికార్లకి పంపాలి....అందుకే స్వయంగా వచ్చాను. నా రిపోర్టుని మొదట మీ రొక్కరే చదవడం మాత్ర మంచిది!" మిత్రా నవ్వుతూ అన్నాడు.

"థాంక్స్! యూ ఆర్ కన్సిడరేట్! అయినా ఇంత ఆలస్యం జరుగుతుందనుకోలేదు...."

"లోకంలో మనిషి — ముఖ్యంగా మీ లాంటి మనిషి—అనుకోనివి యెన్నో జరుగుతూ వుంటాయ్!" మిత్రా నవ్వుతూ అన్నాడు.

రాజా తన ఏనుగు కళ్ళని చిట్లిస్తూ చూశాడు, "క్షమించాలి; మీ భావం అర్థంకాలేదు!"

మిత్రా నవ్వుతూ, ఆరిపోయి వేళ్ళమధ్యే ఇరుక్కున్న సిగరెట్‌ని నిర్లక్ష్యంగా కిందికి వదిలాడు. జేబులోంచీ పాకేటు తీశాడు.

"అప్పుడు మనం కలుసుకున్నప్పుడు మీరు పైప్ పీల్చారు...." రాజా నవ్వుతూ అన్నాడు, తన ముందున్న యాష్ట్రేని అతనివైపు జరుపుతూ.

"యస్! సందర్భాన్ని అనుసరించి నా పొగతాగే అలవాటు మారుతూ వుంటుంది!" మిత్రా నవ్వుతూ సిగరెట్‌ని పెదాలమధ్య ఇరికించాడు. వేళ్ళమధ్య వెలిగిన అగ్గిపుల్ల మంటలోకి సిగరెట్‌ని గుచ్చాడు. తల పైకెత్తి రాజావేపు అదోలా చూశాడు.

"నేను చాలా ఆలస్యంగా వచ్చానన్నారు....ఇండియాలో ఎక్కడెక్కడో వున్న మీ శిష్యుల్ని కలుసుకో

డానికి రెణ్నెల్లు పట్టింది...."

"ఐసీ.... తరవాత రిపోర్టు తయారుచేయడానికి ఒక నెల పట్టివుంటుంది లెండి!" హుషారుగా అంటూ రాజా సిగరెట్ వెలిగించాడు.

"తరవాత .... అంటే రిపోర్టు రాయడానికి ముందే నేను అమెరికా వెళ్ళాను. పదిహేను రోజులు అక్కడే వున్నాను...."

"అమెరికా?" రాజా ఆశ్చర్యంతో అడుగగిలాడు. "మిస్టర్ మిత్రా, అమెరికా యెందుకెళ్ళారు? ప్లెషర్ ట్రిప్పా?"

"ఒకవిధంగా. ఆ ట్రిప్ నా కెంతో ప్లెషర్ యిచ్చింది!" మిత్రా నవ్వుతూ అన్నాడు. "నిజం చెప్పా లంటే అది ప్లెషర్ ట్రిప్ కాదు. డ్యూటీమీదే వెళ్ళాను!"

"ఐసీ...."

రాజా చిన్న చిన్న కళ్ళల్లో దోబూచులాడుతున్న అనుమానాన్ని మిత్రా సంతృప్తికరంగా గమనించాడు.

"యూ ౹౸ట టు సీ, మిస్టర్ రాజా..." మిత్రా నవ్వుతూ అన్నాడు. "అక్కడ నేను బ్రాంటన్, న్యూయార్క్, మ్యాపోర్టు దగ్గిరా మీరు ఉదహరించిన యూనివర్సిటీల్ని నా అధికార హోదాలో విజిట్ చేశాను...."

పెదాలదాకా తీసుకెళ్ళిన సిగరెట్ని, పెదాలమధ్య అతికే చకుండా రాజా చెయ్యి అకస్మాత్తుగా సమ్మె చేసింది. కొద్దిగా తెరుచుకున్న అతని నోట్లోంచి ఎర్రటి నాలుక అవుపిస్తోంది. అతని కనుబొమలు కాకి కాళ్ళ కింద ఇరుక్కున్న రెండు గొంగళిపురుగుల్లా అస్తవ్యస్తంగా

కదిలాయి.

"మిస్టర్ రాజా, డ్యూపోర్టు సర్కిల్, వాషింగ్టన్ డి.సి.లో వున్న 'అమెరికన్ కౌన్సిల్ ఆన్ ఎడ్యుకేషన్' ఆఫీసుకి కూడా వెళ్ళాను. ఆ కౌన్సిల్ పనేమిటో తెలుసా?" మిత్రా ప్రశ్నిస్తూ చిరునవ్వు నవ్వాడు.

"....చెప్పండి" రాజా అప్రయత్నంగా అన్నాడు.

"ఏ.సి.ఇ — అమెరికన్ కౌన్సిల్ ఆన్ ఎడ్యుకేషన్ — అధికారం ఇస్తేగానీ అమెరికాలో యే యూనివర్సిటీ కూడా గవర్నమెంటు రికగ్నిషన్ ప్రభుత్వ గుర్తింపు పొందలేదు. అంటే అమెరికాలోని విద్యాసంస్థలకి, అర్హత వున్న వాటికి సక్రమమైన అధికారం — అక్రెడిటేషన్ — మంజూరు చేయడం దాని పని...."

"ఆఫ్ కోర్స్....అది నాకు తెలుసు...." రాజా అడ్డు తగిలాడు.

"మీరు అఫిలియేషన్ పొందిన క్లింటన్, న్యూయార్క్, న్యూపోర్టు వగైరా అమెరికన్ యూనివర్సిటీలు అమెరికన్ కౌన్సిల్ ఆన్ ఎడ్యుకేషన్ నుండీ అక్రెడిటేషన్ పొందలేదని మీకు తెలీదా?" మిత్రా ప్రశ్నించాడు.

"వాట్! నో! అవన్నీ ఆ అధికారాన్ని పొందే వున్నాయి!" రాజా ఉద్రేకంతో అన్నాడు.

"అని మీకెవరు చెప్పారు?" మిత్రా సూటిగా చూస్తూ ప్రశ్నించాడు.

"జోనాథన్, క్లిన్స్, ట్రూమన్, ఫెర్డినాండ్ — ఆయా యూనివర్సిటీల డీన్స్ మాకు రాశారు...."

"మిస్టర్ రాజా, మీరు ఒకేసారి రెండు అబద్ధాలాడుతున్నారు. నేను ఆ విశ్వవిద్యాలయాల్ని సంద

ర్శించానని చెప్పారు. అయినా, కనీసం—మీరు ఒక అబద్ధం ఆడకుండా వుండివుండొచ్చు!”

“వాట్ ....వాట్ ....డూ.....యూ.....మీన్?” రాజా ఆవేశంతో అడిగాడు.

“గతంలో నేను అయిదుచుక్కల హోటల్లో కల్సుకున్నప్పుడు ఆ నలుగుర్నీ డీన్స్‌గా చెప్పారు. ఆ యూనివర్సిటీల డీన్స్ ఎవరో కూడా మీకు తెలీదు! తెలిసినట్టు నటిస్తూ నాలుగు తప్పుడు పేర్లు చెప్పారు ఎందుకు?” మిత్రా గంభీరంగా ప్రశ్నించాడు.

రాజా అర్థంకానట్టు చూశాడు. అతని పెదవులు కదిలాయి.

“మేం కాంటాక్టు చేసినప్పుడు డీన్స్ వాళ్ళే. తరవాత కొత్తవాళ్ళు వచ్చుంటారు!”

తన వెనకనుండీ, గుమ్మం ముందునుండీ పలికిన కంఠం తనది కాదని ఆశ్చర్యంతో తెలుసుకున్న రాజా తటాలున తలతిప్పి చూశాడు.

“ఓహ్! మిసెస్ రాణీ రాజా! గుడ్ మార్నింగ్!” మిత్రా నవ్వుతూ అన్నాడు.

పల్చటి నైటీలో భారీగా నుంచున్న రాణీ అతన్ని రెప్పవేయకుండా చూస్తోంది. ఆమె బాబ్డ్ హెయిర్ని తలగడ చెల్లాచెదరు చేసినట్టుంది. కళ్ళూ పెదవులూ ఉబ్బినట్టున్నాయి. ఆ నైటీకి ఆమెకూ మధ్య మరేవిధమైన నూలుపోగూ లేదని మిత్రా చిరునవ్వుతో గుర్తించాడు.

“డార్లింగ్ ....దిసీజ్ మిస్టర్ మిత్రా....” రాజా పరిచయం ప్రారంభించాడు.

“తెలుసు!” రాణీ అతనికి అడ్డుతగిలి, అవులిస్తూ

పొళ్ళు విరుచుకుంది. వదులు వదులుగా పచ్చటి గుడ్డలో మూటకట్టిన మాంసంలా ఆమె శరీరం నైటీ నవక కది లింది. మిత్రా చిరునవ్వుతో చూస్తూ సిగరెట్ పీకని యాష్ట్రేలో వత్తాడు.

"మీ సంస్థ జన్మించక ముందు అయిదారేళ్ళనుంచే ఇప్పుడున్న వ్యక్తులు డీన్స్‌గా వున్నారు!" మిత్రా కంఠం విని రాజా ఉలిక్కిపడ్డాడు.

"అసంభవం!"

"తెలివితేటలూ, శాక్యం — వుంటే ఈ లోకంలో అసంభవం యేదీలేదని మీరు మీ సంస్థద్వారా నిరూపిం చారు!" మిత్రా నవ్వుతూ అన్నాడు.

"మీ అర్థం?"

"ఇందాకా మీరు ఒకేసారి రెండు అబద్దాలాడారని నేనన్నాను. మీ అమెరికన్ యూనివర్శిటీల డీన్స్ పేర్లు తప్పుగా చెప్పారు. అది ఒకటి. ఇక రెండోది: అక్రెడి టేషన్ గురించి వాళ్ళు మీకు రాశారన్నారు. ఇండియాలో వున్న ఈ విద్యా ఇంటర్నేషనల్ ఇన్స్టి ట్యూట్ గురించి ఆ యూనివర్సిటీలేవీ ఇంతవరకూ విన లేదు!"

"వాట్ డూయూ మీన్? ఆ విశ్వవిద్యాలయాల అఫిలియేషన్ మాకుంది!" రాజా వుద్రేకంతో అరిచాడు.

"డోంట్ ఆర్గ్యూ!" మిత్రా కంఠం హెచ్చిస్తూ అన్నాడు. "నాతో వాదులాటకి దిగితే బాధపడతారు!"

"మిస్టర్ మిత్రా...."

"అమెరికన్ యూనివర్సిటీల డీన్లు యెవరో తెలుసు కునేంత ఇంగితం, అవసరం మీ శిష్యుల్లో యెవరికీ లేక పోయింది. వాళ్ళకి కావాల్సిన డిగ్రీలు మీరు పంచేస్తూ

న్నారు. వాళ్ళకి అది చాలు! అంచేత క్లిప్పులూ, ట్రూమన్‌లూ అంటూ నోటికి వచ్చిన పేర్లు చెప్పుకుంటున్నారు. బాగా ప్రాక్టీస్ చేసిన ఆ పేర్లనే రెండు చేతుల్తో—లేకపోతే — నాలుగు చేతుల్తో సర్టిఫికెట్ల మీద బరికేస్తున్నారు!" మిత్రా ఆగి ఇద్దర్నీ కలయజూశాడు.

ఇద్దరూ రెప్పలు వేయని నాలుగు కళ్ళతో అతన్నే చూస్తున్నారు. రెండు క్షణాల తర్వాత ఇద్దరి తలలూ, ఇద్దరివైపూ తిరిగాయి. ధ్వనిలేని భాషలో ఇద్దరూ అందజేసుకుంటున్న సందేశాలూ, వ్యక్తంచేసుకుంటున్న సందేహాలూ మిత్రా చెవులకి స్పష్టంగా, బిగ్గరగా వినిపిస్తున్నాయ్."

"మిస్టర్ రాజా...."

రాజా ఉలిక్కిపడి తలతిప్పి మిత్రావైపు చూశాడు.

"మొదట నా రిపోర్టు సారాంశాన్ని మీకు వినిపిస్తాను. తరవాత చదువుకోవడానికి ఇస్తాను......" అంటూ మిత్రా కుర్చీలో వెనక్కి వాలాడు.

"గతంలో నీ దగ్గర పనిచేసిన తిరపతి గరుడాచలాన్ని కలుసుకున్నాను. నీ ద్వారా డిగ్రీలు పొందిన పెద్దల్నీ, పిల్లల్నీ చాలామందిని కలుసుకున్నాను. వాళ్ళందరి డిగ్రీల ఫోటో కాపీలూ తీసుకున్నాను. వాటితో పోల్చిచూడాలని ట్రెంటన్, న్యూయార్క్, న్యూపోర్టు, ఫ్రిస్కో—వర్సిటీలు జారీచేసే డిగ్రీల ఫోటోకాపీల్నీ తీసుకువచ్చాను. ఆ విద్యాలయాల ఉన్నతస్థాయి అధికార్లు ఇచ్చిన స్టేట్‌మెంట్సూ తెచ్చాను...."

"ఎన్నో తెచ్చినట్టున్నారు! ఇంతకీ మీరనేదేమిటి?" తనని ఉన్నట్టుండి ఏకవచనంలో పలకరిస్తున్న మిత్రాని

కొరకొరా చూస్తూ రాజా దబాయించాడు.

"నువ్వు అమెరికన్ కరెక్షన్ పేరుతో బోగస్ డిగ్రీలు ఇస్తూ లక్షలక్షలు సంపాయిస్తున్నావ్. డిగ్రీలు, డాక్టరేట్లూ కావాలనే ఆశాజీవులకి దొంగ సంతకాలతో దొంగ 'చదువు కొలతలు' అందిస్తున్నావ్...."

"నాన్ సెన్స్!"

"బడికి వెళ్ళే పనిలేదు. పాఠాలు వల్లించే అవసరం అసలేలేదు. డబ్బు కట్టి వెళ్ళు డిగ్రీ పట్టుకెళ్ళు—అంటూ చక్కటి వ్యాపారం చేస్తున్నావ్...."

"యూ ఆర్ రాంగ్....యూ ఆర్....యూ ఆర్. మీరు ఒక విశ్వవిఖ్యాత విద్యాసంస్థమీద అభాండాలు వేస్తున్నారు. నేను తలచుకుంటే మీమీద కోట్ల రూపాయలకు పరువునష్టం దావా వేస్తాను!" రాజా హుంకరించాడు.

"యస్! అదే సరైన పని! డార్లింగ్ లెట్ హిమ్ షూట్ హిస్ మౌత్!" రాణీ భద్రకాళిలా అరిచింది.

మిత్రా పకపక నవ్వాడు. "నువ్వు అంతకు తెగించినవాడివే అని నాకు తెలుసు. స్థానిక ఎమ్.ఆర్.టి.పి.సి. డైరెక్టర్ జనరల్ మీద అయిదుకందలకి పరువు నష్టం దావా వేశావుగా?"

రాజా ఉరుముతూ చూశాడు. ఏదో అరవబోయి తనని అదుపులో పెట్టుకున్నాడు "మిస్టర్ మిత్రా...."

"ఆ పేరు మరిచిపో...."

"వాట్?" రాజా ఆశ్చర్యంతో అన్నాడు.

"నేను మిత్రుణ్ని కాను; నీ శత్రువుని!"

"వాట్? హూ....ఎవరు మీరు?"

అతను కుర్చీలో వెనక్కివాలి సిగరెట్ వెలిగించాడు.

పొగ ఊదుతూ రాజాకు తెల్లటి పళ్ళు చూపించాడు.

"పేరు శివరామ్...."

"హూ? వాట్? మీరు....నువ్వు...."

"అయామ్ శివరామ్."

# 5

"శివరామ్...." రాజా సాలోచనగా అన్నాడు. "ఎవరు నువ్వు?"

"అప్పుడు నేనెవరో సరిగ్గా తెలుసుకోకుండా నీ కథంతా చెప్పావ్; ఇప్పుడూ నేనెవరో సరిగ్గా తెలుసుకోకుండా నా కథ చెప్పమంటావ్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"నాన్ సెన్స్! చెప్పు! ఎవరు నువ్వు?"

"అర్నెల్లక్రితం నీ దగ్గర ఎమ్.బి.ఏ.కి సుంకం నలభై అయిదు వేలు చెల్లించిన సాగరికకూ, ఎమ్.బి.బి.ఎస్. కోసం చాలా పెద్ద మొత్తం చదివించిన గిరికకూ సంబంధించినవాణ్ని!"

"సాగరిక....గిరిక....వాళ్ళెవరు?"

"ఇద్దరూ ఒక్కరే!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"వాట్! ఐ ఉయ్....కాంట్ బిలీవ్!" రాణీ అరిచింది.

"డోంట్ బిలీవ్ రాణీ జీ!" శివరాం నవ్వుతూ అన్నాడు. తన చూపుల్ని రాజావైపు తిప్పాడు.

"సాగరికకి నువ్వు అందించిన,—అర్నెల్లలో ఆమెని ఎమ్.ఏ.లిట్ గా, ఎమ్.బి.ఏ.గా పోతపోస్తూ అందించిన స్టాంటన్ యూనివర్సిటీ కాగితాల్ని తీసుకెళ్ళి అమెరికాలో అసలు వ్యక్తులకు చూపించాను. నీ కథంతా వాళ్ళందరికీ సాక్ష్యాధారాలతో వివరంగా అందచేస్తానని

వాగ్దానం చేసి, వాళ్ళ స్టేట్‌మెంట్స్ తీసుకుని చక్కా వచ్చాను. ఇండియాలో కూడా చాలామందిని మిత్రా అవతారంలో కలిశాను. నీ మోసం వాళ్ళకి వివరించాను. నా ఆధ్వర్యంలో వాళ్ళల్లో చాలామంది నీ బతుకుని కోర్టులో ఉతికి ఆరేయడానికి తయారుగా వున్నారు."

"నో!" రాజా ఘీంకరించాడు.

"నీ తుక్కు కాగితాలద్వారా ఇంక్రిమెంట్లూ, చివరికి ప్రమోషన్‌లూ సంపాయించుకున్న కొంతమంది బ్యాంక్ వాలాలు నాతో సహకరించనిమాట కూడా నిజమే! అయినా వాళ్ళ సహకారంతో మనకి పనిలేదు...."

"మిత్రా.... శివరాం.... ఇదంతా, ఇదంతా యెందుకు చేశావ్? ఇంతకీ నువ్వెవరు?"

"ఎవరికీ వీసమెత్తు శ్రమలేకుండా చదువు చెప్పించే నీనుండీ చదివింపులు స్వీకరించేవాణ్ని!" శివరాం సగర్వంగా అన్నాడు.

రాజా నోరు చిన్న గుహలా తెరచుకునే వుండిపోయింది. రాణీ మెల్లిగా బుట్టబొమ్మలా కదిలింది. కుర్చీ దగ్గరగా నిలబడ్డ ఆమె చెయ్యి రాజా భుజంమీద వాలింది. ఆమె కళ్ళు శివరాం మొహంమీదే తాపడం అయిపోయాయి.

"ఈ మధ్య మన ప్రభుత్వం ఒక ప్రకటన విడుదల చేసింది. అనారోగ్యం రాజ్యంచేస్తున్న మనదేశంలో యేడు లక్షలమంది నకిలీ డాక్టర్లున్నారని ప్రభుత్వం లెక్క తేల్చింది. ఈ యేడులక్షల మందిలో కొన్ని వేల మందినైనా నువ్వు డాక్టర్లుగా తయారుచేసి వుంటావ్!"

"వేలు.... కాదు.... వందలు...., కాదు.... పదులు...."

రాజా తడబడుతూ అన్నాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "నాకు సప్లై చేసిన వివరాలు అసంపూర్ణంగా వున్నాయని ఆ రోజే నాకు తెలుసు. ఏమీ యెరగని ఆఫీసర్లా ఆ రోజు వెళ్ళిపోయాను. కానీ, రాజాసాబ్, నీ గురించి నేను పూర్తిగా కనిపెట్టాను...."

"ఇ....ఇ....ఇంతకీ నీకేం కావాలి?" రాజా కంఠం అతని ప్రయత్నం లేకుండానే వణికింది.

"ఎమ్.బి.బి.యస్. బహూకరించడానికి అభ్యర్థుల నుండే నువ్వు యెంత తీసుకున్నావ్?"

"దటీజ్ నన్నాఫ్ యువర్ బిజినెస్!" రాణీ కీచుగా అరిచింది.

యజమాని తరఫున గుర్రుమనే జాతికుక్కలా వున్న రాణీని శివరాం చిరునవ్వుతూ చూశాడు.

"నాకు ఎంత తెలుసో, నేను ఏం చేయాలనుకుంటున్నానో, ఎందుకు చేయాలనుకుంటున్నానో, ఎలా చేయాలనుకుంటున్నానో పూర్తిగా తెలుసుకోకపోతే — వెనకటికి శత్రువులు చుట్టుముట్టిన కోటలో ఇరుక్కుపోయి చివరికి ఆత్మహత్య చేసుకున్న యెవరో రాజారాణీల్లాగా మీరిద్దరూ ఒకే తాడుకి ఇరువైపులా వేళ్ళాడుతూ ప్రాణాలు వదుల్తారు!"

"రాణీ డార్లింగ్....కాస్సేపు నువ్వూరుకో!" రాజా శివరాంవైపే చూస్తూ భార్యని వారించాడు. అంతా చెప్పమన్నట్టు అతని కళ్ళు భావాన్ని మార్చాయి.

"ఇందాకే కొంత చెప్పాను. ఇప్పుడు ఇంకొంచెం చెప్తాను. నువ్వు తయారుచేసిన నకిలీ డాక్టర్లలో ఏడుగుర్ని ఈ తెలుగు గడ్డమీద, రెండే రెండు చిన్న టౌన్స్‌లో గుర్తించాను. రోగుల్ని చంపడంలో కేవలం

అబార్షన్లు చేసి తరవాత్తరవాత పిల్లలు పుట్టకుండా ఆడవాళ్ళ గర్భాశయాల్ని తయారుచేయడంలో, ఇంజెక్షన్ చేసి, సెప్టిక్ తెప్పించడంలో రికార్డు సృష్టించారు వీళ్ళంతా. అయినా వాళ్ళకి వైద్యం తెలీదని ప్రజలకి తెలీదు. ఎమ్.బి.బి.ఎస్. బోర్డు ప్రజల కళ్ళని పొరలా కప్పేసింది. ఈ ఏడుగురు వైద్యుల ద్వారా సర్వనాశనం అయిపోయిన అమాయకుల్ని కొంతమందిని పట్టాను. వాళ్ళందరి తరఫునా ఖర్చులు నేనే భరిస్తాను. వాళ్ళు ఆ డాక్టర్లమీద దారుణమైన కేసులు బనాయిస్తాను."

"ఐ డోంట్ కేర్! ఎవడో ఎవడిమీదో కేసు పెడితే నాకేం భయం? గో అహెడ్!" రాజా హుందాగా అన్నాడు.

"కోర్టులో నిగ్గు తేలిపోతుంది. వాళ్ళవి నకిలీ సర్టిఫికేట్లన్న విషయాన్ని అక్కడ ప్రతిపాదిస్తాం. ఎవడు, ఎవడిమీదో బనాయించిన కేసు కనిపించని గొలుసులా సాగి, నీ మెడని చుట్టి నిన్ను కోర్టుకి ఈడుస్తుంది. విద్యా ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ద్వారా నకిలీ డాక్టర్లని దేశానికి సప్లై చేసిన నిన్ను...."

"స్టాప్! స్టాప్ ది నాన్‌సెన్స్!" రాజా అరిచాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "ఏయే అమెరికన్ వర్సిటీల పేరుతో ఎవరెవరికి ఏయే డిగ్రీలు పంచి పెట్టావో నేను కంఠస్థం చేశాను. సర్టిఫికెట్ల కాపీలూ, పొందినవాళ్ళ పూర్తి వివరాలూ చక్కగా తయారుచేసి, నా వాగ్దానం ప్రకారం ఆయా వర్సిటీలకి సప్లై చేస్తాను. న్యూయార్క్, బోస్టన్, న్యూపోర్టు, ఫ్రీపోర్ట్—అన్నీ కలిసి మూకుమ్మడిగా నీ సంస్థమీద పకడ్బందీగా,

అమెరికన్ కేసు—ఇండియన్ కాదు — బనాయిస్తారు. అప్పుడు నువ్వూ, నీ రాణీ గాలిలో ఎగురుతూ అమెరికాకి వెళ్ళి కోర్టుపని చూసుకుని, అమెరికా ట్రిప్‌ని చాలా పార్లు ఎంజాయ్ చేస్తారు...."

"శివరాం...."

"ఇంతా చెప్పాలి; నువ్వు వినాలి!" శివరాం అతన్ని నిర్లక్ష్యం చేస్తూ అన్నాడు. "ఒకవైపున ఇదంతా జరుగుతూ వుంటే మరోవైపున నీ దేశసేవ గురించి పల్లె పల్లెలూ; వీధి వీధులూ, వాడవాడలా దండోరా వేయిస్తాను. నీ కథంతా వివరంగా వున్న నా రిసెర్చ్ ఫైల్ కాపీల్ని ఇండియాలోని అన్ని భాషల పత్రికలలకీ సప్లై చేస్తాను. 'విద్యా ఇంటర్నేషనల్' ద్వారా డిగ్రీలూ డాక్టరేట్లూ తేరగా సంపాయించుకున్న మన సోదరులంతా గగ్గోలెత్తిపోతారు. విద్యా ఇంటర్నేషనల్ జారీ చేసిన డిగ్రీలన్నీ బోగస్‌వనీ వాటన్నింటినీ రద్దుచేస్తున్నామనీ ప్రభుత్వం అనౌన్స్ చేసేలా చూస్తాను...."

"నో....యూ...."

"అది చాలా కూశీ అని నీకు తెలుసు. నీ ద్వారా డాక్టరేట్లూ పోస్టుగ్రాడ్యుయేట్ ఫ్యాకల్టీలూ పొందిన ముగ్గురు మినిస్టర్ కేంద్రంలో వున్నారు. వాళ్ళని స్వయంగా కల్సుకుంటాను....ఆ తరవాత యేం జరుగుతుందో నీకు తెలుసు!" శివరాం అగి సిగరెట్ వెలిగించాడు.

రాజా బట్టలలా, ముఖం పూర్తిగా చెమటతో తడిసిపోయాయి. అలవాటుకి విరుద్ధంగా అయిదుగంటలకే నిద్రలేచిన అతనికి జరుగుతోందంతా కలలాగే వున్నట్టుంది. అతని భుజమ్మీదున్న రాణీ కొద్దిగా కదుల

తోంది. ఆమె చర్మంలోంచీ ఊరుతున్న చెమట పల్చటి నైటీని ఆకర్షణీయమైన ప్రదేశాల్లో అతికిస్తోంది.

శివరాం మళ్ళీ ప్రారంభించాడు. "బొంబాయి జె.జె. హాస్పిటల్లో మృతిచెందిన రోగుల విషయంలో పరిశీలన సాగించి, 'కమిషన్ రిపోర్టు' తయారుచేసి, మహారాష్ట్రలో గందరగోళం సృష్టించిన జస్టిస్ లెంటిన్ లాంటి చాకుతో 'కమిషన్' నియమించమని నేను మన డాక్ట కేట్ మంత్రులద్వారా ప్రభుత్వానికి సలహా ఇస్తాను. కమిషన్ విచారణ పూర్తయ్యేసరికి....నీ చరిత్ర...."

ఉలిక్కిపడి శివరామ్ ఆపేశాడు. రెండు పిడికిళ్ళతో టేబుల్ని బాదిన రాజా మొహంలోకి ఆశ్చర్యంతో చూశాడు. రాజా మొహం మండుతున్న కుంపటిలా వుంది. ఇంకా బిగించేవున్న రెండు పిడికిళ్ళనూ రాజా పైకెత్తాడు. ఎన్నో. ఎన్నెన్నో ఆలోచనలు అతని జిడ్డు మొహంమీద కలగాపులగంగా ప్రత్యక్షమవుతున్నాయి. బరువుగా, పొడుగ్గా, బిగ్గరగా నిట్టూరుస్తూ రాజా తనలోని ఆవేశాన్నీ, ఆగ్రహాన్నీ, కంగారునీ ఇవతలికి తరిమేశాడు. అతని పిడికిళ్ళు వదులు అయ్యాయి. చేతులు మెల్లిగా టేబుల్మీదికి వాలాయి. తల, పక్కనే లావుపాటి ఫ్రెంచ్ రబ్బరుబొమ్మలా నించున్న రాణీవేపు తిరిగింది.

"డియర్....మనకీ, మిస్టర్ శివరామ్కీ వేడి వేడి కాఫీ—తయారుచేసి పట్రా. బుర్ర మొద్దుబారి పోయింది!"

రాజా కంఠంలో యింకా ప్రవేశించని వణుకు శివరామ్కి ఆశ్చర్యం కలిగించింది. రాణీ స్వప్నచారిలా కదిలి, కర్టెన్ వెనక అదృశ్యమైంది. పంక్చర్ అయిన

సైకిల్ ట్యూబ్‌లా ధ్వనించిన రాజా నిట్టూర్పు శివరామ్ చూపుల్ని అతనివేపు లాగింది.

"మిస్టర్ శివరామ్, మీరు చాలా తెలుసుకున్నారు. అయితే ఆ తెలుసుకోడానికి కారణమైన ఆధారం—యేదైనా కానీ—పచ్చి అబద్ధం. ఆధారం అబద్ధమై నప్పుడు దానిమీద నిర్మించిన సిద్ధాంతం నిజంకాదు! నిజం కాలేదు! అంచేత ...."

"అలాగా!"

"అంచేత, మీరు కనిపెట్టిందాన్నంతా అట్టే సీరియసుగా తీసుకోకండి...."

"అలాగా!"

"మిస్టర్ శివరామ్, పొద్దుటే నిద్రమొహంలో అట్టే పొల్లు యొక్క తాళిని ఒట్టుకోడం సాధ యిష్టంలేదు!" రాజా హుందాగా అన్నాడు.

"అలాగా?" శివరామ్ సీరియసుగా అడిగాడు.

ఏదో చెప్పబోయిన రాజాకి రాణీ రాక అంతరాయం కలిగించింది. భర్త దగ్గరగా వున్న మరో టేబుల్ మీద ట్రేని పెట్టి, ఆమె రెండు చేతుల్తో రెండు కప్పుల్ని అందుకుంది. ఒక కప్పుని రాజాకు అందిస్తూ యెడంచేతిలోని కప్పుని తన దగ్గరగా టేబుల్ మీద పెట్టుకుంది. రెండు చేతుల్తో ట్రే పట్టుకొని శివరామ్ దగ్గరగా నడిచింది. ట్రేని అతనిముందు పెట్టి వెనక్కి తిరిగింది. లావుపాటి పేకట్ సైజ్ నవలకి అతికించిన లామినేషన్‌లా ఆమెని అంటిపెట్టుకున్న నైటీని శివరామ్ చిరునవ్వు నవ్వుతూ చూశాడు.

"కాఫీ తీసుకోండి!" రాజా అన్నాడు.

కాఫీ చప్పరిస్తున్న అతన్నీ, రాణీనీ చిరునవ్వుతో

చూస్తూ శివరామ్ సిగరెట్ వెలిగించాడు. మెల్లిగా పైకి లేచి కాఫీకప్పు రింగులో వేలిని దూర్చాడు. కప్పు పైకెత్తి రాజావేపు కదిలాడు. నోటిదగ్గర్నుంచీ కప్పుని దూరంగా లాగి, రాజా దగ్గరగా నించున్న శివరామ్ ముఖంలోకి చిరునవ్వుతో చూశాడు.

"రాజాసాబ్, అయామ్ సారీ ఫర్ యూ...." శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాజా అర్థంకానట్లు చూస్తూ నోరు తెరిచాడు.

"పొద్దుటే కప్పుడు కాఫీ మింగడం వాడి అలవాటు లేదు...." అంటూ శివరామ్ మెల్లిగా తన కప్పులోని కాఫీని రాజా కప్పులోకి సగంపైగా వొంపాడు. కప్పు పట్టుకున్న రాజా చెయ్యి కొద్దిగా వణకడం శివరామ్ చూపుల్నుంచీ తప్పించుకోలేకపోయింది.

అసంకల్పితంగా రాజా కప్పుని టేబుల్ మీద పెట్టేశాడు. శివరామ్ అతన్ని నవ్వుతూ చూశాడు.

"త్వరగా కాఫీ ముగించు; సిగరెట్ ముట్టించు. వ్యవహారం ఫైనలైజ్ చేద్దాం!"

రాణీ ఆదరాబాదరా వాళ్ళ దగ్గరగా వచ్చింది. "డార్లింగ్ ....అంత కాఫీ తాగలేవనుకుంటాను...."

రాజా మౌనంగా అవునన్నట్లు తల ఆడించాడు.

"ఫర్వాలేదు. రాజా డల్‌గా అవుపిస్తున్నాడు. కాఫీ అతనిలోకి ఉషారెక్కిస్తుంది. ఇప్పుడతను ఉషారుగా వుండాలి!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాణీ చిరునవ్వుతో చూసింది. "నో మిస్టర్ శివ్రామ్! మీ కాఫీలో పంచదార వేశాను. రాజాకి డయాబిటీస్ వుంది. పంచదార పనికిరాదు!"

రాజా కప్పుని అందుకోబోతున్న లొండంలాంటి రాణీ

చేతిని శివరామ్ కటాలున పట్టుకున్నాడు. రాణీ కంగారుగా చూసింది. శివరామ్ యెగతాళిగా నవ్వాడు.

“నా కాఫీలో పంచదార కాదు; పొటాషియం సైనైడ్, వోవర్‌డోస్ నిద్రమాత్రలో కలిపావ్!” శివరామ్ కంఠం ఖంగుమంది.

“మిస్టర్ శివ్....”

“షటప్!” శివరామ్ హుంకరించాడు. “బిచ్! గార్డినల్లో, గరళమో అందులో కలపలేదని నీ మొగుడో నువ్వో తాగి నిరూపించండి!”

అప్రయత్నంగా రాణీ రాజా మొహాలు చూసుకున్నారు. శివరాం చెమటతో జిగటగా వున్న రాణీ చేతిని వదిలేశాడు. కాఫీకప్పుని టేబుల్ మీద కుక్కాడు. వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. కంగారుగా తనవేపు చూస్తున్న ఇద్దర్నీ తీక్షణంగా చూశాడు.

“శివరాం....పొద్దుటే అతిథ్యం ఇస్తున్న మమ్మల్ని అవమానిస్తున్నావ్!” రాజా కసిగా అన్నాడు.

“అవమానించడం కాదు; అపరాధం విధిస్తాను!” శివరాం గంభీరంగా అన్నాడు.

“వాట్ .”

“నోర్ముయ్!” శివరాం కంఠం రాజాని ఉలిక్కిపడేలా చేసింది. “నీ కథంతా నా కోటుజేబుల్లో, బ్రీఫ్‌కేసుల్లో దాక్కుందనుకున్నావ్! నీ కథ జిరాక్స్ కాపీలు చాలా చేతుల్లో వుంది. నేను ఆజ్ఞాపిస్తే కానీ ఆ కాపీలు మరో చేతికి మారవు. నేను ఆజ్ఞాపిస్తేగానీ పదకొండు గంటలకి అధికార్ల చేతుల్లోకి వెళ్ళకుండా ఆగవు!”

“నో!” రాజా అరిచాడు.

“నీ రాణీమీద ఒట్టు....!” శివరామ్ నవ్వుతూ

అన్నాడు.

రాజా గుడ్లు మిటకరించాడు. రాణీ భర్త ముఖం లోకి మార్చి మార్చి చూసింది.

"డార్లింగ్, మరిగే కుక్కకి బిస్కట్ గిరా టేయ్!" రాణీ కంఠం ఓటమితో, కసితో కత్తిలా పదు నెక్కింది.

"మంచి నిర్ణయం!" శివరాం నవ్వాడు.

టేబుల్ మీదున్న రాజా చేతులు మళ్ళీ పిడికిళ్ళుగా బిగుసుకున్నాయి. తల కొద్దిగా తిప్పి భార్యవేపు అదోలా చూశాడతను. నిమిషంపాటు రాణీతో కళ్ళ భాషలో సంప్రదించిన రాజా, చివరికి నిట్టూర్చి శివరాంవైపు చూశాడు.

"ఆల్‌రైట్ .... నీకు యేంకావాలి?" నినాదాలు అరిచీ అరిచీ పూర్తిగా పాడయిపోయిన కంఠంలా బీరగా ధ్వనించిందతని కంఠం.

"ఇందాక ఒక ప్రశ్న అడిగాను. సమాధానం చెప్ప కుండా నీ రాణీ కత్తి అడ్డం పెట్టింది. యం.బి.బి.యస్. కాగితానికి నువ్వు చార్జ్ చేసే మొత్తం ఎంత?" శివరాం ప్రశ్నించాడు.

"వివరాల్లో అంతా ఇచ్చాను. రెండు లక్షలని నీకు తెలుసు ...."

"నాకు ఇంకా తెలుసు! రెండులక్షలు రసీదు మొత్తం. రసీదులోకీ, లెక్కల్లోకీ యెక్కకుండా నువ్వు మరో రెండో, మూడో, నాలుగో గుంజుకుంటావనీ నాకు తెలుసు. గిరికని డాక్టర్‌కోర్స్‌కి నీ దగ్గరకు పంపింది నేనే అని మరిచిపోతున్నావ్!" శివరాం నవ్వుతూ ఆగాడు.

రాజా మెల్లిగా గుటకలు మింగాడు. "అది....అ

మొత్తం ....మనిషినిబట్టి మారుతూ వుంటుంది....సరాసరి.... రెండు ...”

“సరాసరి.... మూడు అనుకుందాం....రాజాసాబ్.... ఆ రేటున నాకు పదిహేను ఎం.బి.బి.యస్. కాగితాలూ, ఇరవై ఎం.బి.ఏ. ఎం.ఏ. కాగితాలూ ...కావాలి....”

“ఆర్ యూ....ఆర్ యూ సీరియస్?” రాజా నమ్మలేనట్టు చూస్తూ అడ్డు తగిలాడు.

“మీ యిద్దరిమీదా ఒట్టు!” శివరాం నవ్వుతూ అన్నాడు. “సో ఆ మొత్తం కాగితాలకి యెంతవుతుంది? రెండింటికీ కలిపి నువ్వు సాగరిక దగ్గర నలభై అయిదు వేలు వసూలు చేశావు. సులువుగా వుంటుంది; యాభై చొప్పున లెక్క పెట్టు!”

రాజా అయోమయంగా చూశాడు. రాణీ ప్రపంచంలోని సరికొత్త వింతను చూస్తున్నట్టు శివరాంనే చూస్తోంది. రాజా చివరకి గొంతు పెగల్చుకున్నాడు.

“శివరాం.... లెక్క లెందుకు? ఆర్నెల్లలో అవన్నీ నీకు అందిస్తాను. ఏయే పేర్లతో కావాలో చెప్పు....”

రాణీ అతని మాటని అండర్‌లైన్ చేస్తున్నట్టు బుర్రని ఆవేశంతో ఊపుతూ వుండిపోయింది.

“ఆర్నెల్ల వ్యవధి లేదు. పదిరోజుల్లోగా నా పని పూర్తి కావాలి!” శివరాం సీరియసుగా అన్నాడు. “లెక్క లెందుకన్నావ్. లెక్కలు కావాలి. ఎంత?”

“ఇట్ కమ్స్ టూ అరౌండ్....సిక్స్టీ...అరవై లక్షలు....” రాణీ కల్పించుకుంది.

శివరాం ఆమెను నవ్వుతూ చూశాడు. “రాణీ బెహన్, ముందు నువ్వు విద్యా ఇంటర్నేషనల్ ద్వారా ఓ పెద్ద ఫ్యాకల్టీ సంపాయించుకో!”

రాణీ మొహం కందగడ్డలా అయింది. శివరాం ప్రశ్నార్థకంగా రాజా మొహంలోకి చూశాడు.

"అంతే కాదు; డెభై...." రాజా గొణుక్కుంటు న్నట్టు అన్నాడు.

"కరెక్ట్! డెభైంతులు. ప్లస్...."

"అంతకంటే ఎక్కువ అవదు. ఏ పేర్లతో కావాలో చెప్పు. రాణీ, టేక్ డౌన్, డార్లింగ్!" రాజా అరుస్తూ అన్నాడు.

కదలడానికి ప్రయత్నించిన రాణీని శివరాం కంఠం ఆపేసింది.

"పేర్లూ ఊర్లూ అవసరంలేదు."

రాజా అయోమయంగా చూశాడు. క్షణంలో అర్థమై నట్టు చిన్నగా నవ్వాడు. ఉషారుగా సిగరెట్ వెలిగించాడు. పొగ ఊదుతూ శివరాంవైపు ఉల్లాసంగా చూశాడు.

"అర్థమైంది శివరాం. నీకు బ్లాంక్ సర్టిఫికెట్స్ కావాలి. అభ్యర్థుల పేర్లు తప్ప తతిమ్మావన్నీ, సంతకాలూ—వగైరా చేసెయ్యాలి. వాట్ని నువ్వేం చేస్తావో ఊహించుకోగలను శివరాం!" రాజా కంఠంలో గర్వం, తెలివీ జోడుగంటల్లా ధ్వనించాయి.

శివరాం అమాయకంగా చూశాడు. "ఏం చేస్తాను?...."

రాజా చిన్నగా నవ్వాడు. "డెభైంతుల విలువకి నా దగ్గర సంపాదించిన సర్టిఫికెట్లని—కోటి రూపాయలకి వాళ్ళకీ వీళ్ళకీ అమ్ముకుంటావ్. కొన్నవాడి పేరు రాని సర్టిఫికెటుకి పూర్తిరూపం ఇస్తావ్!"

శివరాం కనుబొమలు విల్లులా కదిలాయి. అబ్బురంగా

రాజాని చూస్తూ అతను జేబులోంచి సిగరెట్ తీశాడు.

"డార్లింగ్....హి ఈజ్ స్మార్ట్!" రాణీ కంఠం రాజాను చక్కిలిగింతలు పెట్టింది.

నవ్వాపి రాజా శివరాం కళ్ళల్లోకి అదోలా చూశాడు. అతని పెదవులు కదిలాయి. "యస్ డియర్....యూ ఆర్ రైట్....హి ఈజ్ స్మార్ట్!"

శివరాం చిన్నగా నవ్వాడు. "ఎస్ రాజా, అయామ్! నేను తెలివయినవాణ్నే! నాది తెలివి; నీది దొంగ తెలివి...."

"వాట్ డూ యూ మీన్?" రాజా ఆశ్చర్యంతో చాడు.

"బ్లాంక్ చెక్కుల్లాగా బ్లాంక్ సర్టిఫికెట్లు తీసుకుని, నువ్వూ, నీ రాణీ ఫోర్జ్ చేసిన సంతకాల్తో వాటికి ప్రాణం పోసి, కొనేవాళ్ళ పేర్లు రాసి అమ్మి సొమ్ము చేసుకొనే చవకబారు వ్యాపారం నేను చేయను!" శివరాం గంభీరంగా అన్నాడు.

"అయితే అన్ని సర్టిఫికెట్లు నీ కెందుకు?"

"సర్టిఫికెట్లు నాకెందుకు? సర్టిఫికెట్ల విలువ కావాలి నాకు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రాజా, రాణీ నోళ్ళు వెళ్ళబెట్టి ఆశ్చర్యంగా చూశారు.

"ఇందాకా నేను కొన్నన్న సర్టిఫికెట్లకి—నీ రేటు ప్రకారం—విలువ రెండైలక్షలవుతునది. దానికి అపరాధం కలిపితే రెట్టింపుఅయిదవుతుంది...."

"అపరాధం....అదేమిటి?" రాజా నివ్వెరపోతూ అడిగాడు.

"నువ్వూ నీ పెళ్ళాం కళ్ళతో మాట్లాడుకుని నా

కాఫీలో మరేదో కలిపారు. నన్ను చంపడానికో, స్పృహ తప్పించడానికో ప్రయత్నించారు. ఆ దారుణానికి మీ ఇద్దరికీ నేను విధించిన పెనాల్టీ ...."

"ఇది అన్యాయం....! మేం యేమీ కలపలేదు! నువ్వు ..."

"నోరు మూసుకో!" శివరాం గర్జించాడు. "ఏమీ కలపకపోతే, నువ్వో నీ రాణియో ఆ కాఫీ తాగండి, చూద్దాం!"

రాజా తదేకంగా శివరాంవేపు చూశాడు. "ఆల్ రైట్ ....నువ్వేదో ఊహించుకున్నావ్; నీ ఇష్టం .... ఇంతకీ నీ వ్యవహారం నాకు అర్థం కావటంలేదు. సర్టిఫికెట్లన్నావ్; విలువ అన్నావ్ ...."

"ఎగ్జాక్ట్లీ! సర్టిఫికెట్ల విలువ........! నీ సంతకాలున్న సర్టిఫికేట్స్ నాకు వద్దు. రిజర్వ్ బాంక్ గవర్నర్ సంతకాలున్న ప్రింటెడ్ సర్టిఫికెట్లు కావాలి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"వాట్?"

"అర్థంకాలేదా? రిజర్వ్ బాంక్ గవర్నర్ సంతకం చేసిన సర్టిఫికెట్లు—అంటే కరెన్సీ నోట్లు...."

"వా అఅఅట్ ....?" రాణీ రాగయుక్తంగా అరిచింది.

"కరెన్సీనోట్లను మించిన సర్టిఫికెట్లు భూప్రపంచంమీద లేవని నీకు తెలుసు రాజాకాకా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"యూ బ్లాక్ మెయిలింగ్ స్కౌండ్రల్!"

"ఎక్కడ బ్లాక్ మనీ ఉంటుందో అక్కడ బ్లాక్

మెయిలింగ్ ఉంటుంది!" శివరాం నవ్వుతూ అన్నాడు. "ఇంతకీ నా బ్లాక్ మెయిలింగ్ కి తలొంచుతున్నావా?"

"నీలాంటి జులాయిలకి ఈ తల వంగదు!" రాజా గంభీరంగా అన్నాడు.

శివరాం వులాసాగా నవ్వాడు. "వంగని తల తెగి పోతుంది!"

"నాన్ సెన్స్! డియర్ ... గెట్ మీ పోలీస్ ఆన్ ఫోన్!" రాజా అరిచాడు.

శివరాం మెల్లిగా లేచాడు. బ్రీఫ్ కేసు తెరిచి, ఒక ఫైల్ని టేబుల్ మీద పడేశాడు. రక్తవల్లా తయారైన కళ్ళని రాజా మొహంమీద నిలిపాడు.

"హోటల్ కాంటినెంటల్. రూం రెండూ రెండూ నాలుగూ నాలుగూ. నీ పోలీసుల్ని తీసుకుని అక్కడికి రా! ఈ ఫైలు కాపీలు బోల్డన్ని వున్నాయక్కడ. నన్నూ, నీ ఫైళ్ళనీ అదుపులోకి తీసుకొమ్మని పోలీసులకి చెప్పు. వాళ్ళొచ్చేలోగా కొన్ని కాపీలు అక్కడికీ ఇక్కడికీ ఎగిరిపోతాయ్. గుడ్ బై!...." శివరాం వెనక్కి తిరిగాడు.

"మిస్టర్ శివరాం.... ఒక్క క్షణం...." కొత్తగా ధ్వనించిన రాణీ కంఠం శివరాం పాదాల్ని నేలకేసి నొక్కిపట్టింది. శివరాం తలతిప్పి చూశాడు. రాణీ అతన్ని చూడ్డంలేదు.

"డార్లింగ్ .... మొరిగే కుక్కకి బిస్కట్ పడేయమని ఇందాకే చెప్పాను. యూ ఆర్ మేకింగ్ ఎ రాంగ్ మూవ్!" అందామె రాజా భుజమ్మీద చెయ్యివేస్తూ.

తన ఆగ్రహావేశాల్ని కంట్రోల్ చేసుకుంటూ రాజా

'అంతేనంటావా?' అన్నట్టు ఆమెని చూస్తున్నాడు.

శివరాం వెనక్కి తిరిగి యిద్దర్నీ నవ్వుతూ చూశాడు.

"అందుకే మనవాళ్ళు 'కరణేషు మంత్రీ' అన్నారు భార్యని! రాణీ బెహన్, బాగా చెప్పావ్!"

రాణీ అతన్ని ఉరుముతూ చూసింది. శివరాం చిన్నగా నవ్వాడు.

"సర్టిఫికెటు కట్టలు అడుగుతున్నానని అనుకున్నంత సేపూ నీ మొగుడు నన్ను బ్లాక్ మెయిలర్ అనలేదు. నోట్ల కట్టలనేసరికి బ్లాక్ మెయిలర్ బిరుదిచ్చేశాడు!"

"డార్లింగ్....యెంతో కొంత ఇచ్చేసెయ్. లేనిపోని పబ్లిసిటీ రభసా...."

"ఓకే...." రాజా ఆమెకి అడ్డుకగిలాడు. "ఓకే శివరాం, గొంతెమ్మ కోరికలు కోరకుండా సక్రమంగా అడుగు; పట్టుకపో!"

శివరాం గొంతెత్తి గొల్లున నవ్వుతూ ఉండిపోయాడు. "గొంతెమ్మకోరిక! కరెక్ట్! సక్రమంగా, చట్టబద్ధంగా చదవలేని సోమరిపోతులు కోరే గొంతెమ్మ కోరికలు నీకు వరాలయ్యాయి. తేరగా కోట్లు సంపాయించాలన్న 'పెద్ద గొంతెమ్మ పెద్దకోరిక' నిన్ను దయ్యంలా పట్టుకుంది. అడ్డదారిలో డిగ్రీలు సంపాయించుకోవాలనే గొంతెమ్మకోరికల అభ్యర్థుల్నీ, అడ్డదారిలో డబ్బు రాశిగా పోసుకోవాలన్న గొంతెమ్మకోరిక వున్న నిన్నూ పట్టిన దయ్యాన్ని వదలగొట్టడానికి నేను రంగంలోకి దిగాను. నీ...."

"ఉపన్యాసం ఆపెయ్! ఎంతో అడుగు!" రాజా గద్దించాడు.

"ఇందాకే నువ్వే చెప్పావ్; ఆ సర్టిఫికెట్ల మొత్తం

ఎంతో!"

"మిస్టర్ శివరాం మీకు కావాల్సినంత అడగకండి.. రాజా ఇవ్వగలిగినంత అడగండి!" రాణీ కల్పించుకుని మర్యాద పుట్టిపడేలా అంది.

శివరాం చిన్నగా నవ్వాడు. "నాక్కావాల్సినంత మీ దగ్గరే కాదు; ఇండియాలో చాలామంది షావుకార్ల దగ్గరే లేదు. నేనడుగుతోంది నాకు కావాల్సినంత కాదు; మీరు ఇవ్వగలిగినంతా కాదు; మీరు ఇవ్వాల్సినంత!"

'చూశావా' అంటూ చాడీ చెప్తున్న వాడిలా రాజా రాణీవేపు చూశాడు. మెల్లిగా చూపుల్ని శివరాంవేపు తిప్పాడు.

"శివరాం కూచో. ఎవరికీ కష్టం కలగకుండా ఒక ఫిగర్ అనుకుందాం."

శివరాం నవ్వుతూ కూచున్నాడు. సిగరెట్ ముట్టించి చెప్పమన్నట్టు చూశాడు. రాజా మొహంమీది చెమటని అరచేత్తో రుద్దుకున్నాడు.

"ఆ మొత్తం నీకు సమర్పించాలంటే నేను ఏ బ్యాంకునో దోచుకోవాలి...."

"అయితే, సాయంత్రం కల్సుకుందాం. ఆలోగా నువ్వు రెండు మూడు బ్యాంకుల్ని దోచుకోవచ్చు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"డోంట్ జోక్!" రాజా ఉరిమాడు.

"షటప్!" శివరాం హుంకరించాడు. "ఇప్పటికే చాలామందిద్వారా వాళ్ళ ఖాతాల్లోని పైకాన్ని, ఎన్నో బ్యాంకులనుండీ వాళ్ళద్వారానే దోచుకున్నావ్. నీ బుర్ర సహాయంతో, వాళ్ళ సేవింగ్స్ సహాయంతో ఎంతో మంది డిగ్రీలూ, కొసరు డిగ్రీలూ సంపాయించి ఇంక్రి

మెంట్ల రూపంలో, ప్రమోషన్ల రూపంలో అమాయక ప్రజల సంపదని దోచుకుంటున్నారు. మరోవైపు కొంత మంది నకిలీ వైద్యులు అమాయకుల పైకాన్నీ, ప్రాణాల్నీ అపహరిస్తున్నారు. మరోవైపు నీ ద్వారా వెటిరినరీ డాక్టరైన—స్వార్థ రాక్షసులు నోరులేని పశువుల్ని నిర్దాక్షిణ్యంగా వైద్యం పేరుతో బలి చేస్తున్నారు. ఎంతో మందికి, ఎంతో దుర్మార్గంతో దుర్మార్గపు చదువులు చెప్పించావ్. దానికి పరిహారంగా నాకు చదివింపులు చేస్తావ్."

రాజా చెయ్యెత్తి శివరాంని వారించాడు "శివరాం, ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యావిధానం, పరీక్షల పద్ధతి నీకు తెలీదు. నా పద్ధతికన్నా మెరుగ్గా అవి లేవు! అయినా దాన్ని గురించి ఇప్పుడు చర్చ అవసరంలేదు. డబ్బు తీసుకున్నా కూడా నేను లోకానికి మేలు చేశాను .."

"కలవరింతలు మానెయ్. లోకాన్ని దోచుకునే ప్రతీవాడూ తను లోకానికి మేలు చేశాననే వాగుతాడు. అన్నట్టు మరిచాను. నువ్వు సాగరిక, గిరికలనుండీ లక్షా నలభై వేలు వసూలు చేశావు. వందకి నెలకి అయిదు రూపాయల వడ్డీతో వాళ్ళిద్దరూ అప్పు సంపాయించి నీకు చెల్లించారు. ఆ రేటున ఈ అర్నెల్లకీ దాదాపు యాభై వేలు వడ్డీ ఇచ్చుకున్నారు. అంటే ఆ అసలూ, వడ్డీ కలిపి రెండు లక్షలు నువ్వు పే చేయాలి. మొత్తంలో అది చేర్చడం మరిచిపోయాను."

"ఇది ఘోరం! నా భయాన్ని అసరాగా తీసుకుని నువ్వు ఆకాశానికి నిచ్చెన వేస్తున్నావ్. నేను అర్జించాను; ఖర్చు చేశాను. బ్యాంక్ ఖాతాల్లో చూసుకో. నా ఆదాయంలోని నిలవ నీ మొత్తానికి అమడలదూరంలో

వుంది. ఎలాగో అయిదు లక్షలు ఇచ్చేస్తాను. ఆ ఫైల్సూ నగ్రా నాకు సరెండర్ చేసెయ్. నన్ను మరిచిపో!" రాజా చకచకా అన్నాడు.

శివరాం జోక్ విన్నవాడిలా పకపక నవ్వాడు. "నీ బ్యాంక్ అకౌంట్స్ వివరాలు ఈ అరచేతిలో వున్నాయ్! అక్రమంగా సంపాయించిన పెద్ద మొత్తాల్ని యెవడూ ఈ దేశంలో బ్యాంకుల్లో దాచుకోడు. 'స్విస్ బ్యాంకుల్లో' దాచుకుంటాడు."

"నాన్ సెన్స్! నాకు స్విస్ బ్యాంక్‌లో ఖాతా వుందంటావా కొంపదీసి?" రాజా అరిచాడు.

"నీలాంటి ప్రతివాడూ ఇండియాలోనే, ఇంట్లోనే ఒక స్విస్ బ్యాంక్ యేర్పాటు చేసుకుంటాడు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"వాట్ నాన్...."

"డోంట్ బార్క్! పూజ గదుల్లో విగ్రహాలకింద నేలలో నిర్మించిన అరల్లోంచో, బీరువాల్లోంచో, మారెక్కడనుంచో విత్ డ్రా చేసి పట్రా. డెబ్భైఅయిదు ప్లస్ రెండూ... డెబ్భైయేడు.... దాన్ని ఎనభై! రౌండప్ చెయ్...."

"నో!" రాజా రాణీ యుగళగీతంలా ఒకేసారి అరిచారు.

"ఇంకోసారి 'నో' అనడానికి నోరు తెరిస్తే నేను వెళ్ళిపోతాను. తరవాత, నాకోసం కాఫీలో కలిపిన కాలకూటాన్ని ఇద్దరూ తాగేస్తారు!"

రాజా మెల్లిగా రెప్పలు వాల్చి తనముందున్న, చల్లారి పోయిన కాఫీని కంగారుగా చూశాడు. అతని బట్టతల మీదా, మొహంమీదా చెమట పూసలుగా కమ్ముకుంది.

రాణీ ఆదరాబాదరా కదిలి అతనిముందున్న కాఫీకప్పుని అందుకుని దూరంగా జరిగింది.

శివరాం పకపక నవ్వాడు. రాజా తల స్లోమోషన్‌లో శివరాంవైపు పైకి లేచింది. అదురుతున్న పెదవుల్ని నాలుకతో తడిపి అతను ఒకసారి నిట్టూర్చాడు.

“శివరాం....ఇచ్చాక నాకు సంబంధించిన కాగితాలన్నీ....నాకు....ఇచ్చేస్తావా?” రాజా ఏడుపుగొంతుతో అడిగాడు.

శివరాం చిరునవ్వుతో బుర్ర ఆడించాడు.

“శివరాం....నన్ను బజారుపాలు చేస్తున్నావ్.... అవన్నీ నాకు ఇచ్చేయ్. ఈసారి సక్రమంగా అఫిలియేషన్ సంపాయించి, నా వ్యాపారం చేసుకుంటాను.... ఇచ్చేస్తావా?”

దీనంగా అడుగుతున్న రాజాని శివరాం చిరునవ్వుతో చూశాడు. “తప్పకుండా. నీకు ఇవ్వాల్సినవన్నీ పూర్తిగా ఇచ్చేస్తాను. ఇన్నాళ్ళూ డబ్బు గుంజి సర్టిఫికెట్లు అమ్మినట్టు, ఇప్పుడు డబ్బు కక్కి నా దగ్గరున్న సర్టిఫికెట్లు కొనుక్కుంటున్నావుగా!”

రాజా చప్పుడుచేస్తూ నిట్టూర్చాడు. అతని తల రాణీ వైపు తిరిగింది. భేరం, ఊహించనివిధంగా, మొండిగా పూర్తయ్యి.. రాణీని రాయిలా మార్చినట్టుంది. ఆమె శరీరం పూర్తిగా చెమటతో తడిసి ముద్ద అయిపోయింది. నైటీ మూడొంతులదాకా చెమటలో కరిగి, ఆమె శరీరానికి అతుక్కుపోయి, అదృశ్యం అయిపోయింది. తను దాదాపుగా నగ్నస్థితిలో వుందన్న విషయాన్ని గ్రహించే స్థితిలో ఆమె లేదు!

"డి....యు....ర్...."

"డార్లింగ్....ఇక్కడే అతన్తో కూడా.... నేను.... నేను... తెస్తాను...." రాణి బరువుగా వెనక్కి తిరిగింది. బరువుగా కదిలింది.

రాజా శివరాంవైపు దెయ్యంపట్టిన వాడిలా చూశాడు. అతని కళ్ళు మెరుపు కోల్పోయిన అద్దంబిళ్ళల్లా వున్నాయ్.

"అవన్నీ....ఎప్పుడు....ఎక్కడ ఇస్తావ్?" బొంగురుగా అడిగాడతను.

"ఇక్కడే. ఎలాగా కొంతకాలంపాటు అడుగుకదిపే స్థితిలో నువ్వు వుండవు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

రాజా రెప్పవేయకుండా చూశాడు. "శివరామ్.... నన్ను నిలువుదోపిడి చేశాక మాట నిలుపుకో. మాట తప్పితే నీకోసం వెతుకుతాను. ఈ గోళ్ళతో నీ గుండెని పెళ్ళగించేస్తాను!"

శివరాం పకపక నవ్వుతూ వెనక్కివాలి సిగరెట్ వెలిగించాడు.

# 6

చప్పుడు చేయకుండా తాళంతీసి గదిలోకి ప్రవేశించిన శివరాం, తలుపుని మూసి, జాగ్రత్తగా తాళం వేశాడు. బూట్లూ, సాక్సూ తీసేసి, చప్పుడుకాకుండా మంచం దగ్గరగా నడిచాడు. సూట్‌కేస్‌ని మంచం కిందికి తోసి, నెమ్మదిగా మంచంమీద కూచున్నాడు. ఫోమ్‌బెడ్ సున్నితంగా కదిలింది. చిన్నచిన్న అలలమీద వెల్లకిలా శయనించిన సాగరకన్యలా, మంచంమీద పడుకున్న లత శరీరం అలలాగా మనోహరంగా కదిలింది. పింక్‌కలర్ నైటీ ఆమె సౌందర్యాన్ని ఎత్తి చూపు

తోంది. శివరాం ముఖంమీద చిరునవ్వు మెరిసింది.

లత తల తలగడ మధ్యలో కూరుకుపోయింది. బాబ్డ్ హెయిర్ విశాలంగా ఆమె ముఖంచుట్టూ చందమామను బంధించడానికి రాహువు విసిరిన వలలా పరుచుకుంది. అలసట తర్వాత నిద్ర ఆమె అందాన్ని వెయ్యింతలు చేస్తోంది. వొంపులు తిరిగిన కనుబొమలు, మూసుకున్న రెప్పలకిందినుంచీ ఎత్తుగా, విశాలంగా ఉబ్బిన కళ్ళు పొడుగాటి ముక్కు కింద నిద్రలోకూడా నవ్వుకుంటున్న పగడాల పెదవులు, చిన్న గడ్డం.

శివరాం చూపులు అప్రయత్నంగా కిందికి జరిగాయి. పింక్ నైటీలోంచీ ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు సమ్మోహనకరంగా అవుపిస్తున్నాయి. నైటీని సున్నితంగా పైకి నెట్టుతూ, ఆమె సౌందర్య కలశాలమీద అలంకరించిన గులాబిమొగ్గల కిరీటాలు లీలగా అవుపిస్తున్నాయ్. కుప్ప పోసిన ఆ సౌందర్యాన్ని అలా వదిలేసి, డబ్బుకోసం రాజారాణీ ఖజానాకు వెళ్ళాల్సివచ్చినందుకు విచారిస్తూ శివరాం ముందుకి వంగాడు.

నిద్రలో కూరుకుపోయిన లత మెల్లిగా పక్కకి తిరిగింది. నవ్వుకుంటూ శివరాం పెదవుల్ని ఆమె చెవిమీద ఆన్చాడు. అతని ముద్దు ప్రేమతో చిన్నగా చప్పుడు చేసింది. వాత్స్యాయనుడు కూడా గుర్తించలేకపోయిన మనోహరమైన శబ్దం ఆమె పెదాలమధ్యనుంచీ ఇవతలకి వస్తూ అతనికి చక్కిలిగింతలు పెట్టింది.

లత యెడమచెయ్యి తీగలా అతని మెడని చుట్టుకుంది. కళ్ళు మూసుకునే లత వెల్లకిలా తిరిగింది. కళ్ళు మూసుకునే ఎర్రటి పెదవులతో చిరునవ్వు నవ్వింది. శివరాం ఆవేశంతో తన పెదాల్ని ఆమె యెడమకంటిమీద

అద్దాడు.

"డా ...ర్లింగ్ ...." లత కంఠం రెండోసారి వాత్స్యాయనుణ్ని వెక్కిరించింది.

శివరాం మాట్లాడకుండా తన బుగ్గని గులాబీ పెదవుల మీద అదిమాడు. లత రెండో చెయ్యి అతని మెడ చుట్టూ గొలుసుని పూర్తి చేసింది. గొలుసు మెల్లిగా కదిలింది. లత తటాలున కళ్ళు తెరిచింది. అతని శరీరాన్ని తననుండీ గోడలా దూరంచేస్తున్న సూటుని ఆశ్చర్యంతో చూసింది.

"డార్లింగ్ ....అప్పుడే....ఎక్కడికెళ్తున్నావ్?"

శివరాం చిన్నగా నవ్వాడు. "ఎక్కణ్నుంచో తిరిగొస్తున్నా!"

లత కనురెప్పలు విసనకర్రలా కదుల్తూ ఆమె ఆశ్చర్యాన్ని అందంగా వ్యక్తం చేశాయి. "తెల్లారకముందే ఎక్కడికెళ్ళావ్?"

"రాజా రాణీలకి సుప్రభాతం పాడి, వాళ్ళ బతుకుల్ని తెల్లారించడానికి!"

లత కనుబొమలు కొత్తరకం ప్రశ్నార్థకంగా మారాయి. ఆమె పెదవులు కొద్దిగా విచ్చుకున్నాయి. "రాజారాణీ....విద్యా ఇంటర్నేషనల్ ....కదూ....? ఏం జరిగింది?"

"ఏది జరగాలో అదే!" శివరాం పైకిలేస్తూ అన్నాడు. అతనితోబాటు, స్తంభాన్ని అల్లుకున్న తీగలా లత శరీరం పైకిలేచింది ఆశ్చర్యంతో అతని మొహంలోకి చూసిందామె.

"అయితే...."

"హనీ, నన్ను వదిలేయ్. మంచంమీద అడ్డంగా

బోర్లా పడుకో. తల కిందికి వాల్చు. మంచం కిందికి చూడు. రాజాగారి ఖజానా నీ కళ్ళకి విందుచేస్తుంది!" శివరాం నవ్వుతూ అన్నాడు.

అతన్ని వదిలేసి లత ఆదరాబాదరా మంచంమీద బోర్లా పడుకుని, ముందుకి నాగకన్యలా కదిలింది. ఆమె తల కిందికి వాలింది. బాబ్డ్ హెయిర్ అనార్కలి ముసుగులా కిందికి జారింది.

"ఓహ్!" లత కంఠంలో ఆశాభోస్లే పలికింది.

మెల్లిగా వెల్లకిలా తిరిగి మంచం అంచునుంచీ కిందికి వాలిన తలని కొద్దిగా పైకెత్తి ఆవేశంతో శివరాం మొహంలోకి చూసిందామె. గాలికి కదులుతున్న తీగలా ఆమె శరీరం వంపులు తిరుగుతూ కదిలింది. తల మంచం మీదికి చేరింది.

"డార్లింగ్ ....కథ...."

శివరాం కోటుతీసి కుర్చీమీదికి గిరాటేశాడు. "హనీ, రాణీ కాఫీలో కాలకూటం కలిపింది. తల దిమ్ముగా వుంది."

"వాట్! తాగేశావా?" మోచేతులమీద పైకిలేచే ప్రయత్నంచేస్తూ అరిచింది లత.

ఆమె గుండ్రటి భుజాలమీద రెండు చేతుల్నీ వేస్తూ శివరాం ఆమెని మంచంమీదికే అదిమాడు.

"రాజాచేతే తాగించినంత పనిచేశాను!"

"మరి....తల దిమ్ము....?"

"తాగని కాఫీ తలదిమ్ము తెచ్చిపెట్టింది!" శివరాం నవ్వుతూ పైకిలేచాడు. గోడవారగా వున్న టేబుల్ వేపు నడిచాడు. ఫ్లాస్కులోని కాఫీని రెండు కప్పుల్లో పోశాడు. నవ్వు మొహంతో లతవైపు తిరిగాడు. లత

ఇప్పుడు వెల్లకిలా లేదు. బోర్లా తిరిగిన ఆమె పాదాలు మెరుస్తూ సీలింగ్‌ని చూస్తున్నాయి. గులాబిరంగు పిక్కలు నగ్నంగా మెరుస్తున్నాయి. మోచేతుల్ని బెడ్ మీద ఆనుకుని, రెండు అరచేతుల్తో తయారుచేసిన ఎల్లెసీ సింబల్ మధ్య ముఖాన్ని ధరించి అతనివైపు చూస్తోందామె.

గాలి తాకిడికి సున్నితంగా చెదిరిపోయి ఎత్తుపల్లాలుగా తయారైన ఇసుక ప్రదేశంలా అందంగా ఆమె వెనక భాగం అవుపిస్తోంది. నైటీలు తయారుచేసే కంపెనీవాడు ఈ క్షణంలో అతని చూసే ఫోజుకి పాతిక వేలు చొప్పున చెల్లించి వేలకొద్దీ ఫోటోలు తీసుకుంటాడనిపించింది శివరాంకి.

దగ్గరగా నడిచి కప్పుని ఆమెవైపు చాచాడు శివరాం. ఎడంచేత్తో అందుకుని ఆత అతన్ని నవ్వుతూ చూసింది. "డార్లింగ్ కథ సంజాయం టే కాఫీ కమ్మగా వుంటుంది!"

పకపక నవ్వుతూ శివరాం ఆమె ఎదురుగా సోఫాలో కూచున్నాడు. ఒకసారి కాఫీ చప్పరించి, చెప్పడం ప్రారంభించాడు.

• • •

"ఎనభై అడుగులు! ఇరవై అంతారాలు తక్కువగా కోటి! డార్లింగ్....రాజారాణి బతికే వున్నారా?" అత ఆశ్చర్యంతో అరిచింది.

"మనుషులు అల్పజీవులు. మన రాజారాణి దురాశా జీవులు! విద్యా ఇంటర్నేషనల్‌ని మాతినోత్సాహంలో కంటిన్యూ చేసి, ఇండియాలో చదువులేని వాళ్ళనందర్నీ ఒక్క దెబ్బతో మటుమాయం చేసేసే ఆలోచనలో

బతుకుతూనే వుంటారు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"అయితే వాళ్ళకి కొత్త లైసెన్స ఇచ్చావా?"

శివరాం నవ్వుతూ సిగరెట్ వెలిగించాడు. "ఇచ్చానని రాజాగాడనుకున్నాడు. చదివింపులయ్యాక. ఎక్కడెక్కడికో ఎగిరిపోడానికి సిద్ధంగా వున్నాయంటూ బెదిరిస్తూ చెప్పిన ఎవిడెన్స్ కాపీలన్నీ అతని టేబుల్ మీదే నేను వదిలేసిన బ్రీఫ్‌కేసులో పూర్తిగా వున్నాయని చివరిక్షణంలో తెలియజేసి, వచ్చేశాను."

"అయితే."

"అయితే, ఇంకా చాలా కాపీలు రాష్ట్ర విద్యాశాఖ మంత్రికీ, కేంద్ర మంత్రికి, ఎమ్.ఆర్.టి.పి.సి అధికార్లకీ, సి.బి.ఐకీ. మెడికల్ అండ్ హెల్త్ అపార్టుమెంట్‌కీ, ఆరోగ్యశాఖ అమాత్యులుగారికీ, రాష్ట్రంలో, కేంద్రంలో వున్న ప్రతిపక్షాల నాయకులకీ, రాజాగాడి నకిలీ సర్టిఫికెట్ల ఆధారంతో ఉద్యోగాల్లో చేరిపోయిన వ్యక్తుల పై అధికార్లకీ, ఇంక్రిమెంట్లూ, ప్రమోషన్‌లూ కొట్టేసిన ఉద్యోగుల పై అధికార్లకీ, ఉద్యోగుల సంఘాలకీ, ముఖ్యంగా రాష్ట్రంలో, కేంద్రంలో ప్రభుత్వాల మీద శీతకన్ను వేసిన పత్రికలకీ నిన్న సాయంత్రమే పోస్టు చేసేశాను!"

"డార్లింగ్! ఈజిట్? నిజంగా!...." లత అరిచింది.

"విద్యా ఇంటర్నేషనల్ ద్వారా డాక్టరేట్లూ, డిగ్రీలూ సంపాయించుకున్న మంత్రులమీద ఒట్టు!"

"మొగాడ్! డార్లింగ్ ...."

"ఇంకా....అమెరికాలోని ఏయే యూనివర్సిటీల పేర్లతో రాజాగారు ఫేక్‌డిగ్రీస్ తయారుచేశాడో అ

వర్సిటీలకీ, అమెరికన్ ఎంబసీకీ. అమెరికాలోని భారత రాయబార కార్యాలయానికీ....హానీ....నోరు నొప్పెడుతోంది! ఇంకా ఎవరెవరికి పంపాలో ఊహించుకో. వాళ్ళందరికీ పంపానని అర్థం చేసుకో!"

"డార్లింగ్?"

"యస్?"

"కొంప అంటుకోవూ?"

"కొంపలు కావు; దేశాలు!"

"ఫరవా లేదంటావా?"

"ఎవరికి?"

"మనకా, గురు; పాపం ...గుడ్డిగా డిగ్రీలు తీసుకుని, ఉద్యోగాల్లో చేరిపోయిన బలిపశువులు మళ్ళీ వీథుల్లోకి వచ్చేస్తారుగా...." అత సానుభూతి శివరాంకి నవ్వు తెప్పించింది.

"తిండీ గుడ్డా వగయిరా అవసరాలు డబ్బుతో కొనుక్కోవచ్చు. కానీ చదువుని, జ్ఞానాన్ని డబ్బుతో కొనడం దేశానికి ప్రమాదం! చేత్తో నోటికి అందిస్తూ తిన కుండా నువ్వు యెలా కడుపు నింపుకోలేవో, చదవ కుండా, నిగ్గు తేలకుండా నువ్వు డిగ్రీలూ, డాక్టరేట్లూ—రేట్లు చెల్లించి—సంపాయించుకోలేవు! సంపాయించుకో కూడదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"రాజాగాడి దగ్గర డిగ్రీలు సంపాయించుకున్న వాళ్ళలో వాడి మోసం తెలీని అమాయకులూ వుంటారుగా?"

"తప్పకుండా! అయితే రెండేళ్ళ కోర్సుని రెండు నెలల్లో పూర్తి చేయించే గాడి ఫిలాసఫీ విన్నాక వాళ్ళు నిజాయితీగా వెనక్కి వెళ్ళి, ప్రభుత్వానికి తెలియజేయా

ల్సింది! అలా చేయలేదుగా! అంచేత వాళ్ళకి శిక్ష తప్పదు!"

లత సాలోచనగా లేచి కూచుంది. "డార్లింగ్ ...."

"వాట్!" సిగరెట్ పీకని గదిమూలకి రువ్వుతూ అన్నాడు శివరాం.

"చదివింపుల కేసు అయిపోయిందిగా........తరువాత...."

"తరవాత....వాతావరణం దారుణంగా వుంది. చల్లగా డాల్ లేక్‌లో బోట్ షికారులో...."

"ఓహ్! యూ మీన్....కాశ్మీర్?" లత కిందికి గొంతుతూ అంది.

"హనీ, యేది యే ప్రాంతంలో వుందో నీకు బాగా తెలుసే!" శివరాం నవ్వుతో అన్నాడు.

"డార్లింగ్....నేను డబ్బిచ్చి కాదు...డబ్బు—స్కాలర్‌షిప్స్—తీసుకుంటూ కాలేజీకి వెళ్ళి, పరీక్షలు రాసి, మరీ డిగ్రీ సంపాయించాను....!" లత నవ్వుతూ అంది.

శివరాం నవ్వుతూ మరో సిగరెట్ వెలిగించాడు.

"డార్లింగ్....ఖర్చెంత?" లత అతని ముందు ఆగి ప్రశ్నించింది.

"ఇద్దరం అమెరికా వెళ్ళాం. అక్కడ ఖర్చెంతో నీకు తెలుసు. అక్కడ ఈ కేసు గురించి నేను యేదో చేశానని నీకు తెలీదు. బ్రాంటన్, న్యూయార్క్, న్యూపోర్టు. ప్రిన్స్టన్ విశ్వవిద్యాలయాల్నీ, అమెరికన్ కౌన్సిల్ ఆన్ ఎడ్యుకేషన్ కార్యాలయాలన్నీ సందర్శించాను...."

"ఈజిట్?"

"యూ బెట్! వాళ్ళందరికీ ఎం.ఆర్.టి.పి.సి. ఉన్నతాధికారిగా దర్శనం ఇచ్చాను. మనకి అవసరమైన ఇన్ఫర్మేషన్ సంపాయించాను...."

"డార్లింగ్ ...యూ ఆర్ ...."

"పూర్తిగా విను! అమెరికా యాత్రా వగైరాల కింద బోల్డండ ఖర్చయ్యింది. రెండు ఎం.బి.బి.యస్. డిగ్రీల విలువ రూపంలో దాన్నంతా మొత్తంలో కలిపే రాజా దగ్గర గుంజాను!"

లత ఒక్క ఉదుటతో అతని మోకాళ్ళమీద కూచుంది. రెండు చేతుల్నీ అతని మెడచుట్టూ వేసింది. శివరాం చేతిలోని సిగరెట్ కిందికి జారింది. లతని తన దగ్గరగా పట్టుకుని నవ్వుతూ చూశాడు.

"డార్లింగ్ ....అందరికీ పంపించావు. ఆ ఎవిడెన్స్ కాపీని డిటెక్టివ్ టెంపోకి పోస్టుచేస్తే ఫోన్ గొడవ వుండేది కాదుగా?"

శివరాం ఆమెని మెప్పుగా చూశాడు. "హనీ, నీది చురుకైన బుర్ర. సమయానికి గుర్తుచేశావ్. పోస్టు చేశాను. అయితే, ఫోనూ చేయాలి. పోస్టు చేసింది నేనే అని అతనికి...."

లత బుగ్గ అద్దంలా అతని పెదాల్ని నొక్కేసింది. శివరాం మెల్లిగా పైకి లేచాడు. అతన్ని పెనవేసుకున్న లత అతన్తోబాటే కదుల్తూ మంచంవైపు అతన్ని వెనక్కి నడిపించింది. తటాలున లత కాలు అతని ఎడమ కాలు వెనకభాగంలో అడ్డు తగిలింది. శివరాం మంచంమీద వెల్లకిలా పడ్డాడు. అతనిమీద పెద్దసైజు గులాబీదండలా వోల్లాపడిన లత ఉద్రేకంతో కదిలింది.

"హనీ...."

# 107

అత పెదవులు ఎర్రగా, సున్నితంగా, బలంగా శివరాం నోటిని నొక్కేశాయి. శివరాం చేతులు వాంఛా పాశాలుగా అత లేత శరీరాన్ని అల్లేశాయి. అత చెయ్యి తగిలి టీపాయ్‌మీదున్న అలారం టైంపీస్ కిందపడి పగిలింది. ఆ గదిలో కాలం స్తంభించింది.

— అయిపోయింది —

# అంతిమ శ్వాస

కె. వి. యస్. యన్. మూర్తి

పందొమ్మిదివందల డెబ్బయ్ ఒకటి, జనవరి పధ్నాలుగు—

రాత్రి పదకొండు కావటానికి యింకా పదినిమిషా లుంది—

ఢిల్లీ పట్టణం తీన్ మూర్తిభవన్ కు కొంచెం ఆవతలగా వున్న ఆరంతస్థుల భవనం ముందు తెల్లటి అంబాసిడ రొకటొచ్చి ఆగింది. అందులోంచి ఆరడుగుల ఆజాను బాహుడు క్రిందకు దిగాడు. హుందాగా అడుగులు వేస్తూ భవనం ముందుకు వచ్చాడు.

భవనం ముందున్న జవాన్ కు తన ఐడెంటిటీకార్డు తీసి చూపించాడు.

జవాన్ అతడికి వినయంగా సెల్యూట్ చేశాడు.

“అందరూ వచ్చారా?”

“వచ్చారు సాబ్ మీకోసమే చూస్తూన్నారు.”

వారి సంభాషణ అంతా కోడ్ భాషలో జరుగుతోంది.

"ఏదైనా సమాచారం లభించిందా?"

"లేదు సార్! కానీ ఏజెంటు సి(క్రీ మిమ్మల్ని కాంటాక్టు చెయ్యాలని మధ్యాహ్నం వచ్చాడు. అప్పుడు మీరు పి.ఎమ్ దగ్గర వున్నారు. మళ్ళీ అతడు రాలేదు" చెప్పాడు జవాను. అందరికీ మామూలు జవానుగా కనిపించే అతడు ఐ.బి. లో పెద్ద ఆఫీసర్. ఐ.బి. అంటే ఇంటెలిజెన్స్ బ్యూరో. అతడు ప్రస్తుతం మాట్లాడుతోన్న వ్యక్తి భూపాల్ ఛటర్జీ—రా—డైరెక్టర్. రీసెర్చి అండ్ అనాలిసిస్ వింగ్—రా—లో మామూలు ట్రయినీగా జాయిన్ అయిన భూపాల్, తెలివితేటలవల్లా స్వయంకృషివల్లా ఆ వింగ్ కే అధిపతి కాగలిగాడు.

"సరే! అతడొస్తే నన్ను కాంటాక్టు చెయ్యకుండా వెళ్ళొద్దను...." అంటూ లిఫ్టు దగ్గరకు వెళ్ళాడు భూపాల్.

మరో మూడు నిముషాలలో లిఫ్టు మూడో అంతస్తు ముందాగింది.

"ఏదో గవర్నమెంటు ఆఫీసులా కనిపించే ఆ భవనంలో వున్న ఈ మూడో అంతస్తు, ప్రపంచాన్నే గడగడలాడించే సామర్థ్యం వున్న రా కేంద్రస్థానం అని యే పదిమందికో మాత్రమే తెలుసు.

భూపాల్ హుందాగా అడుగులు వేస్తూ ముందుకు వెళ్ళాడు. ఒక గదిముందు గాడ్రేజ్ తలుపు వుంది. ఆ తలుపుదగ్గరున్న మనిషి భూపాల్ ను గుర్తుపట్టి శెల్యూట్ చేశాడు.

ఒక ప్లాస్టిక్ కార్డును అతడు భూపాల్ కు అందించాడు. దాని పైభాగంలో భూపాల్ కుడిచేతి చూపుడు వేలిముద్ర వుంది. భూపాల్ ఆ కార్డును అందుకొని కుడి

చేతి చూపుడు వేలితో మరో ముద్రను వేశాడు. గుమ్మం దగ్గర వున్న మనిషి ఆ కార్డును చిన్న మిషన్‌లో వుంచాడు. పచ్చదీపం వెలిగింది. అతడు తృప్తిగా తల వూపి, "ప్రొసీడ్ సర్" అన్నాడు—అతని పేరు రాజన్న.

భూపాల్ చిన్న గాజుబీరువాలో నిలబడ్డాడు.

రాజన్న భూపాల్‌కి సంబంధించిన కార్డును స్లిట్‌లో ఇన్‌సర్టు చేసి యేవేవో మీటలు నొక్కాడు.

హైట్, కాంప్లెక్స్, బ్లడ్ గ్రూప్, వాయిస్, ఐడెంటిటీ మార్కులు....ఒక్కటేమిటి, యిలాంటివి చాలా వాటిని ఆ మిషన్ పోలుస్తుంది. వాటిలో యేది మ్యాచ్ కాకపోయినా లోపలకు వెళ్ళిన వ్యక్తి నిమిషాలలో బంధింపబడతాడు.

అంత పకడ్బందీగా సాగుతుంది అక్కడి వ్యవహారం.

సంతృప్తికరమయిన సమాధానాలు రావటంతో రాజన్న గాజుబీరువా తలుపు తీశాడు.

లోపలకు వెళ్ళేవారిదగ్గర మారణాయుధాలు గానీ, మైక్రోమీటర్ వగైరాలు గానీ వున్నట్లయితే ఆ మిషను డిటెక్టు చేస్తుంది.

భూపాల్ రిజిష్టర్లో సంతకం చేశాడు.

మిషన్ సహాయంతో రాజన్న సంతకాన్ని టాలీ చేసి "కమాన్ సర్!" అంటూ గాడ్రేజ్ తలుపు ముందు నిలబడ్డాడు.

భూపాల్ అతని వెనకే వెళ్ళి తలుపుకు వున్న ఒక స్లిట్‌లో చిన్న మెటల్ కాయిన్ వేశాడు.

మరో స్లిట్ ఓపెన్ అయింది.

రాజన్న దాంట్లో తన దగ్గరున్న కాయిన్ వేశాడు.

తర్వాత రెండు స్లిట్లు ఓపెన్ అయ్యాయి. ఈసారి యిద్దరూ తమ దగ్గరవున్న రెండు కాయిన్సును వాటిల్లో వేశారు.

చిన్నగా శబ్దం చేస్తూ తలుపు తెరుచుకొంది.

అప్పుడు భూపాల్ యేవో నెంబరులు చెప్పి లోపలకు వెళ్ళాడు. గదిలోంచి బయటకు వచ్చేటప్పుడుకూడా అవే నెంబరులు చెప్పాలి. అప్పుడుగాని మొదటి తలుపు దాటి లోపలకు వెళ్ళలేరు.

లోపల మరో తలుపు వుంటుంది.

అక్కడ కూడా యింత తతంగం జరుగుతుంది.

ఆ సంస్థకు అధిపతి అయిన భూపాల్ కూడా అన్ని సెట్టులూ పూర్తిచేసుకుని లోపలకు వెళ్ళాల్సిందే.

అంత కట్టుదిట్టమయిన యేర్పాట్లు వున్న ఆ గదిలో జరిగిన సమావేశాల నిర్ణయాలు మాత్రం మామూలుగా లీకయి పోతోన్నాయి. అదే ప్రస్తుత సమస్య.

భూపాల్ లోపలకు వెళ్ళేటప్పటికి అక్కడ వున్న కుర్చీలలో నలుగురు ఆసీనులయి వున్నారు.

ఒకరు పేష్కార్—మిలటరీ యింటలిజెన్సు డైరెక్టర్.

దండావతే—ఎన్. ఎస్. టి. ఎల్. అధిపతి.

అబ్బాస్ అలీ—గవర్నమెంటు ప్రత్యేక సలహాదారు.

దేవుడమ్మ—ఇంటిలిజెన్సు బ్యూరో డైరక్టరు.

ఈ అయిదుగురు తలచుకొంటే యావద్భారత దేశాన్నీ మరుక్షణం తమ ఆధీనంలోనికి తెచ్చుకోగలరు. కాని వారయిదుగురు ఒకరిని మించిన దేశభక్తులు మరొకరు. దేశభక్తి అన్నది వారి నరనరాల్లోనూ జీర్ణించుకు పోయింది. దేశంకోసం ప్రాణాలు వదడానికయినా వెను

దీయని భరతమాత ముద్దుబిడ్డలు వారు. దేశాన్ని అనేక సార్లు విపత్కర పరిస్థితుల నుండి కాపాడారు. అందుకే ప్రస్తుత పరిస్థితి గురించి వారంతా తల్లడిల్లి పోతున్నారు.

వారిమీదున్న నమ్మకంకొద్దీ, ప్రధానీ—రాష్ట్రపతీ—ఆ అయిదుగురికీ సర్వాధికారాల్ని యిచ్చారు. చివరకు ఆ యిద్దరూ కూడా వారి చెప్పుచేతల్లో వుంటామన్నారు.

అందరిలోకి సీనియర్ అయిన భూపాల్, ప్రస్తుతం మిగిలినవారికి బాస్. అతడు చెపితే చాలు రాష్ట్రపతి నుండి మామూలు సర్పంచ్ వరకు తమ పదవుల నుండి స్వచ్ఛందంగా తప్పుకొంటారు. అంతటి అధికారం వుంది ప్రస్తుతం భూపాల్ దగ్గర.

“గుడ్ విషెస్ టు యూ మై ఫ్రెండ్స్” అంటూ కుర్చీలలో కూర్చొన్న నలుగురితోనూ కరచాలనం చేసి తన కుర్చీలో కూర్చొన్నాడు భూపాల్.

రెండు నిముషాలు మౌనం.

అయిదు గ్లాసులలో విస్కీ పోసి సోడా కలిపాడు భూపాల్.

“ఛీర్స్ ఫర్ ది ప్రోస్పరిటీ ఆఫ్ అవర్ కంట్రీ....” అంటూ గ్లాసులు ఎత్తారు.

ఆ గ్లాసుల్లో వున్నది మామూలు విస్కీ కాదు. దాంట్లో ‘ట్రూత్ టెల్లర్’ అనే రసాయనం కూడా వుంది. దానివలన మనసులోని మాటను నిర్భయంగా బయటకు చెప్పే విల్ పవర్ లభిస్తుంది.

భూపాల్ టయిం చూసుకొన్నాడు.

సరిగ్గా పదకొండు గంటలయింది.

“లెటజ్ స్టార్ట్!” అన్నాడు భూపాల్.

"నిన్న కేబినెట్ మీటింగులో తీసుకొన్న నిర్ణయాలు బయటకు వెళ్ళిపోయాయి. నిన్నరాత్రి పాకిస్తాన్ సైనికులు మన మిలటరీ రహస్య కేంపులమీద అటాక్ చేశారు. మనవాళ్ళు లొంగిపోయారు" అన్నాడు షేషాద్రి.

"కేబినెట్ మీటింగు రహస్యాలు బయటకు వెల్లడి అయిపోయాయా?" అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం.

"మీటింగ్ యిక్కడే జరిగింది కదా? బయటకు ఎలా వెళ్ళాయి?" అడిగాడు బలి.

భూపాల్ ముఖం ఎర్రబడి వుంది. "ఫ్రెండ్స్, ఆ విషయాన్ని చెప్పటానికే మిమ్మల్ని యిక్కడకు పిలిచింది" అన్నాడు.

అందరూ మౌనంగా చూస్తూ వుండిపోయారు.

"మనం ఎంత కట్టుదిట్టమయిన చర్యలను తీసుకొన్నా రహస్యాలు బయటకు పొక్కిపోయాయి. కారణం ఊహించారా?" అడిగాడు భూపాల్.

కారణం అందరికీ తెలుసు. కానీ యెవరూ పెదవి విప్పలేదు.

రహస్యాలు బయటకు పొక్కిపోవటంతో, వివిధ శాఖలను ముందు కంట్రోల్ చేశారు. మామూలు పద్ధతులలో కాకుండా, సైనిక రహస్యాలకు సంబంధించిన కాగితాలు నేరుగా ఆయా మినిష్టరీలకు పంపే యేర్పాట్లను చేశారు. అయినా రహస్యాలు వెల్లడయిపోయాయి. దాంతో క్రింది శాఖలమీద వున్న అనుమానం తొలగిపోయింది. తర్వాత వివిధ సెక్రటేరియట్లమీద నిఘా వుంచారు. నిఘా నిన్నా, మొన్నా బాగా అధికం చేశారు. అనుమా

నించాల్సిన మనుషు లెవరూ దొరకలేదు.

"అయితే, రహస్యాలన్నీ ఆదిలోనే వెల్లడయ్యేం డొచ్చు కదా?" అడిగాడు దేవుడమ్మ.

"ఒక్కొక్క స్టేజీలో ఒక్కో మార్పు చెందుతూ మినిష్టర్ దగ్గరకు వచ్చేటప్పటికి ఫైనల్ రూపాన్ని పొందుతుంది" చెప్పాడు భూపాల్.

దేవుడమ్మ మౌనంగా వుండిపోయాడు.

"పైగా వెల్లడయిన సమాచారం ఫైనల్ స్టేజ్ విష యాలే!"

"ప్రతీ స్టేజ్ లోనూ బయటకు సమాచారం లీకవుతోం దేమో?"

"ఇంపాసిబుల్, అప్పుడు కొన్ని వందలమందిని టాకిల్ చెయ్యాల్సి వస్తుంది. అందరూ కో ఆపరేట్ చేస్తేగాని ఫైనల్ సమాచారం బయటకు రాదు. కానీ అన్నివందలమందీ దేశద్రోహం చేస్తారని నేను అనుకోను. పైగా ఇక్కడ జరిగిన కాబినెట్ మీటింగ్ లో ప్రధాని కొన్ని సవరణలు చేశారు. ఆ సవరణలతో సహా విషయం లీకయిపోయింది. లీకయిన విషయాలన్నీ మనకూ తెలియవు. కానీ మీటింగుకు హాజరయిన ఆరుగురు కాబినెట్ మినిష్టర్లకూ ఆ విషయాలన్నీ తెలుసు."

"అయితే ఆ ఆరుగురిద్వారానే విషయాలన్నీ లీకయ్యా యంటారా?" తమకు తెలిసినా విషయాన్ని భూపాల్ ద్వారా వినాలనీ నలుగురూ ఒకేసారి ప్రశ్నించారు.

"విషయం మీకూ తెలుసు. అయినా మీ రడిగారు కాబట్టి నా అభిప్రాయాన్ని చెబుతాను వినండి. ఆ ఆరు గురిలో యెవరో ఒకరు విషయాలను లీక్ చేస్తున్నా రనటంలో అనుమానం లేదు. మరి అలా ఎందుకు చేస్తు

న్నారో తెలియటంలేదు. వారందరూ దేశభక్తులే. స్వాతంత్ర్య వుద్యమం నుండీ రాజకీయాల్లో వున్నవారే. ఎవర్నీ అనుమానించలేము. పైగా నేను ప్రతి మినిష్టర్ యింట్లోనూ వాళ్ళకు తెలియకుండా మైక్రోఫోనులు యేర్పాటు చేయించాను. కానీ ఫలితం లేకపోయింది."

"అయితే మీరు ఇటువంటి యేర్పాట్లు చేశారని వాళ్ళు గ్రహించి వుంటారా?"

"వాళ్ళు కాదు. అతడు గ్రహించాడు. ఫోనులోనో, తన ఇంటిలోనో కాకుండా, యే పబ్లిక్ పార్కులోనో ఆరుబయట స్థలంలోనో మాట్లాడుతోన్నా డనుకో వచ్చు."

"అయితే యిప్పుడు మన కర్తవ్యం?"

"ఏముంది. వాళ్ళమీద నిఘా అధికం చెయ్యటమే!...."

"ప్రధానితో ఒక్కసారి చెపితే?"

"నో! ఆయన దీనికి అంగీకరించరు. మన సొంత రిస్కు మీద నిర్ణయం తీసుకోవాలి. మీ వుద్దేశ్యం చెప్పండి" అన్నాడు భూపాల్.

"మీకేది మంచనిపిస్తే అదే చెయ్యండి" అన్నారు నలుగురూ ఒకేసారి.

భూపాల్ చూపులో కృతజ్ఞత నిండిపోయింది. "థాంక్యూ! నామీద మీ కున్న నమ్మకానికి ధన్యవాదాలు" అంటూ కుర్చీలోంచి లేచాడు.

అప్పుడు సమయం పన్నెండు దాటి ఇరవై నిముషాలయింది.

"గుడ్ నైట్!"

"గుడ్ నైట్!"

ఆ అయిదుగురు ఒకరి తర్వాత ఒకరు బయటకు వచ్చే శారు.

## 2

జయంతి అతడిని నిర్లక్ష్యంగా చూసింది.

అర్ముగానికి ఒళ్ళు మండిపోయింది. పళ్ళు పటపట నూరాడు. "అయితే ఇవ్వవా?" అన్నాడు.

"నా ప్రాణంతీసినా సరే ఇవ్వను" జయంతి తెగేసి చెప్పింది.

"ఎలాగివ్వవో చూస్తాను" అంటూ అర్ముగం జయంతి వయిపు అడుగులు వేశాడు.

జయంతి బెదిరిపోయింది. ఆ బెదురు బయట కనబడ నీయకుండా "నా వంటిమీద చెయ్యిపడితే మర్యాద దక్కదు" అంది బింకంగా.

అర్ముగం యేమనుకొన్నాడో యేమో ఒక్కసారిగా ఆగాడు. "జయా! ఎందుకు నన్ను విసిగిస్తావు? ఆ మంగళ సూత్రం యిలా యిచ్చి ఈ పసుపుతాడు కట్టుకో! ఎందుకు వళ్ళు హూనం చేసుకొంటావు?" అన్నాడు అర్ముగం.

మామూలు సమయాలలో జయంతి అతని మాట వినే దేమో గాని ఇప్పుడు మాత్రం వినకూడదనే నిశ్చయించు కొంది. "ఎందుకు ఆ ముండ కివ్వటానికేనా?" అంది.

ఈసారి అర్ముగం వూరుకోలేదు, రెండంగల్లో ఆమెను చేరుకుని జుట్టు దొరకబుచ్చుకున్నాడు. నేలమీదకు వంచి, ఆమె వీపుమీద గుద్దటం ఆరంభించాడు. ఆ దెబ్బలకు ఎర్రటి ఆమె వళ్ళు మరీ ఎర్రగా అయిపోయింది. దెబ్బలు తగులుతోన్నకొద్దీ జయంతి రెచ్చిపోయింది. "నన్నుకొట్టి

ఏం బాపుకుంటావులే, నన్ను యింత బాధపట్టినందుకు నా వుసురు దానికి తగలకపోదు" అంటూ శాపనార్థాలు మొదలుపెట్టింది.

అర్ముగం విసిగిపోయాడు. ఆమెని వదలి బయటకు వచ్చాడు. అతడికి చాలా చిరాకుగా వుంది. "తాళికట్టక పోలేయిక తనతో స్నేహం చెయ్యనని తెగేసి చెప్పింది పంకజం. కనీసం బంగారపు తాళిబొట్టయినా లేకపోతే తన పరువేం కాను."

అర్ముగం అసహనంగా జేబులో చెయ్యిపెట్టాడు. ఐదు రూపాయలనోటూ చిల్లర తగిలాయి. మరో జేబులోంచి ఆఖరి బర్క్లీ ఫిల్టర్ సిగరెట్ తీసి వెలిగించాడు. గుండెల నిండా పొగతీసుకు వదిలాడు. నిస్పృహగా అరుగుమీద కూర్చున్నాడు.

"హలో! అర్ముగం! బావున్నావా?"

అపరిచితమయిన గొంతువిని అర్ముగం అటు చూశాడు. మల్లుపంచె, తెల్లచొక్కా, గాంధీటోపీ, చేతిలో ఖద్దరు సంచి—"ఇదివరలో మిమ్మల్ని యెక్కడా చూడలేదు" అన్నాడు అర్ముగం.

"నువ్వు నాకు తెలుసు, నా పేరు సుబ్బారావు" అన్నా డతడు.

అర్ముగం అతనివయిపు చిరాగ్గా చూశాడు.

సుబ్బారావు, అతడిప్రక్కగా కూర్చున్నాడు, జేబు లోంచి సిగరెట్ తీసి వెలిగించి అర్ముగానికి మరోటి అందించాడు.

అర్ముగం సిగిరెట్ అందుకొని వెలిగించాడు.

"నా కో చిన్న ఉపకారం చెయ్యాలి!" అన్నాడు సుబ్బారావు.

"ఏమిటది?"

సుబ్బారావు సంచిలో, చెయ్యిపెట్టి ఒక వందరూపాయల కట్టను బయటకు తీశాడు. అర్ముగానికి దాన్నందించి "ఇది అడ్వాన్సు మరో యింత పని పూర్తయ్యాక యిస్తాను" అన్నాడు.

అర్ముగం ఆ డబ్బును ఆశగా అందుకొన్నాడు. "ఏం చెయ్యాలి చెప్పండి" అన్నాడు.

"చిన్న దొంగతనం చెయ్యాలి."

అర్ముగం వులిక్కిపడ్డాడు. తను దొంగతనాలు చేస్తూ వుంటాడన్న విషయం తనకు తప్ప మరో కంటికి తెలియదు. అలాంటిది యితడు నేరుగా తన ఇంటికే వచ్చాడు. కంగారును కప్పిపెడుతో, "క్షమించాలి, నేను ఆటో డ్రయివర్ని, దొంగను కాదు" అంటూ డబ్బును తిరిగి యిచ్చెయ్యబోయాడు.

సుబ్బారావు చిన్నగా నవ్వాడు. "అర్ముగం! బుకాయించకు. ఇప్పుడు పంకజానికి తాళిబొట్టు కట్టడానికి ఎలాగూ దొంగతనానికి బయలుదేరుతావు. ఎందుకొచ్చిన శ్రమ. చిన్న దొంగతనం చేసిపెట్టు యిరవై వేలు సొంతం చేసుకో" అన్నాడు.

ఈసారి అర్ముగానికి గుటకపడలేదు, ఇక బుకాయించి లాభంలేదని "ఏం చెయ్యాలో చెప్పండి!" అన్నాడు.

"సుబ్బలక్ష్మి నగర్, నాలుగవ క్రాస్ రోడ్ మూడో యింట్లో దొంగతనం చెయ్యాలి."

"ఆ యిల్లు ఎవరిది?"

"శ్రీనివాసరావని, సెక్రటేరియట్లో పెద్ద ఉద్యోగంలో వున్నాడు."

"ఏం దొంగతనం చెయ్యాలి?" అర్ముగం అనుమా

నంగా అడిగాడు.

"అతని బెడ్ రూమ్‌లో, మంచానికి తలవైపున చిన్న టీపాయి వుంటుంది. దానిమీద శ్రీనివాసరావు పెళ్ళి ఫోటో వుంటుంది. ఆ ఫోటోను ఫ్రేమ్‌తోసహా తీసుక రావాలి" అంటూ సంచిలోంచి చిన్న ఫోటోతీసి అర్ముగానికి అందించాడు. "ఇటువంటి ఫోటోయే ఆ ఫ్రేములో వుంటుంది" అన్నాడు.

అర్ముగం ఒక్క క్షణం ఆశ్చర్యపోయాడు. "ఫోటో దొంగతనం చెయ్యటానికి యిరవై వేల రూపాయలా!" అనుకొని "ఫోటో మీ దగ్గర ఉందికదా యింక దొంగతనం దేనికి?" అన్నాడు.

"అదంతా నీకనవసరం. ఇప్పుడు టయిము ఆరయింది. శ్రీనివాసరావు ఫేమిలీతో కలసి ఫస్టుషో సినిమాకి వెళ్ళాడు. నువ్వు అర్జంటుగా బయలుదేరు. ఎనిమిది లోపున ఆ ఫోటో....ఫ్రేముతోసహా తీసుకరా. నేను నీకోసం గోకుల్ లాడ్జి రూమ్ నెంబరు 114లో చూస్తూ వుంటాను" అని చెప్పి సమాధానంకోసం చూడకుండా అక్కడనుండి వెళ్ళిపోయాడు సుబ్బారావు.

అతను వెళ్ళినవయిపే చూస్తూ వుండిపోయాడు అర్ముగం.

అతను కనుమరుగయ్యాక నెమ్మదిగా లేచాడు అర్ముగం. లోపలకు వెళ్ళాడు. "అలా బయటకు వెళుతోన్నాను. రావటం ఆలస్యం అవ్వొచ్చు" అని భార్యతో చెప్పి ఆటో ఎక్కాడు.

ఆటో సుబ్బలక్ష్మి నగర్ వయిపు పరుగుతీసింది.

అతని ఆటో అలా వెళ్ళిందో లేదో, నల్లని ఫోర్డు కారొకటి ఆ ఆటోను అనుసరించసాగింది.

# 3

"కమాన్ ఫ్రెండ్స్! లెటజ్ ఎంజాయ్!" కర్నల్ రామ్‌సింగ్ గ్లాసెత్తి "ఛీర్స్" చెప్పాడు.

గ్లాసులు చిన్నగా చప్పుడు చేశాయి.

దేశానికి వాయవ్య సరిహద్దులో వుంది రామ్‌సింగ్ బెటాలియన్. అటువంటి నాలుగు బెటాలియన్‌లకు బ్రిగేడియర్ పాటిల్ ఇన్‌ఛార్జ్. ఒక్కొక్క బెటాలియన్ ఒక్కొక్క కర్నల్ కంట్రోల్‌లో వుంది. పాకిస్తాన్ సేనలు బోర్డర్లలో మొహరించిన దృష్ట్యా సత్వర చర్యకోసం అలాంటి యేర్పాట్లు జరిగాయి.

ప్రస్తుతం రామ్‌సింగ్ కంట్రోల్‌లో వున్న బెటాలియన్‌లో మొత్తం నూటయాభైమంది వున్నారు. మనుష్య సంచారానికి దూరంగా కొండలతో నిండిపోయి వున్న ప్రాంతంలో వుంది రాంసింగ్ మిలటరీ క్యాంపు. వారానికొకసారి పారాచూట్లద్వారా ఆహారాన్ని అక్కడ దింపి పోతో వుంటాయి మిటలరీ విమానాలు. దేశంకోసం ప్రాణాలర్పించటానికి సిద్ధంగా ఉన్న ఆ జవానులకు ప్రాణభయం అసలేలేదు. ప్రమాదాలను యెదుర్కోవటానికి అలవాటుపడ్డవారు, దొరికిన కొంచెం సమయాన్ని సరదాగా గడిపేస్తూ ఉంటారు. కులమత వైషమ్యాలకు తావులేకుండా ఒకరితో ఒకరు కలిసిపోయి, మానసిక, శారీరక అలసటలను పోగొట్టుకోవటానికి ఆటపాటలతో కాలక్షేపం చేస్తూవుంటారు.

రాత్రి పదకొండు గంటలు దాటుతోంది.

చుట్టూ వున్న మంచు పర్వతాలనుండి చల్లని గాలులు వీచి తమ శీతల ప్రభావాన్ని చూపుతున్నాయి.

"కమాన్ ఫ్రెండ్స్! కమాన్! బ్రతికినంతకాలం

నవ్వుతో బ్రతుకుదాం. చివరకు పోయేటప్పుడు కూడా నవ్వుతోనే పోదాం కమాన్" అంటూ అందరి గ్లాసుల లోను బ్లాకనీర్ రమ్మును నింపుతున్నాడు రాంసింగ్.

కడుపులో పడుతున్న రమ్‌వల్ల అందరిలోనూ హుషారు పెరుగుతోంది. "ఆజ్ గాలో ముస్కురాలో.... మేరే భాయ్ జర్ దేఖో" వంటి పాటలతో ఆ ప్రాంతం అంతా మారుమ్రోగిపోతోంది.

ఆటపాటలలో మునిగివున్న వాళ్ళు తమపై విరుచుకు పడబోయే ప్రమాదం గురించి తెలుసుకోలేకపోయారు.

అందరిలోనూ వున్నది ఒకటే ధీమా!

అక్కడ మిలటరీ క్యాంపు వుండదు. అది దాదాపుగా నోమేన్సు లాండు. పాకిస్తానీయులకు అక్కడ ఒక క్యాంపు ఉన్నదని తెలియదు. కారణంఅక్కడ క్యాంపు పెట్టి పదిరోజాలు కూడా కాలేదు. మిలటరీ రికార్డులో కూడా అక్కడ సైనిక స్థానం ఉన్న ప్రస్తావనలేదు. తమకు సరాసరి డిఫెన్సు మినిష్టరునుండి ఆర్డర్లు వచ్చాయి. కాబట్టి ఎవరికీ ఆ విషయం తెలియదు.

ఆ ధీమాయే యిప్పుడు తమను పీకల మెుయ్యా ప్రమాదంలో ముంచబోతోందని వాళ్ళకు తెలియదు.

ఆ ధీమాయే లేకపోతే వాళ్ళు అప్రమత్తంగా వుండే వారు.

తమ క్యాంపు గురించిన సమాచారం శత్రువులకు పదిలంగా చేర్చబడిందనే విషయం వారికి తెలియదు. తెలిసే ఆ నిషా అంతా ఒక్కక్షణంలో దిగిపోయి ఉండేది.

బాటిల్లు ఖాళీ అవుతున్నాయి.

రాంసింగ్ అందరినీ బలవంత పెట్టిమరీ తాగిస్తున్నాడు.

"కమాన్ ఫ్రెండ్స్ లెటజ్ టేక్ ఫుడ్!" అన్నాడు రాంసింగ్.

పెద్ద పళ్ళెంనిండా పరోటాలు, పెద్ద పాత్రనిండా కుర్మా లోపలకు వచ్చాయి.

అందరూ ప్లేట్లు తీసుకొన్నారు.

ఒక సోల్జరు పళ్ళెంలో ప రో టా ల ను ఉంచ బోయాడు.

అంతలో బయట చిన్నగా చప్పుడయింది.

సోల్జర్లంతా అలర్టయ్యారు.

"కర్నల్ సాబ్!" నూతిలోంచి వచ్చినట్లుందా పిలుపు.

"కౌన్ హూ!"

"సాబ్! నేను యిక్కడకు కొంచెం దూరంలో వున్న చిన్న పల్లెలో ఉంటున్నాను" ఆ వ్యక్తి చెప్తున్నాడు.

ఇద్దరు జవానులు అతన్ని లోపలకు తీసుకువచ్చారు.

ఆ వ్యక్తిని చూసి రాంసింగ్ ఆశ్చర్యపోయాడు.

మనిషంతా ఎర్రగా రక్తంముద్దలా ఉన్నాడు. వంటి మీద ఉన్న గుడ్డలు చినిగిపోయి పీలికల్లా వ్రేలాడు తున్నాయి. మనిషి కొనప్రాణంతో ఉన్నాడు. ఎంతో సేపు బ్రతకడం కష్టం.

రాంసింగ్ అతని నోట్లో బలవంతంగా రమ్ముపోశాడు. అతడికి కొంచెం ఉపశమనం కలిగింది.

"సాబ్! మీరంతా యిక్కడనుండి పారిపోండి" పళ్ళబిగువున బాధ భరించి చెప్పాడతడు.

రా ం సి ం గ్ అలర్టయ్యాడు. తనవాళ్ళందరివయిపు చూశాడు. అతడి చూపును అర్థంచేసుకొని అందరూ సర్దుకోవటం మొదలుపెట్టారు.

"సాబ్! టయిము లేదు. మీరంతా పారిపోండి. మా పల్లెకు అవతల ఉన్న మిలటరీ క్యాంపులను పాకిస్తానీ జవాన్‌లు నాశనం చేశారు. మా పల్లెను సర్వనాశనం చేసి యిటు వస్తోన్నారు. మీకు సమా....చా....రం.... నే... ను " అతడు తలవాల్చేశాడు.

రాంసింగ్ కళ్ళు చెమర్చాయి. అతనికి ఒక్కసారి సెల్యూట్ చేశాడు. "మనం పారిపోయి ప్రయోజనం లేదు. మన దగ్గర ఉన్న అమ్యూనిషన్ అంతా తీసుకొని ఈ కొండల్లో దాక్కోండి. శత్రువులు యిక్కడకు రాగానే ఎటాక్ చెయ్యండి" అంటూ రైఫిల్సు తీసుకొని బయటకు వచ్చాడు రాంసింగ్.

వస్తూ వస్తూ లోపల ఉన్న కొన్ని స్విచస్ ఆన్ చేశాడు.

అదే రాంసింగ్‌లో ఉన్న గొప్పతనం.

తమ క్యాంపు ఎవరయినా ఎటాక్ చేస్తారన్న ఉద్దేశ్యంతో క్యాంపుచుట్టూ టైంబాంబులను అమర్చాడు. ఎటాక్ కష్టమయినపుడు బాంబ్సును ఏక్టివేట్ చేస్తే మొత్తం ఆ ప్రాంతమంతా పేలిపోతుంది. శత్రువులతో పాటు తాము నాశనం అయిపోతారు. అయినా కొందరిని చంపి చచ్చామనే తృప్తి మిగులుతుంది.

"గో ఎహే, ఎవరూ క్యాంపుకు దగ్గర్లో వుండొద్దు. రన్ అప్!" అంటూ పరుగులాంటి నడకతో తమవాళ్ళను అనుసరించాడు రాంసింగ్.

క్షణాలు గడుస్తోన్నాయి.

రాంసింగ్ బెటాలియన్ అంతా క్యాంపుకు రెండు ఫర్లాంగుల దూరంలో వున్న కొండమీద ఉంది. అందరి చేతులలోనూ మిషన్‌గన్సు గర్జించటానికి తయారుగా

ఊన్నాయి.

ఒకటి...రెండు....మూడునిముషాలు దొర్లుతున్నాయి.

తాను క్యాంపుసు వదిలి అప్పుడే యిరవైనిముషాలు దాటింది. రైట్ బాంబ్సు అరగంటలో ఏక్టివేట్ అయ్యేలా అరేంజ్ చేశాడు.

రాంసింగ్ టయిమ్ చూసుకొన్నాడు. రైమ్ పన్నెండు దాటి పదినిముషాలయింది.

ఎప్పుడు లేనిది టెక్షన్ ఫీల్ అవుతున్నాడతడు. "తను అనవసరంగా బాంబ్సును ఏక్టివేట్ చేస్తోన్నానేమో. అసలు అతడు తెచ్చిన సమాచారం తప్పేమో! చేజేతులా తన ప్రాణాన్ని బూడిద చేసుకొంటున్నా నేమో" రాంసింగ్ మానసిక పరిస్థితిని వివరించటం కష్టం.

టయిము పన్నెండు దాటి పదిహేడు నిముషాలయింది.

రాంసింగ్ గుండె దడ హెచ్చింది.

పందొమ్మిది నిముషాలయింది.

ఇంక అరవై సెకనులు మాత్రమే టయిముంది, ఆ ప్రాంతం అంతా భస్మీపటలం అయిపోటానికి.

అయిదు సెకనులు గడిచింది.

రాంసింగ్ కళ్ళు మూసుకున్నాడు.

వెనుకనున్న సైనికులలో కలకలం బయలుదేరింది.

రాంసింగ్ కళ్ళు తెరిచాడు.

దూరంగా క్యాంపువయిపు మోటారువాహనాలు వస్తోన్న అలికిడి.

రాంసింగ్ ఛాతీ పొంగింది. "కమాన్, బాస్టర్డ్సు కమాన్!" చిన్నపిల్లాడిలా అరిచాడు రాంసింగ్.

సైనికు లంతా ఎలర్టయ్యారు. పొజిషన్సులోకి

వచ్చారు.

అంతే!

దూరంగా వున్న క్యాంపులో మంటలు బయలు దేరాయి. పెద్ద భూకంపం వచ్చినట్లు భూమి దద్దరిల్లి పోయింది. పెద్ద పెద్ద మంటలు, పొగలతోపాటు పెద్ద పెద్ద మట్టి పెళ్ళలు మేఘాలవయిపు రెగిరి, ఆకాశంలోనే విరిగి కిందపడుతోన్నాయి. పెద్ద పెద్ద వ్యానులు, టాంకరులు, జీపులు ఒక్క చేమిటి అన్నీ ముక్క ముక్క లయిపోయాయి.

జరిగినది తెలుసుకో నేలోగానే శత్రుసైన్యం మొత్తం నేలమట్టమయిపోయింది. రెండు మిలటరీ క్యాంపులను, ఒక అమాయక పల్లెను నిర్దాక్షిణ్యంగా మట్టుపెట్టిన ఆ శత్రుమూక కిక్కురుమనకుండా బినుగకుప్పలుగా మారి పోయింది.

భారత జవానులందరూ రాంసింగును పైకెత్తేశారు. "కర్నల్ సాబ్, జిందాబాద్!" అన్న అరుపులతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది.

రాంసింగయితే తన జవానులనందర్నీ పట్టుకు వదిలే వాడు.

ఆ సంతోషం అలాంటిది. ఆ ఉత్సాహం అలాంటిది. దానికి అవధులు వుండవు. దాన్ని వర్ణించటం సాధ్యం కాదు.

మృత్యు మొహాంలోంచి బయటకు వచ్చామన్న సంతోషం ఒకవైపు, వేలసంఖ్యలోవున్న శత్రుసైన్యాన్ని మచ్చుకు ఒక్కడయినా మిగలకుండా మట్టుపెట్టామన్న హుషారు ఒకవయిపు, తోటి సైనికులకు ఆత్మశాంతిని చెయ్యగలిగామన్న తృప్తి మరోవయిపు.

వారి సంతోషాన్ని యేమని వర్ణించగలం?

వారి హుషారు్ని యేమని చెప్పగలం?

అదే ఆ పల్లెనునిషి రావటం మరికాస్త ఆలస్యమైనా, రాంసింగుకు దూరదృష్టి లేకపోయినా పరిస్థితి మరోలా వుండేది.

పాక్ సేనలు ఆ పాటికి భారత భూభాగాన్ని ఆక్రమించే కార్యక్రమాన్ని చేపట్టేవారే.

రాంసింగు ఒక్కసారి తను అప్పటివరకు వున్న క్యాంపువైపు చూశాడు. తర్వాత జవాన్లవైపు తిరిగి "కమాన్ ఫ్రెండ్స్, లెటజ్ వాక్! పదిగంటలు కష్టపడితే మనం బ్రిగేడియర్ క్యాంపును చేరుకొంటాం. అప్పటివరకూ కొంచెం ఓపికపట్టాలి" అన్నాడు.

జవాన్లందరూ దేశభక్తి గీతాలను పాడుకొంటూ రాంసింగ్‌ను అనుసరించారు.

# 4

దేశ్ కాంతిలా—

పాటియాలకు నలభై మైళ్ళ దూరంలో వున్న ఒక గ్రామం.

సాయంకాలం సరిగ్గా నాలుగు గంటలయింది.

గ్రామం చివరగా వున్న ఫ్యాక్టరీ సైరన్ వూరు దద్దరిల్లిపోయేలా మోగింది.

కొత్తషిఫ్టు కార్మికులు లోపలకు వెళుతోన్నారు.

ఆ ఫ్యాక్టరీ ఏమిటో యెవరికీ తెలియదు. దాంట్లో వున్న పనివాళ్ళలో ఎనభై శాతం మంది మిలటరీవాళ్ళే కాబట్టి అదేదో మిలటరీకి సంబంధించిన కర్మాగారం— అని మాత్రం అనుమానం వస్తుంది. పూర్తిగా 'డివిజన్ ఆఫ్ లేబర్' పద్ధతిమీద పనిచేస్తోన్న ఆ కర్మాగారపు

పనివారికి కూడా అదొక ఆయుధాలు తయారుచేసే ఫ్యాక్టరీ—అని తెలియదు. భారతదేశానికి కావలసిన ఆయుధాలలో నలభై శాతం పైచిలుకు చిన్నగా కని పించే ఆ ఫ్యాక్టరీలోనే తయారవుతాయి.

ఎవరికీ అనుమానం రాకుండా అంత పకడ్బందీగా నడుపుతోన్నారు ఆ ఫ్యాక్టరీని.

కానీ ఆ అతి ముఖ్యమయిన ఫ్యాక్టరీకి అంతిమ ఘడియలు ఆసన్నమయ్యాయని గాని— దాని గురించి పూర్తి సమాచారం శత్రువుల కందిందని గాని ఎవరికీ తెలియదు.

ఆ షిఫ్టులో దాదాపు పన్నెండొందలమంది కార్మికులు పని చేస్తోన్నారు.

ముందు షిఫ్టు కార్మికు లందరూ బయటకు వెళ్ళిపోయారు.

నాలుగు దాటి ఇరవై నిముషాలయింది.

ఫ్యాక్టరీ గేటు ముందు ఒక ట్రాక్టరు వచ్చి ఆగింది.

దాని వెనుకే ఎర్రటి మారుతీ కారు వచ్చింది. కారులోంచి ఆ ఫ్యాక్టరీ ఇన్ ఛార్జ్ మేజర్ సక్సేనా దిగాడు.

సక్సేనాను చూసి సెక్యూరిటీ ఇన్ ఛార్జ్ రాహుబహదూర్ పరుగెట్టుకువచ్చి అధికారికి సెల్యూట్ చేశాడు.

"షిఫ్టు పూర్తయ్యిందా?"

"జీ సాబ్!"

సక్సేనా పనివాళ్ళవయిపు చూశాడు.

పనివాళ్ళు ట్రాక్టరు దిగి క్రింద నిలబడ్డారు.

"బహదూర్! అమ్మాయి షాదీ అయిందిగా. అందరికీ ఇంటిదగ్గర డిన్నరు అరేంజ్ చేశాను. మరి ఈ షిఫ్టు

వాళ్ళు రావటానికి అవ్వదు కదా! అందుకే వాళ్ళకు సరిపోయే ఆహారపదార్థాలను తీసుకొని వచ్చాం. ఒకసారి చెక్ చేసెయ్యి. లోపలకు పంపిద్దాం!" అన్నాడు వక్సీసా.

బహాదూర్ మొహమాట పడుతూనే ట్రాక్టరు యెక్కాడు.

పెద్ద పెద్ద గంగాళాలూ, సీవండి డ్రమ్ములూ, గంగాళాల నిండా సేమ్యాపాయసం వుంది. డ్రమ్ములనిండా పలావు. ఇంకా చిన్న చిన్న పాత్రల్లో కచాంబరు, కూర్మా, సాంబారు....వగైరా లున్నాయి'

అన్నిటి మూతలూ తెరిచాడు బహాదూర్.

కానీ ఏ గిన్నెలోనూ చెయ్యిపెట్టే సాహసం చెయ్యలేకపోయాడు. తినుబండారాలను చెయ్యిపెట్టి కెలకటానికి అతడి మనసతడికి సహకరించలేదు. పైగా సామానంతా అయ్యగారి ఇంట్లోంచి వచ్చింది.

అందుకే బహాదూర్, తనవాళ్ళని గేట్లు తియ్యమన్నాడు.

అదే అతడు చేసిన పొరపాటు.

కాదు ఘోరాతి ఘోరమైన తప్పు.

అతడు కనీసం ఒక పాత్రయినా క్షుణ్ణంగా పరిశీలిస్తే పరిస్థితి మరోలా వుండేది. పన్నెండొందల మంది ప్రాణాలు అనంతవాయువుల్లో కలవకుండా వుండేవి. భారతజాతి రక్షణకు వెన్నుకాసిన ఒక మిలటరీ ఆయుధ కర్మాగారం తన సేవలను కొనసాగిస్తూనే వుండేది.

తినేపదార్థం అన్న భావనా, అయ్యగారిమీద వున్న అభిమానం, నమ్మకం భయం....ఆ ఫ్యాక్టరీని పునాదులతో సహా పెకలించి వేస్తున్నాయి.

ట్రాక్టర్ లోపలకు వెళ్ళింది.

మొత్తం ఆ ఫ్యాక్టరీ తొమ్మిది భాగాలుగా వుంది.

తొమ్మిది భాగాలకు తొమ్మిది ఫోర్ మెన్, ఒక చీఫ్ ఫోర్ మేన్ వుంటారు..

అందరికీ కబురెళ్ళింది.

తొమ్మిది వింగ్ లకూ ఆహారాన్ని తరలించారు.

"ఆరుగంటలకి ఫుడ్స్ డిస్ట్రిబ్యూట్ చెయ్యండి!" దర్పంగా పలికింది సక్సేనా గొంతు.

"జీ సాబ్!" పది కంఠాలు ఒకేసారి పలికాయి.

సక్సేనా బయటకు వచ్చి కారెక్కాడు. డ్రయివరు కారు స్టార్టుచేశాడు. కారు పదిగజాల దూరం వెళ్ళిందో లేదో వెనుక పెద్ద చప్పుడయింది.

సక్సేనా అదిరిపోయాడు.

"ఏం జరిగింది?" అంటూ వెనక్కి తిరిగిచూశాడు.

అతడి కళ్ళ యెదురుగుండానే ఫ్యాక్టరీ సర్వనాశనం అయిపోయింది. ఆ నేకమంది అమాయకుల ప్రాణాలు అనంతవాయువుల్లో కలసిపోయాయి.

## 5

"సార్!"

శ్రీనివాసరావు తలెత్తి చూశాడు. యస్!" అన్నాడు.

"సార్! ఈ కవరును మీ కిమ్మన్నారు." అంటూ లావుపాటి కవరును టేబిల్ మీద వుంచాడు ఆఫీస్ బాయ్.

"ఎవరిచ్చారు?"

"నేను యిదివరకూ యెప్పుడూ చూడలేదు సార్!"

"అంటే యెవరేది యిచ్చినా యిలా తీసుకోవటమేనా?"

బాయ్ గుడ్లు తేలేశాడు. "ఆయన మీ బంధువట సార్! టాక్సీలో కూర్చొని వున్నారు. అర్జెంటుగా వెళుతోన్నారట. మిమ్మల్ని తరవాత కలుస్తానని చెప్పమన్నారు" అన్నాడతడు నీళ్ళు నములుతూ.

"ఆతనెలా వున్నాడు?" శాంతించాడు శ్రీనివాసరావు.

"మనిషిని పూర్తిగా చూడలేదండి. నెత్తి మీద మాత్రం గాంధీటోపీ వుంది."

"సరే నువ్వెళ్ళు!"

బాయ్ వెళ్ళిపోయాడు.

శ్రీనివాసరావు కవరువయిపు చూశాడు. దళసరిగా వుంది. "ఏముంది దాంట్లో?" శ్రీనివాసరావులో అదో రకమయిన టెంక్షన్ బయలుదేరింది.

నెమ్మదిగా కవరును చింపాడు.

లోపల తెల్లకాగితా లున్నాయి.

శ్రీనివాసరావు వాటిని బయటకు తీశాడు. అవి జెరాక్స కాపీలు. ఎవరో తన కూతురికి రాసిన ప్రేమ లేఖలు. వాటికి తన కూతురు సుధ రాసిన సమాధానాలు.

శ్రీనివాసరావు నుదుటిమీద చెమట పట్టేసింది.

కవర్లో మరో కాగితం వుంది.

శ్రీనివాసరావు ఆ కాగితాన్ని బయటకు తీశాడు. కాగితంమీద కొక్కిరిగీతల్లాంటి అక్షరా లున్నాయి.

శ్రీనివాసరావుగారికి—

మాకు నీ వల్ల చిన్న సహాయం కావాలి.

సరిగ్గా సాయంత్రం ఆఫీసవగానే అయిదున్నరకు విక్టరీ సినిమాహాలు దగ్గర వుండు. ఎర్రటి మారుతీ వచ్చి నీ దగ్గర ఆగుతుంది. దాంట్లో యెక్కు. మా కేం కావాలో చెబుతాము. పిచ్చి పిచ్చి వేషాలు వేస్తే ఈ ఉత్తరాలన్నీ మీ వియ్యంకుడిని చేరుకుంటాయి. అప్పుడు నీ కూతురి భవిష్యత్తు ఎలా వుంటుందో ఆలోచించు. ఈ ఉత్తరాలే కాదు, నీ కూతురి ప్రేమకలాపాల గురించి మా దగ్గర యింకా చాలా సమాచారం వుంది.

ఉంటా,

శ్రేయోభిలాషి.

వాటిని చింపి చెత్త బుట్టలో పడేశాడు శ్రీనివాసరావు.

"తను బెదిరింపులకు లొంగకూడదు. లొంగితే చాలా ప్రమాదం. అలాగని కూతురు జీవితాన్ని నాశనం చెయ్యలేదు" గబగబా కాగితంమీద హాఫ్ డే లీవ్ రాసి బయటకు వచ్చాడు.

కారు స్టార్టుచేసి యింటికి పోనిచ్చాడు.

పోర్టికోలో కారు ఆపి, గబగబ బెడ్ రూమ్‌లోకి పరుగెట్టాడు.

మంచం దగ్గర వున్న టీపాయి ఖాళీగా వుంది. దాని మీద వుండాల్సిన తమ పెళ్ళిఫోటో లేదు. అతడికంతా విచిత్రంగానూ ఆశ్చర్యంగానూ వుంది. రెండు నిముషాలు గదిని పరిశీలించి "శాంతా! శాంతా!" అని పిలిచాడు.

"వస్తున్నా!" అంటూ కాఫీ గ్లాసుతో ప్రత్యక్షమయింది శ్రీనివాసరావు భార్య. ఆమె భర్తను ఆశ్చర్యంగా చూసింది. సాధారణంగా శ్రీనివాసరావు ఆఫీసు

వేళలలో యింటికి రాడు. అందులోనూ చాలా ఆసీటిగా వున్నాడు.

"శాంతా! ఇక్కడ మన పెళ్ళి ఫోటో ఉండాలి, ఏమయిందో తెలుసా?" అన్నాడు శ్రీనివాసరావు.

శాంత ఫక్కుమని నవ్వింది. "ఫోటో కనపడకపోయి నందుకేనా యింత కంగారు?" అంది.

"నేనడిగిన దానికి సమాధానం చెప్పు" సీరియస్‌గా అడిగాడు శ్రీనివాసరావు.

"అవును, అక్కడ మన ఫోటో వుండాలి కదూ!" అంది ఆశ్చర్యపోతూ.

శ్రీనివాసరావు నిస్పృహాగా మంచంమీద వాలాడు.

"ఏం జరిగిందండీ?" అంది శాంతి ఆప్యాయంగా.

జరిగింది చెపితే ఆమె బేజారెత్తిపోతుంది. తమ కూతురు ఎవరికో ప్రేమలేఖలు రాసిందన్న విషయాన్ని ఆమెకు కూడా తెలియనివ్వలేదు శ్రీనివాసరావు. మరి! మరి....తన కూతురికి వచ్చిన ఉత్తరాలను ఆ ఫోటో ఫ్రేమ్‌లో దాచినట్లు ఎలా తెలిసింది. ఫోటోను కాజేసి అందులోని సమాచారం ద్వారా తనను బెదిరిస్తోన్నా రంటే వాళ్ళకు తననుండి ఏం కావాలి? అసలు ఉత్తరాల విషయం వాళ్ళకు ఎలా తెలిసింది.

శ్రీనివాసరావు కళ్ళు మూసుకొన్నాడు.

రెండు నిముషాలు ఆలోచించాడు.

వెంటనే బుర్రలో తళుక్కున మెరుపు మెరిసింది.

అవును తను ఉత్తరాల విషయం పరీక్షకు చెప్పాడు. వాటిని యెవరికీ తెలియకుండా ఫోటో ఫ్రేమ్‌లో వుంచి నట్లు తను పరీక్షకు చెప్పాడు. వాటిని అప్పుడు చింపే సినా బావుండేది.

'ముందు షరీఫ్‌ను కలుసుకోవాలి.'

ఆ ఆలోచనరాగానే శ్రీనివాసరావు వడివడిగా బయటకు వచ్చేశాడు.

శాంత, భర్తను విచిత్రంగా చూస్తోంది.

"శాంతా! నేను రావటం ఆలస్యం కావచ్చు జాగ్రత్త!" అని కారు స్టార్టు చేశాడు.

● ● ●

ఊరికి దూరంగా వున్న కాలనీలో, మిగతా ఇళ్ళకు కొంచెం దూరంగా వున్న చిన్న డాబా యిల్లు.

ఆ యింటి ముందు ఒక పోలీసు వ్యానూ, జీపూ ఆగి వున్నాయి.

ఇంటి ముందు చాలామంది పోగయి ఉన్నారు.

వారు యింకా ముందుకు రాకుండా నల్గురు పోలీస్ కాన్‌స్టేబుల్స్ వాళ్ళని అదిలిస్తోన్నారు.

అప్పటికి టయిము మూడుగంటలు దాటి పది నిముషాలయింది.

శ్రీనివాసరావు మారుతీ కారుని ఆ ఇంటికి నాలుగిళ్ళ అవతల ఆపాడు. అతనికేదో జరగకూడనిది జరిగినట్లు అనిపిస్తోంది. ఆ జనం గుమిగూడి వున్నది షరీఫ్ యిల్లే—

"ఏమయిందీ? షరీఫ్‌కు యేమీ జరగలేదు కదా?"

శ్రీనివాసరావు నెమ్మదిగా కాలినడకన షరీఫ్ ఇంటికి చేరుకున్నాడు.

అక్కడ ఉన్న ఒక నడివయస్కుడిని పక్కకు పిలిచి "ఏం జరిగింది బాబూ?" అన్నాడు.

"దార్జన్యాలు మరీ ఎక్కువయిపోయాయి సార్!"

శ్రీనివాసరావుకు మండుకొచ్చింది. "అసలేం జరిగింది?" అన్నాడు.

"ఇందాక ఇద్దరు హీరో హోండా మీద వచ్చి అ యింటిమీద కాల్పులు జరిపి పారిపోయారు."

"మై గాడ్! ఎవరికయినా....?"

"ఆ యింటి ఓనర్ వళ్ళంతా జల్లెడయిపోయింది సార్! వెంటనే పోయాడు" చెప్పాడతను.

"ఆ ఇంటి ఓనర్ పేరు....?"

"ఎమ్.డి. పరీక్షని రిటైర్డు ఆర్.డి.ఓ. అండి."

శ్రీనివాసరావు నెత్తిమీద పిడుగుపడినట్లయింది. "దుర్మార్గులు ఎంతకయినా తెగించారు. తనకున్న చిన్న ఆసరా పోయింది. తనకు ఉత్తరం రాసిన వాళ్ళ గురించి పరీక్షకు తెలుసన్నమాట. అందుకే అతని నోటిని శాశ్వతంగా మూసేశారు. ఇప్పుడెలా?"

శ్రీనివాసరావు ఒంట్లో శక్తంతా పోయినట్లు నీరసంగా అడుగులు వేశాడు కారువయిపు.

డోర్ తెరిచి కారులో కూర్చున్నాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?........అవును డైరక్టుగా మాథ్యూస్‌ను కలుసుకోవాలి. ముందు అతని వయిపు నుండి యే ఇబ్బందీ లేకుండా చేసుకోవాలి. అవసరమయితే పదో పరకో యిచ్చయినా సరే తన వయిపుకు తిప్పుకోవాలి. అంతకీ లొంగకపోతే తనచేతిలో అధికారం వుండనే వుంది."

ఆ ఆలోచనరాగానే శ్రీనివాసరావు కారును న్యూ కాలనీ వయిపు ఉరికించాడు.

పదినిముషాలలో కారు న్యూ కాలనీలో వుంది.

మాథ్యూస్ యిల్లెక్కడో తెలియదు. కానీ ట్రినిటీ చర్చి ఎదురుగా వున్న సందులో అని అడ్రసులో వుంది.

కారును చర్చి దగ్గర ఆపాడు శ్రీనివాసరావు.

మాథ్యూస్ అడ్రసు సులువుగానే దొరికింది.

సందు చివర నున్న నాలుగో ఇల్లు.

కారును సందు చివరే ఆపి శ్రీనివాసరావు ఆ ఇంటి వయిపు అడుగులు వేశాడు.

శ్రీనివాసరావును చూసి ఆ యింటి అరుగుమీద కూర్చొన్న యువకుడు కంగారుగా లేచాడు. "నమస్కారం సార్!" అన్నాడు.

శ్రీనివాసరావు అతడిని చూశాడు. అరడుగుల పైచిలుకు పొడవు. కోల మొహం. కసరత్తు చేసిన బంగారుఛాయ ఒళ్ళు. కట్ బనియన్‌లోంచి పొంగిన కండలు యింపుగా కనిపిస్తోన్నాయి.

"మీకు మాథ్యూస్ తెలుసా?" అడిగాడు శ్రీనివాసరావు.

"నేనే సార్!" తల వంచుకుని సమాధానం చెప్పాడు ఆ యువకుడు.

తన కూతురు అతని వయిపు ఎందుకు ఆకర్షించబడిందో యిప్పుడు అర్థం చేసుకోన్నాడు శ్రీనివాసరావు. "మీ యిద్దరి విషయం నాకు ముందుగా తెలియదు. దాని మారేజ్ అయిపోయాకే నీ లెటర్సు బయటపడ్డాయి." నోటిదాకా వచ్చి ఆగిపోయాయి మాటలు.

"రండి సార్!" లోపలకు ఆహ్వానించాడు మాథ్యూస్.

చిన్న గదయినా చాలా అందంగా వుంది.

"ఏం చేస్తూ వుంటావు?" అడిగాడు శ్రీనివాసరావు.

"మొన్నటి వరకు ఒక ప్రయివేటు కంపెనీలో పని చేశాను సార్. ఈ రోజే ఎస్.ఐ.గా సెలక్టయినట్టు లెటర్ వచ్చింది."

"కంగ్రాట్సు."

మాథ్యూస్, శ్రీనివాసరావుకు పాదాభివందనం చేశాడు.

అప్రయత్నంగా శ్రీనివాసరావు కళ్ళు చెమర్చాయి.

ఈలోగా లోపలనుండి యేభైసంవత్సరాలు పైబడ్డ స్త్రీ మజ్జిగ గ్లాసు తీసుకు వచ్చింది.

"మా అమ్మ!" పరిచయం చేశాడు మాథ్యూస్.

"నమస్కారం బాబూ!"

"నమస్కారమమ్మా!" తనను ఆమెకు పరిచయం చెయ్యకపోవటం గమనించాడు శ్రీనివాసరావు. అంటే తన గురించి ఆమెకు చెప్పాడన్నమాట. తన కూతురు కొంచెం ధైర్యంచేసి మాథ్యూస్ విషయం తనకు చెప్పి వుంటే పరిస్థితి ఎలా వుండేదో!

మజ్జిగ తాగి గ్లాసు క్రిందపెట్టాడు శ్రీనివాసరావు.

మాథ్యూస్ తల్లి గ్లాసును తీసుకు లోపలకు వెళ్ళి పోయింది.

"కూర్చో బాబూ!" అన్నాడు శ్రీనివాసరావు.

శ్రీనివాసరావుకు ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చు న్నాడు మాథ్యూస్. రెండు నిమిషాలు పోయాక "ఏమిటి సార్ యిలా వచ్చారు?" అడిగాడు మాథ్యూస్.

తనకు లెటరు రావటం, ఇంటి దగ్గర ఫోటో లేక పోవటం, షరీఫ్ చనిపోవటం అన్నీ వివరంగా చెప్పాడు శ్రీనివాసరావు.

మాథ్యూస్ దవడ కండరాలు బిగుసుకొన్నాయి. "నిన్న సాయంత్రం బేబీ నాకు రాసిన ఉత్తరాలను చింపేద్దామని ఇల్లంతా వెతికాను. ఎక్కడా దొరకలేదు. ఏమయ్యాయో అర్థంకాక జుట్టు పీక్కుంటున్నాను" చెప్పాడు మాథ్యూస్.

"ఆ ఉత్తరాలు యింకా నీ దగ్గర ఎందుకు ఉంచుకున్నావు?" అని అడుగుతాదేమో అని శ్రీనివాసరావు వయిపు చూశాడు మాథ్యూస్.

శ్రీనివాసరావు మౌనంగా కూర్చొని ఉన్నాడు.

"ఏం చేద్దామనుకొంటున్నారు సార్!" అడిగాడు మాథ్యూస్.

శ్రీనివాసరావు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత "పోలీస్ రిపోర్టు ఇస్తాను" అన్నాడు.

"వద్దు సార్! తొందరపడకండి. బేబీ గురించి కొంచెం ఆలోచించండి" అతడి మాటల్లో బేబీ—అంటే శ్రీనివాసరావు కూతురి గురించి తపన ఉంది.

"అయితే వాళ్ళకు లొంగిపోమంటావా?"

"వద్దు సార్! లొంగినట్లు నటించండి."

"అంటే."

"వాళ్ళ ఉద్దేశ్యం మనకు తెలియదు. వాళ్ళు చెప్పినట్లే మీరు విక్టరీ సినీమాహాలు దగ్గరకు వెళ్ళండి. మీ కారు నాకు ఇవ్వండి. ఎవరికీ తెలియకుండా నేను వాళ్ళ ఆచూకీ తీస్తాను."

"సరే" అని శ్రీనివాసరావు బయటకు వచ్చేశాడు.

## 6

డిలీప్, ఐ.ఎన్.ఎస్. శాతవాహనాలోంచి బయటకు వచ్చాడు. టయిమ్ చూసుకొన్నాడు. పదిగంటలు దాటింది.

అతడి గుండెలు దడ దడలాడాయి.

సరోజ సరిగ్గా పదిగంటలకు తనకోసం వాటర్ టాంక్సు దగ్గర చూస్తూ ఉంటానంది. ఇప్పుడే పది దాటిపోయింది. అమ్మో సరోజకు కోపం వస్తే తను

దిలీప్ తొందరగా సైకిల్ ఎక్కాడు. బలం అంతా ఉపయోగించి పెడల్సును తొక్కాడు. కళ్ళెం వదిలిన గుర్రంలా ముందుకు పరుగుతీసింది అంబరు సైకిలు.

చుట్టూ చీకటి. చలి గాలి వంటిని కోసేస్తోంది. అయినా సైకిల్ వేగాన్ని యేమాత్రం తగ్గించలేదు దిలీప్. ఒళ్ళంతా చెమటలు పట్టేసింది.

సైకిలు పైవ్ లైన్స్‌ను దాటింది.

వి.ఎన్.ఎస్. సర్కారుకు వచ్చేటప్పటికి పదిన్నరయ్యింది.

దిలీప్ వేగం పెంచాడు.

నాసీనా బాగ్ సమీపిస్తోంది.

అతనిలో హుషారు పెరిగింది.

దూరంగా సింధియా జంక్షనులోని లైట్లు కనిపిస్తున్నాయి.

దిలీప్ టయిమ్ చూసుకున్నాడు. పదకొండు కావటానికి పదినిముషాలు ఉంది. "తప్పదు. సరోజ నుండి తను తిట్లను అందుకోక తప్పదు."

నాసీనా బాగ్ అంతా నిద్రలో వుంది.

గేటులోంచి లోపలకు వెళ్ళాడు దిలీప్.

సరిగ్గా అప్పుడే అతని ప్రక్క నుండి. ఇద్దరు వ్యక్తులు అతనిని దాటుకుని ముందుకు వెళ్ళిపోయారు. సరోజ గురించి ఆలోచనలలో లేకపోతే దిలీప్ వాళ్ళని గమనించి ఉండేవాడు.

దిలీప్ మరో అయిదు నిముషాలలో వాటర్‌టాంక్స్‌ను చేరుకొన్నాడు.

మొత్తం పన్నెండు వాటర్ టాంకులున్న ఆ ప్రాంతం

వారు రహస్యంగా కలుసుకోవటానికి ఉపయోగించే స్థలం. ఆకాశంమీదకు నిలబడ్డ టాంకుల క్రింద భాగం అంతా చీకటిగా ఉంటుంది. అటువయిపు యెవరూ సాధారణంగా రారు. నేలంతా చాలా చిత్తడిగా ఉంటుంది.

"సరోజా!" పిలిచాడు దిలీప్.

తపతప అడుగులు చప్పుడు చేసుకుంటూ వచ్చి అతని గుండెలమీద వాలిపోయింది సరోజ.

ఒంటికాలుమీద లేచిపోవాల్సిన మనిషి బాహువుల్లో యిమిడిపోయేసరికి దిలీప్ నరాలు తియ్యగా జువ్వుమని లాగాయి.

కానీ ఆ సంతోషం ఎంతోసేపు వుండలేదు.

ఆమె వళ్ళంతా చమటతో తడిసిపోయి వెచ్చగా వుంది. గుండె దడ స్పష్టంగా వినిపిస్తోంది.

"ఏం జరిగింది సరోజా?" అడిగాడు దిలీప్ గాభరాగా.

మాట్లాడవద్దని చేతో సంజ్ఞ చేసింది సరోజ. చీకటికి అలవాటుపడ్డ వారి కళ్ళు పరిసరాలను సులువుగా చూడ గలుగుతోన్నాయి.

"అక్కడ యెవడో చాలాసేపటి నుండి నిలబడి వున్నాడు" అంది నెమ్మదిగా అతని చెవిలో.

ఆమె చూపించిన వయిపు చూశాడు దిలీప్.

ఎవరో స్థూలకాయుడు నిలబడినట్లు మసగ్గా కనిపిస్తోంది.

"ఎవరయ్యుండొచ్చు?"

"ఏమో తెలియదు. నేనొచ్చిన రెండునిముషాలకు వచ్చాడు. కదలలేదు మెదలలేదు. అలానే నిలబడి వున్నాడు. నేను భయంతో చచ్చిపోతోన్నాను. పోనీలే

ఇప్పుడయినా వచ్చావు."

"సారీ లేటయింది."

అంతలో దూరంగా అడుగుల చప్పుడు వినిపించింది.

"ఏయ్ సిద్దూ! ఎవరయినా ఇటు వచ్చారా?" నెమ్మ డిగా అడిగింది ఒక గొంతు.

"లేరు. తెచ్చారా?" అడిగాడు అక్కడే నిలబడి వాళ్ళ గురించి ఎదురు చూస్తోన్న భారీ ఆకారం.

"తెచ్చాము! నేను పైకెక్కి టాంకుల్లో కలుపుతాను. మీరు క్రింద వుండండి."

"జాగ్రత్త, వాసనకూడా చూడకు" సిద్దూ హెచ్చ రించాడు.

అవతలవాడు చిన్నగా నవ్వాడు. "రేపు ఉదయానికి ఈ నాసీనాబాగ్ అంతా వల్లకాడయి పోతుందిగదూ!" అన్నాడు.

మిగిలినవాళ్ళు శృతి కలిపారు.

దిలీప్‌కు జరుగుతోన్నది అర్థమయింది. నెమ్మదిగా అతని వెన్నులోంచి చలి పుట్టుకొచ్చింది. 'ఏం చెయ్యాలి? వాళ్ళు ముగ్గురు తను ఒక్కడు. తను వాళ్ళను ఎదిరించ గలడా? పైగా వాళ్ళ దగ్గర ఆయుధాలున్నాయి. తను నిరాయుధుడు. ఎలా? తెగించాలి. ఇంతమంది ప్రాణాలను కాపాడ్డంలో తన ప్రాణం పోయినా పర్వాలేదు' నిశ్చ యానికి వచ్చేశాడు దిలీప్.

"సరోజా!"

"వూఁ."

"నేను ఇక్కడ వుండి, మందును టాంకులలో కలప కుండా ఆపుతాను. నువ్వు నెమ్మదిగా వెళ్ళి మనవాళ్ళం దర్నీ పిలుచుకురా!" అన్నాడు దిలీప్.

"నేను వెళ్ళను."

"సరోజా! ప్లీజ్!"

"వద్దు దిలీప్! నేనూ నీతోపాటే వుంటాను. నిన్ను ఈ దుర్మార్గులకు అప్పగించి నేను వెళ్ళలేను."

"సరోజా! చెప్పేది అర్థంచేసుకో, మనం త్వరపడక పోతే రేపు ఇక్కడ పీనుగుల వెంట ఉంటాయి."

సరోజ తలవూపింది.

"ఆ పావడా ఇలా ఇచ్చెయ్యి!"

సరోజ సంకోచించకుండా తన ఒంటిమీద వున్న పావడాను తీసి దిలీప్‌కు ఇచ్చేసింది.

దిలీప్ ఆమె చేతిని మెల్లగా నిమిరాడు.

ఆమె మెల్లగా అక్కడనుండి బయటకు జారుకుంది. "ఈ సమయంలో మీరు అక్కడ ఎందుకున్నారు?" అని పెద్దవాళ్ళెవరయినా అడుగుతారనే భయం వాళ్ళకు లేదు.

సరోజ వెళ్ళాక, దిలీప్ గట్టిగా ఊపిరిపీల్చుకున్నాడు. సరోజ ఇచ్చిన పావడాను మెలితిప్పి తాడులా తయారు చేశాడు.

"ఎక్కు! త్వరగా!" అంది సిద్దూ గొంతు.

టాంకులకు వున్న ఇనుప నిచ్చెన దగ్గరకు నడిచాడు ఒకడు. దిలీప్ నెమ్మదిగా రెండోవయిపునుండి నిచ్చెనను చేరుకున్నాడు. చీకటిలో అతడిని ఎవరూ గమనించలేదు.

ఒక సన్నటి ఆకారం నిచ్చెన ఎక్కుతోంది.

దిలీప్ ఆ ఆకారాన్ని చేరుకున్నాడు. తయారుగా వుంచుకొన్న పావడాను అతని మెడకువేసి బిగించాడు.

ఆగంతకుడు ఉలిక్కిపడ్డాడు.

జరిగేదేమిటో అర్థమయ్యేలోగా అతడి చేతిలోంచి

కొన్ని వేలమంది ప్రాణాలు తీయాల్సిన మందు సీసా జారి క్రిందపడిపోయింది. మందు నేలపాలయిపోయింది.

దిలీప్ అతడిని వెనక్కి లాగాడు.

అతడు 'దబ్'మని క్రిందపడ్డాడు.

"ఏమయింది!" అంటూ మిగిలిన ఇద్దరూ అక్కడకు వచ్చారు.

సిద్దూ పెన్ టార్చిలీని వెలిగించాడు. జరిగింది అర్థం కాగానే పళ్ళు పటపట కొరికాడు.

టార్చి కాంతిలో దిలీప్‌ను చూశాడు.

"ఒరేయ్ కుర్రనాయాలా! మా ప్లానంతా తగలేశావు కదరా!" అన్నాడు వుక్రోషంగా.

దిలీప్‌ను ఏం చెయ్యాలో పాలుపోలేదు.

అతడికి మందు నేలపాలయిన విషయం తెలియదు.

ఏం చెయ్యాలని ఆలోచనలో వుండగానే "సక్" మన్న శబ్దంతో ఒక వస్తువు అతని ముందునుండి వెళ్ళింది.

దిలీప్ గొంతు తడారిపోయింది. అది పెద్దసైజు కత్తి. సిద్దూ దానిని గాలిలో ఝళిపిస్తూ దిలీప్ మీదకు వస్తోన్నాడు.

దిలీప్ అప్రయత్నంగా పావడాను అడ్డుపెట్టాడు.

సిద్దూ చేతిలోని కత్తి జారిపోయింది.

దిలీప్ ఆలస్యం చెయ్యలేదు. చటుక్కున వంగి కత్తిని అందుకొన్నాడు. ముందుకు విసిరాడు.

సిద్దూ బాధగా మూలిగాడు.

దిలీప్‌కు ధైర్యం పెరిగింది. ప్రత్యర్థులు ముగ్గురిలోనూ ఒకడు చచ్చుబడిపోయాడు. మిగిలిన యిద్దరిలోనూ నిచ్చెన మీద నుండి క్రిందపడిన వ్యక్తికి అంతో యింతో దెబ్బ తగిలే వుంటుంది. ఇక మిగిలింది ఒక్కడు.

నిద్రా నోటంట బాధగా మూలుగు వినపడగానే మూడో వ్యక్తి అక్కడకు వచ్చాడు.

చీకటిలో ఒకళ్ళు మరొకరికి కనిపించటం లేదు.

దిలీప్ కు దగ్గరగా అడుగుల చప్పుడు వినిపించింది.

అటువయిపు కదలబోయాడు.

కానీ అంతలోనే అతడి కుడిభుజం భగ్గున మండింది. దిలీప్ గాభరాగా భుజాన్ని కదుముకొన్నాడు. చేతికి జిగటగా తగిలింది. ఇక తాత్సారం చేస్తే తన పని సరి. ఎదుటి వ్యక్తి తన భరతం పట్టకమానడు. దిలీప్ కు ఎక్కడ లేని ధైర్యం వచ్చింది. మొండిగా ఎదుటి వ్యక్తి మీదకు విరుచుకుపడ్డాడు. అతడి చేతిలో ఆయుధం వుందని కూడా సంకోచించలేదు.

జరిగేది గ్రహించేలోగా ప్రత్యర్థిని నిరాయుధిడిని చేశాడు దిలీప్.

అతడు వెనకనుంచి దిలీప్ ను దొరకబుచ్చుకొని ముందుకు వంచాడు.

దిలీప్ మెడనరాలు కలుక్కుమన్నాయి. భుజాని కయిన గాయంలోంచి అతడి శక్తంతా రక్తం రూపంలో బయటకుపోతోంది. నీరసంగా అతని కళ్ళు మూసుకు పోతోన్నాయి.

బాధను పళ్ళబిగువున నొక్కిపట్టి బాగా ముందుకు వదిలాడు దిలీప్.

అతడి పట్టు యింకా బిగుసుకుంది. దిలీప్ కు వూపిరాడటం కష్టంగా వుంది.

ప్రత్యర్థి తనకంటే బలవంతుడనటంలో సందేహం లేదు. తనకన్నా నాలుగయిదు అంగుళాలు పొడవువుండి వుంటాడు. పైగా యిటువంటి వాటిల్లో బాగా ఆరితేరి

వుండొచ్చు.

నిచ్చెనమీద నుండి క్రిందపడిన వ్యక్తి కోలుకొని ప్రత్యర్థికి సాయం వచ్చేలోగా ఏదో ఒకటి చెయ్యాలి.

శక్తినంతా కూడదీసుకుని చటుక్కున నిటారుగా నిలబడ్డాడు.

ఆ వ్యక్తి మెడమీద పట్టు బిగించాడు.

ఉన్నట్టుండి దిలీప్ క్రిందకు జారిపోయాడు.

ప్రత్యర్థి ఖంగు తిన్నాడు. మళ్ళీ దిలీప్ మెడ పట్టు బిగించబోయాడు.

దిలీప్ చటుక్కున పక్కకు తిరిగి అతడి చెయ్యి దొరకబుచ్చుకుని బలవంతంగా వెనక్కు విరిచేశాడు.

ఆ వ్యక్తి బాధతో 'అబ్బా!' అన్నాడు.

అంతే దిలీప్ కు ఆత్మవిశ్వాసం పెరిగింది. తను బాధను ఓర్చుకోగలిగాడు. ఆ వ్యక్తి బలవంతుడయినా బాధను ఓర్చుకోలేకపోయాడు. గెలుపు తనదే.

ఆ ఆలోచన రాగానే ప్రత్యర్థి చేతిని బాగా వెనక్కి వంచేశాడు.

ఆ వ్యక్తి ప్రాణం పోయినట్లు గోలగా అరిచాడు.

దిలీప్ అతడిని యిష్టం వచ్చినట్లు పిడిగుద్దులు గుద్దేడు.

అలా గుద్దులతో నిస్త్రాణగా క్రిందికి ఒరిగిపోయాడు.

## 7

సాయంత్రం ఐదు గంటల ఇరవై నిముషాలు దాటింది.

విశ్వరీ సినిమాహాలు ముందరంతా హడావుడిగా వుంది. మ్యాటనీ వదిలిన జనం బయటకు వస్తోన్నారు. ఫస్టు షోకు క్యూ కట్టిన జనం విసుక్కుంటూ బయటకు వెళ్ళే వారికి తోవ యిస్తోన్నారు.

శ్రీనివాసరావు నెమ్మదిగా డ్రైవ్ చేసుకుంటూ

వచ్చి, కారును సినిమా థియేటర్ ముందు ఆపాడు. మాథ్యూస్ అండతో అతనికి ధైర్యం పెరిగింది.

సరిగ్గా అయిదున్నరకు అతడి కారు ప్రక్కన ఎర్రటి మారుతి ఆగింది.

మారుతి డ్రయివర్, డోర్ ఓపెన్ చేసి శ్రీనివాస రావు వయిపు చూశాడు.

శ్రీనివాసరావు తనెక్కిన కారును పార్కింగ్ స్పేస్‌లో వుంచి, మారుతిలో కూర్చున్నాడు.

మారుతి చిన్న జర్క్‌తో ముందుకు కదిలింది.

"మీ రెవరు?" అడిగాడు శ్రీనివాసరావు.

"మీ కనవసరం."

"పోనీ మీకేం కావాలి?"

ఆ వ్యక్తి చిన్నగా నవ్వాడు. "మన రాష్ట్రంలోని నక్సలైట్లను అణచటానికి కమెండోలు వస్తున్నారని సమాచారం అందింది. మొత్తం ఎంతమంది వస్తున్నారు? ఎప్పుడు వస్తున్నారు. వాళ్ళకు నాయకు డెవరు? వాళ్ళ ప్రోగ్రాం చార్టుతో సహా వివరాలు మాకు కావాలి" అన్నాడు.

శ్రీనివాసరావు పళ్ళు పటపట కొరికాడు. "బాస్టర్డ్" అన్నాడు.

అతడు కారు ఆపాడు. శ్రీనివాసరావు గూబ పగి లేలా వాయించేశాడు. "ఒళ్ళు జాగ్రత్తగా దగ్గర పెట్టు కొని మాట్లాడు" అన్నాడు.

శ్రీనివాసరావు కోపాన్ని తమాయించుకొన్నాడు. "మీకు ఈ యిన్ఫర్మేషన్ ఎలా తెలిసింది. నా మీద వున్న అధికారులకు, చివరకు కేబినెట్ మినిష్టర్లకు

కూడా తెలుసుకుని విషయాలు మీకెలా తెలిశాయి?"
అన్నాడు ఆశ్చర్యంగా.

"డన్! నువ్వు మమ్మల్ని, మా శక్తిని వూహించగల వనుకుంటున్నాను. ఒకవేళ నువ్వు ఆ విషయాలను బయట పెట్టకపోయినా మేము ఎలానూ ఆ విషయాలను కనుక్కోగలం."

"ఇంపాసిబుల్! ఆ విషయాలు నాకు తప్ప మరో వ్యక్తికి తెలియవు. కమెండో గ్రూపులకు నేనే డైరెక్టుగా ఇన్ఫర్మేషన్ పంపాను" ఆవేశంగా అనేసి నాలుక కరుచుకున్నాడు శ్రీనివాసరావు.

"థాంక్యూ ఫర్ యువర్ యిన్ఫర్మేషన్" అనేసి కారు వేగాన్ని పెంచాడు.

మరో పదినిముషాల్లో కారు ఒక అధునాతనమయిన బంగ్లా ముందు ఆగింది.

ఆ బిల్డింగ్ ను చూసి శ్రీనివాసరావు ఆశ్చర్యపోయాడు.

అది కస్టమ్స్ ఆఫీసర్స్ క్లబ్.

అతడు శ్రీనివాసరావు వయిపు నవ్వుతూ చూశాడు.
"చూశావా మా ధైర్యం. మాకు రహస్య స్థావరం అంటూ ఏదీలేదు. పదిమందికీ తెలిసిన ప్రాంతాన్నే మేము అవసరానికి వాడుకుంటూ వుంటాము. ఈ బిల్డింగ్ లో వున్న రిక్రియేషన్ హాలును మేము స్వాధీనం చేసుకున్నాం. ఇప్పుడు నిన్ను స్పృహపోగొట్టి లోపలకు తీసుకుని వెళ్ళినా ఎవరూ అనుమానపడరు. హేంగోవర్లో వున్నావనుకుంటారు" అంటూ శ్రీనివాసరావు మెడమీద చిన్న దెబ్బ వేశాడు.

అతడిని భుజాలను పట్టుకుని బయటకు లాగాడు.

ఈలోగా మరో వ్యక్తి అక్కడకు వచ్చాడు. ఇద్దరూ శ్రీనివాసరావు రెక్కలను తమ భుజాలమీద వేసుకుని ఈడ్చుకుపోయారు.

క్లబ్‌ముందు అటువంటివి జరగటం సర్వసాధారణమే కాబట్టి ఎవరూ వాళ్ళని అనుమానించరు.

లోపలకు తీసుకువెళ్ళిన పది నిముషాలకు శ్రీనివాస రావు కళ్ళు తెరిచాడు.

అతడి ఎదురుగా నల్గురు వ్యక్తులు కూర్చొనివున్నారు. కళ్ళు తెరిచిన శ్రీనివాసరావుని చూసి "గుడ్ మెలుకువ వచ్చిందన్న మాట" అన్నాడు వాళ్ళలో ఒకడు.

శ్రీనివాసరావు వాళ్ళను నిర్లక్ష్యంగా చూశాడు.

"చూడు మిస్టర్ రావ్, నీ ప్రాణం తీసయినా నీ నుండి నిజం చెప్పించగలము. ఎందుకు అనవసరంగా ప్రాణాలు తీసుకొంటావు. పైగా నీ కూతురు జీవితం అనవసరంగా నీ మూర్ఖత్వం వలన బలయిపోతుంది. మాతో సహకరించు. నీ కూతురు గురించి మా దగ్గర వున్న సమాచారాన్నంతటినీ నీకు యిచ్చేస్తాం. పైగా నీ కెంత కావాలో, ఏం కావాలో చెప్పు" అన్నాడతడు. అతడా జట్టు నాయకుడు.

శ్రీనివాసరావు కళ్ళు మూసుకున్నాడు. రెండు నిము షాల తరువాత కళ్ళు తెరచి "ముందు ఆ లెటర్స్ ఇవ్వండి" అన్నాడు.

"గుడ్! అలా వుండాలి" అంటూ అతడు ఎవరికో సైగ చేశాడు.

రెండు నిముషాల్లో లావుపాటి కవరు తెచ్చి టేబిల్ మీద వుంచాడు.

"ఇప్పుడు చెప్పండి" అన్నాడు నాయకుడు.

"ఉన్నపళంగా ఎలా చెప్పగలను. ఆఫీసుకు వెళ్లాలి" అన్నాడు శ్రీనివాసరావు.

"అయితే బయలుదేరండి."

"ఇప్పుడెలా! ఆఫీసు క్లోజయిపోతుంది?"

"ఫరవాలేదు ఓపెన్ చేయించే ప్రయత్నం నేను చేస్తాను" అంటూ కుర్చీలోంచి లేచాడు అతడు.

ఈలోగా తలుపు చప్పుడయింది.

"ఎవరది?"

సమాధానం లేదు.

"జాగ్రత్త! నెమ్మదిగా తలుపు తియ్యండి. అను మానం వస్తే కాల్చేయండి" అని సహచరులకు చెప్పి జేబులోంచి పిస్తోలు తీసి పట్టుకున్నాడతడు.

సహచరులు నెమ్మదిగా తలుపు తెరిచారు.

ఊహించని వేగంతో లోపలకు వచ్చాడు మాథ్యూస్. వచ్చీ రావటంతోనే అతడి చేతిలోని పిస్తోలుకు పని చెప్పాడు. నాయకుడు మాథ్యూస్‌ను అయోమయంగా చూశాడు.

"మర్యాదగా మీరు నల్గురూ అలా గోడకు చేర బడండి" మాథ్యూస్ కంఠం గర్జించింది.

చేసేదిలేక వాళ్ళు నల్గురూ గోడకు చేరబడ్డారు.

"సార్! మీ రా లెటర్సును తీసుకుని బయటకు వెళ్ళండి. వెంటనే పోలీసులను తీసుకుని యిక్కడకు రండి" అన్నాడు మాథ్యూస్ శ్రీనివాసరావుని చూసి.

"నిన్ను ఒంటరిగా...." అంటున్నాడు శ్రీనివాసరావు.

"సార్! మీరు తొందరగా వెళ్ళండి. మీరు తిరిగి వచ్చేవరకూ నేను వీళ్ళను చూస్తుంటాను."

"అదికాదు. ముందు వీళ్ళని ఏదయినా తాళ్ళతో బంధించి వుంచితే మంచిదేమో!" అన్నాడు శ్రీనివాసరావు.

"అవసరం లేదు సార్! ఎవడయినా తోక జాడిస్తే నా చేతిలో పిస్తోలు వూరుకోదు. మీరు త్వరపడండి" అన్నాడు.

అదే మాథ్యూస్ చేసిన పొరబాటు. అతడు శ్రీనివాసరావు మాట విన్నట్లయితే అతడి ఆయువు అంత తొందరగా ఆవిరయివుండేది కాదు.

శ్రీనివాసరావు చేసేది లేక కవరు తీసుకుని బయటకు వచ్చేశాడు.

శ్రీనివాసరావు బయటకు వెళ్ళాక మాథ్యూస్ వాళ్ళ వయిపు చూశాడు. "మీరలా గోడవయిపు మొహాలు పెట్టి నిలబడండి" అన్నాడు.

ఆ నల్గురూ గోడవయిపు తిరుగుతున్నారు.

అంతలోనే అనుకోని సంఘటన జరిగిపోయింది.

ఒక బలమయిన కర్ర వచ్చి మాథ్యూస్ చేతిమీద పడింది. అతడి చేతిలోని పిస్తోలు క్రిందకు జారిపోయింది.

ఆ నల్గురు వెనక్కి తిరిగారు. "థాంక్యూ జాన్ సమయానికి వచ్చావు" అంటూ అప్పుడే లోపలకు వచ్చిన వ్యక్తిని అభినందించారు.

"నంబర్ వన్ వస్తానని కబురు పెట్టారు. మీకు చెబుదామని వచ్చాను. ఇంతలో ఇతడు మిమ్మల్ని బెదిరించటం చూశాను" అన్నాడు.

పరిస్థితి తారుమారయినందుకు మాథ్యూస్ బాధపడలేదు. తను వీళ్ళ నాయకుడిని చూడగలుగుతున్నాడు .... అదే సంతోషం అతడికి. కొండంత ధైర్యాన్ని యిచ్చింది.

"వీణ్ని కట్టిపడెయ్యండి!" అన్నాడు వాళ్ళ నాయకుడు.

"అలాగే బాస్!" అంటూ మిగిలిన నలుగురూ మాథ్యూస్‌ను కుర్చీకి కట్టేశారు.

"ఎవరు నువ్వు?" అడిగాడు నాయకుడు.

"నా సంగతి చెబుతాగానీ ముందు నాకో అనుమానం వచ్చింది. దాన్ని తీర్చు" అన్నాడు మాథ్యూస్.

నాయకుడు పకపకా నవ్వాడు. "భేష్! ధైర్యం అంటే అలా వుండాలి" అని "అడుగు" అన్నాడు.

"ఎవరో నంబర్ వన్ వస్తోన్నాడన్నారు. మరి వీళ్ళు నిన్ను బాస్ అంటోన్నారు. ఇంతకీ వీళ్ళకు నాయకుడివి నువ్వా? ఆ నంబర్ వన్నా?" అడిగాడు మాథ్యూస్.

"ఎలాగూ చావబోతున్నావు. నీకు చెప్పటం నష్టం లేదు. నేను ఈ ఏరియాకు నాయకుడిని. మాలాంటినాయకులకి నెంబర్ వన్ నాయకుడు. అలాంటి నంబర్ వన్‌లకి కమేండర్ వున్నాడు."

మాథ్యూస్ అతడిని కవ్విస్తోన్నాడు. అతడి నోటంట ఎన్ని విషయాలు బయటకు వస్తే అంత మంచిది. మాథ్యూస్ ట్రవుజర్లో మినీ రికార్డర్ వున్న విషయం తెలియని నాయకుడు డబ్బా వాయించుకోవటం మొదలు పెట్టాడు.

'తన ప్రాణంపోయినా పర్వాలేదు. రికార్డర్ ప్రభుత్వానికి దొరికితే చాలు' అన్న ధీమాతో వున్నాడు మాథ్యూస్.

అంతలో తలుపు దగ్గర అలజడయింది.

నెంబర్ వన్ లోపలకు వచ్చాడు.

అతడిని చూసి మాథ్యూస్ నోరావలించాడు.

"ఒక కస్టమ్స్ కలక్టర్ వీళ్ళతో చెయ్యి కలిపాడా?" అన్నాడు మాథ్యూస్ అసహ్యంగా.

నెంబర్ వన్. మాథ్యూస్‌ను కోపంగా చూశాడు. "ఎవరితను?" అన్నాడు.

"ఇతడు శ్రీనివాసరావును ఫాలో అవుతూ వచ్చాడు సార్!"

"స్టుపిడ్స్! మీ రా శ్రీనివాసరావును వదిలేశారన్న మాట" అన్నాడు నెంబర్ వన్.

అందరూ తలలు వంచుకొన్నారు.

"వాడు పోలీసులను తీసుకువచ్చేలోపల వీడిని ఫినిష్ చెయ్యండి."

నాయకుడు గన్ ఎత్తాడు.

నెంబర్ వన్ అతడిని వారించాడు. "మన ప్లాన్‌కు అడ్డుగిలిన వీడిని మామూలుగా చంపకూడదు" అంటూ మాథ్యూస్ దగ్గరకు వెళ్ళాడు.

"ఎవరు నువ్వు?"

మాథ్యూస్ అతడిని అసహ్యంగా చూశాడు.

నెంబర్ వన్ అతడి ఎడమ చెయ్యను ఫ్రీచేశాడు. "చెప్పు!" అన్నాడు.

మాథ్యూస్ మాట్లాడలేదు.

నెంబర్ వన్ కోపంగా ఆ చెయ్యిని వెనక్కు విరిచేశాడు. మాథ్యూస్ గిలగిల్లాడిపోయాడు. అయినా కిమ్మనలేదు.

అతడి ఎడంచెయ్యి చచ్చుబడిపోయింది.

తర్వాత కుడిచెయ్యి.

ఇంకా ఎంత చిత్రవధ అనుభవించి వుండేవాడో గాని, అంతలో బయటనుండి 'పోలీస్' అన్న వర్తమానం

వచ్చింది.

"ఫినిష్ హిమ్!" అంటూ నాయకుడికి ఆర్డర్ జారీచేసి నెంబర్ వన్ బయటకు వెళ్ళిపోయాడు.

సైలన్సర్‌లోంచి చప్పుడు చెయ్యకుండా ఒక బులెట్ బయటకు దూసుకుపోయింది.

# 8

భూపాల్ ఛటర్జీ తన గదిలో అసహనంగా తిరుగు తోన్నాడు. అతడి మెదడంతా ఆలోచనలతో నిండి పోయి వుంది. "ఎలా? యిటువంటి విషమపరిస్థితినుండి దేశాన్ని రక్షించటం ఎలా? దేశంలో కుట్రదారులు విలయతాండవం చేస్తోంటే తను చేతులు ముడుచుకు కూర్చోవటమేనా? అలాంటప్పుడు తను అంత పెద్ద పదవిలో వుండి లాభం ఏమిటి? ఏదో చెయ్యాలి? ఏం చెయ్యాలి? ఎంత కాన్ఫిడెన్షియల్ మేటరయినా సరే యేమీ కానట్టు లీకయిపోతోంది ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో తెలియని పరిస్థితి. ఈ విపత్తునుండి బయట పడకూడదంటే ముందు ఈ లీకేజ్‌ని అరికట్టాలి."

"సార్!" అన్న పిలుపు వినపడ్డంతో ఆలోచనలకు ఫుల్‌స్టాఫ్ పెట్టి అటువయిపు తిరిగాడు భూపాల్.

"సార్! దండావతి సార్ వచ్చారు."

"సెండ్‌హిమ్ యిన్!"

"గుడ్‌మార్నింగ్ మిస్టర్ భూపాల్!" అంటూ లోప లకు వచ్చాడు ఎన్.ఎస్.టి యల్ డైరెక్టర్ దండావతి.

"మార్నింగ్, బీసీటెడ్!"

అతడలా కూర్చున్నాడో లేదో దేవుడమ్మా, పేష్కార్ లోపలకు వచ్చారు.

"ఎనీ ప్రోగ్రెస్!" అడిగాడు పేష్కార్.

"పరిస్థితి మరీ విషమిస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లోని నక్స లైట్లను అణచటానికి మనం కమెండోలను పంపడానికి నిర్ణయించాము. ఈ విషయాన్ని ఆ సెక్రటేరియట్‌లో వున్న శ్రీనివాసరావుకు అప్పగించాము. అతడి చర్యలను కనీసం మనకు కూడా చెప్పవద్దనీ చెప్పాం. ఈ విషయం శత్రువులకు తెలిసిపోయింది. శ్రీనివాసరావును వివరాల కోసం బలవంత పెట్టారు. ఈ యిష్యూలో సబ్ ఇన్‌స్పెక్టర్‌గా రిక్రూట్ అయిన మాథ్యూస్ ప్రాణాలు కోల్పోయాడు. కానీ అతడి ట్రవుజర్‌లో వున్న రికార్డ్ ద్వారా మనకు చాలా విషయాలు తెలిశాయి. ఆంధ్రప్రదేశ్‌కు రాజన్ అనే కస్టమ్స్ ఆఫీసరు హెడ్ అని తెలిసింది. అతనిమీద విజిలెన్సు లెన్సును యేర్పాటు చేశాను.

కర్నల్ రామ్‌సింగ్, మేజర్ సక్సేనాల రిపోర్టులు కూడా నన్ను కలవరపెడుతోన్నాయి. ఇదికాక, విశాఖపట్నం నేవల్ క్వార్టర్స్—నౌసేనా బాగ్ వాటర్ టాంకుల్లో పాయిజన్ కలిపే ప్రయత్నం జరిగింది. కానీ దిలీప్ అనే యువకుడు ప్రాణాలకు తెగించి ఆ దుర్మార్గాన్ని ఆపగలిగాడు. అతని ప్రియురాలు పెద్దవాళ్ళందర్నీ పోగేసుకు రావటం ఒక్క నిముషం ఆలస్యం అయితే అతని ప్రాణాలు పోయి వుండేవి. మనకు అక్కడ ఒక యిన్‌ఫర్మేషన్ దొరికింది. అక్కడ సిద్ధూ అనే వ్యక్తి దొరికాడు. వాడికి ప్రస్తుతం కేబినెట్లో వున్న ఒక మంత్రితో సంబంధం వుంది."

"ఎవరు సార్ ఆ మంత్రి?"

"సారీ! సాక్ష్యాధారాలు లేకుండా అటువంటి పెద్ద వారిమీద అభాండాలు వెయ్యటం భావ్యంకాదు. కేబి

చూడండి మీకే తెలుస్తుంది."

"మీ ప్లాను యేమిటి?"

"ముందు మనం కేబినెట్ మంత్రులమీద నిఘా యేర్పాటు చెయ్యాలి."

"మైగాడ్ ప్రధాని ఒప్పుకొంటారా?"

"ఒప్పుకోరు. అందుకే ఆయనకు అసలు విషయం తెలియనివ్వం. రాష్ట్రపతితో చూచాయగా చెప్పాను. ఆయన ముందు ఒప్పుకోలేదు. కానీ దేశపరిస్థితిని వివరించాకే అయిష్టంగానే ఒప్పుకొన్నారు."

"ఎప్పుడు మొదలుపెడతారు?"

"చూచాయగా అనుమానం వున్నవాళ్ళమీద ఇప్పటి నుండే మొదలుపెడదాం. మిగిలిన వాళ్ళమీద కేబినెట్ మీటింగు అయ్యాక మొదలుపెడదాం."

"ఎనీ ఫర్దర్ యిన్ఫర్మేషన్."

"యస్! ఇన్ఫార్మర్ కేబినెట్లోనే వున్నాడని మనకు తెలిసింది కాబట్టి, అతడిని కనిపెట్టడానికి ఒక మార్గం వుంది. వరుసగా కొన్ని మీటింగులను యేర్పాటు చెయ్యాలి. ఒకో మీటింగులో ఒక మంత్రిని ఎలిమినేట్ చేస్తూపోతే, చివరకు కల్ప్రిట్ దొరికిపోతాడు."

"విషయాలను ప్రధానికి వివరించారా?"

"లేదు, అతడు పట్టుబడ్డా మనం ఆ విషయాన్ని ప్రధానికి చెప్పలేము. ఆయన కదిలిపోతాడు. తన కేబినెట్ సహచరుడు దేశద్రోహానికి పాల్పడ్డాడన్న నిజాన్ని ఆయన సహించలేరు. ప్రజలకు కూడా ఈ విషయం తెలియకూడదు. తమను రక్షించాల్సిన నాయకులే యిటువంటి చర్యలకు పాల్పడుతున్నారని తెలిస్తే పెద్ద అలజడి చెలరేగిపోతుంది."

"అయితే ఏం చేద్దాం?"

"ముందు అతన్ని పట్టుకొనే మార్గం ఆలోచించాం గదా, ముందు దానిని అదుపులో పెడదాం."

"అంటే అప్పటివరకూ ఇన్ఫర్మేషన్ లీకవుతూనే వుంటుందన్నమాట"

"లీకవుతుంది. అసలు విషయాలు బయటకు పొక్కవు. కేబినెట్లో చర్చించేవన్నీ సకిలీవి. అసలు డెసిషన్సును రాష్ట్రపతి తీసుకుంటారు. అక్కడినుండే అందరికీ ఆదేశాలు అందుతూ వుంటాయి."

మరో పావుగంట తరువాత మీటింగయిపోయింది.

# 9

లా మినిష్టర్ సంత్ సింగ్ చటుక్కున పార్కులోకి దూరాడు.

అతడు అమృతసర్ కు ఒక సీక్రెట్ ఇన్ఫర్మేషన్ పంపాలి. ఇంట్లోంచి ఫోన్ చేస్తే దాన్ని ట్రాప్ చేస్తారు. పోనీ యే హోటల్ లోనో కలుసుకుందాం అంటే అక్కడా అనుమానమే. తన కారులో కూడా మైక్రో ఫోను లున్నాయని అతనికి అనుమానం. ఒక వ్యక్తిని అతడు సెంట్రల్ పార్కుకు సరిగ్గా అయిదు గంటలకు రమ్మన్నాడు. ఇంట్లోంచి నాలుగు గంటలకే బయలు దేరాడు. కానీ స్పెషల్ బ్రాంచ్ మనుషులు తనను వెంటాడుతూన్నారని గమనించాడు.

వాళ్ళని తప్పించుకునేటప్పటికి తల ప్రాణం తోకకు వచ్చింది. అయిదు గంటలకు ముందుగానే అక్కడకు చేరాల్సింది అది దాటిపోయింది. ఇలా జరుగుతుందని ముందే వూహించిన సంత్ సింగ్ తనకోసం ఆ వ్యక్తిని ఎంత రాత్రయినాసరే కాచుకుని వుండమని చెప్పాడు.

ఇప్పుడది మంచిదయింది.

సెంట్రల్ పార్కు అది దాటినా కిటకిటలాడిపోతోంది.

ఎవరూ గుర్తుపట్టటానికి లేకుండా సంత్ సింగ్ తన రూపాన్ని పూర్తిగా మార్చుకొన్నాడు.

పార్కులో చేరి చుట్టూ కలయజూశాడు సంత్ సింగ్.

అతడికి కావలసిన వ్యక్తి అశోకవృక్షాల అవతల వున్నాడు.

సంత్ సింగ్ అక్కడకు గబగబా వెళ్ళాడు. అతడిని పలుకరించాడు.

"బాగా ఆలస్యం అయింది" రుసరుసలాడా డతడు.

"ఏం చెయ్యను! స్పెషల్ బ్రాంచ్ మనుషులను తప్పించుకుని వచ్చేసరికి నా తలప్రాణం తోక్కవచ్చింది" వుసూరుమన్నాడు సంత్ సింగ్.

"నీమీద నిఘా వేశారా? ఎవరికయినా అనుమానం వచ్చిందా?"

"అనుమానం వచ్చినట్టుంది. లేకపోతే యిలా జరుగదు."

"ఈ బాధంతా ఎందుకు చక్కగా ఫోన్ చేసి మన కోడ్ లో చెప్పేయ్యొచ్చు కదా?"

"ఏడిచినట్టుంది. బయట నిఘా వేసినవాళ్ళు ఫోన్ ను టాప్ చెయ్యరా? మా స్పెషల్ బ్రాంచ్ ని తక్కువ అంచనా వెయ్యకు. ఎంతకోడ్ లో మాట్లాడినా దాన్ని ఇట్టే డీకోడ్ చెయ్యగలరు. అంతెందుకు మనం ఈ నగరంలో యే హోటల్ లో మాట్లాడినా, కనీసం నా బంధువులు, స్నేహితులు—వాళ్ళ ఇళ్ళల్లోగాని కార్లలో గాని మాట్లాడినా ఇన్ ఫర్మేషన్ మా స్పెషల్ బ్రాంచ్ కి

తెలిసిపోతుంది. అందుకే ఇందిరాజీ హయాంలో —
ఎమర్జన్సీ పెట్టినప్పుడు జగజ్జీవన్ రాం వంటి ప్రముఖులు
ఇలా ఆరుబయటే చర్చించుకునేవారు. అందుకే ఆమెకు
జగజ్జీవన్ రాం పార్టీలోంచి బయటకు వెళ్ళిపోతున్న
విషయం తెలియలేదు. ఇప్పుడు మనం ఆ నాయకుల
పంథానే అవలంబిద్దాం" అన్నాడు సంత్ సింగ్.

"సరే, విషయం చెప్పండి!"

సంత్ సింగ్ అటూ ఇటూ చూశాడు. ఎవరూ తనను గమనించలేదని నిర్ధారించుకుని తృప్తిగా వూపిరి పీల్చాడు. తర్వాత విషయం మొదలుపెట్టాడు. అలా చెబుతూ చెబుతూ ఒక్కసారి అటూ ఇటూ తిరిగి యెవరూ తమను కనిపెట్టడంలేదని నిర్ధారించుకుంటున్నాడు. నిముష నిముషానికీ తను కూర్చున్న జాగా మారుస్తోన్నాడు. విషయం చెప్పటం పూర్తయ్యేటప్పటికి అలా పదిగజాలు మారారు వాళ్ళు.

కానీ ఇక్కడ తను ఎన్ని జాగ్రత్తలు తీసుకొన్నా అక్కడ భూపాల్ ఛటర్జీ తమ మధ్య జరుగుతోన్న సంభాషణను యధాతధంగా వినగల్గుతోన్నాడని సంత్ సింగ్ కు తెలియదు.

ఇక్కడే భూపాల్ ఛటర్జీని, సంత్ సింగ్ తక్కువగా అంచనా వేశాడు.

ఇలా జరుగుతుందని ముందే వూహించిన భూపాల్, పార్కులలోనూ మరికొన్ని బహిరంగ ప్రదేశాలలోనూ తన మనుషులను ఏర్పాటుచేశాడు.

* * *

"ఏమిటి మీరు చెప్పేది?" ప్రధాని కోపంతో ఊగిపోయాడు.

"చెప్పేదేముంది? మామీద అనుమానం వుంటే రిజిగ్నేషన్ యివ్వమని మీరు డైరెక్టుగా అడగవచ్చు" హోంమంత్రి సేన్ కంఠం తీవ్రంగా వుంది.

"అసలు జరిగింది వివరంగా చెప్పండి!"

హోంమంత్రి మొహం ఎర్రనయింది. "మాకు పర్సనల్ గా ఎన్నో వుంటాయి. మంత్రి అయినంత మాత్రాన మాకు స్వతంత్రం వుండకపోతే ఎలా?"

"అబ్బా! జరిగింది చెప్పమంటున్నానుగా!" ప్రధాని గొంతులో విసుగు కనిపించింది.

"పర్సనల్ అన్నానుగా!అయినా యిక తప్పేదేముంది? నాకు జూలీ అనే ఆమెతో సంబంధం వుంది. నిన్న స్పెషల్ బ్రాంచ్ మనుషులు నేను ఆమెతో వుండగా.... తర్వాత జూలీని ఇంటరాగేట్ చెయ్యటానికి ప్రయత్నించారట."

"మీ మీద నిఘానా! మీరు నాకన్నా పెద్దవారు, దేశభక్తులు. క్షమించండి!" అంటున్నాడు ప్రధానమంత్రి.

ఈలోగా భూపాల్ ఛటర్జీ లోపలకు వచ్చాడు.

ప్రధాని అతనిమీద విరుచుకుపడిపోయాడు. "మీ లిమిట్సులో మీరు వుండాలి. ఏదో పెత్తనం ఇచ్చాం కదా అని ఇలా పరువు తియ్యటం బావోలేదు."

భూపాల్ మాట్లాడలేదు. తప్పు చెయ్యకపోయినా తప్పు చేసినవాడిలా తల వొంచుకుని నిలబడ్డాడు. అతనికి ప్రధాని సంగతి తెలుసు. ఆయన కోపం తాటాకు మంట. ముందు యేదయినా అనేసినా తర్వాత బాధపడ్డాడు. అందుకే భూపాల్ ఛటర్జీ అతనికి యెదురుచెప్పలేదు.

"మినిష్టర్ల మీద నిఘా యేర్పాటు చేశారట?"

"అవును సార్! తప్పనిసరయింది!"

"ఎందుకట? కేబినెట్లో యెవరిమీదయినా అనుమానమా?"

"సార్! కేబినెట్ మినిష్టరయినంత మాత్రాన, అతడు ఈ దేశం పౌరుడు కాకపోడు. ప్రస్తుతం జరిగే విషయాలనుబట్టి ఆలోచిస్తే హోదాలో వున్న వ్యక్తులే ఈ పని చేస్తోన్నట్టు విదితమయింది. అందరిమీదా లెన్సు యేర్పాటు చేశాం. చివరకు మీమీద, రాష్ట్రపతిమీద కూడా. దేశంకన్నా ఎవరూ ముఖ్యం కాదు. నా పనికి అడ్డొస్తే నన్ను రిజయిన్ చెయ్యమంటే చేస్తాను. లేకపోతే నా చర్యలను వ్యతిరేకించేవాళ్ళను రిజయిన్ చెయ్యమనండి!" ఎంత సౌమ్యంగా చెబుదామనుకొన్నా భూపాల్ గొంతులో తీవ్రత వెల్లుబికి పైకొచ్చింది. అతడు తన సర్వీసులో యేనాడూ అంత తీవ్రంగా మాట్లాడివుండడు.

అతడంత తీవ్రంగా మాట్లాడేటప్పటికి, ప్రధాని పరిస్థితిని అర్థం చేసుకొన్నాడు. "మిస్టర్ హోమ్ మినిష్టర్! ట్రయ్ టు ఎండర్‌స్టాండ్ హిమ్!" అన్నాడు హోమ్ మంత్రివైపు తిరిగి.

"పోనీ ఆ విషయం అలా వుంచండి. మొన్న అస్సాంకు కమెండోలను పంపాలని మనం నిర్ణయం తీసుకొన్నాం. కానీ మనం నిర్ణయం తీసుకొన్న సంఖ్యకు రెట్టింపుమంది కమెండోలు, అస్సాంకు కాకుండా పంజాబ్ వెళ్ళారు. ఇలా యెందుకు జరిగింది?" అడిగాడు హోం మంత్రి.

"ఒక్క ఆ నిర్ణయమే కాదు. మీరు కేబినెట్లో తీసు

కొన్ని నిర్ణయాలు యేవీ యధాతదంగా అమలు జరగటం లేదు. ఆ అధికారాన్ని కేబినెట్టే నాకు ఇచ్చింది. నేను తీసుకొనే నిర్ణయాలు నా ఒక్కడివే కాదు. దేశ క్షేమాన్ని కోరే కొందరి ఆఫీసర్లవి. వాటిని రాష్ట్రపతి స్వయంగా అమలుపరుస్తున్నారు. ఈ విషయంలో అపార్థాలకు తావు లేదు."

"అయితే నేను రాజీనామా చేస్తాను."

ఛటర్జీవయిపు చూశాడు ప్రధాని. తర్వాత హోమ్ మంత్రివయిపు చూసి "కొంచెం ఓపిక పట్టండి. కాదూ కూడదంటే మీ ఇష్టం" అన్నాడు.

హోం మంత్రి యేమనుకొన్నాడో యేమో మౌనంగా బయటకు వెళ్ళిపోయాడు.

# 10

"మిస్టర్ నువ్వు మమ్మల్ని ఇలా మోసం చేస్తావనుకోలేదు" కమేండర్ గొంతు తీవ్రంగా పలికింది.

అతడు దాదాపుగా వణికిపోయాడు. "నేను ఎవర్నీ మోసం చెయ్యలేదు" అన్నాడు.

"చూడు మన నెంబర్ వన్నులు పంపిన రిపోర్టులను" అంటూ ఒక ఫైలును అతడి ముందుకు విసిరాడు కమేండర్.

"క్షమించండి! నేను కేబినెట్ నిర్ణయాలను యథాతథంగా మీకు వివరించాను" అన్నాడతడు, ఆ ఫైలును పరీక్ష చేసి.

"మిస్టర్! క్యాబినెట్ రాంకు మంత్రివి. నీకు తెలియకుండా ఎలా తీసుకుంటారు నిర్ణయాలు."

"నిజం కమేండర్! అదే నాకూ అర్థం కావటం లేదు...."

"అవును, అర్థంకాదు. ప్రధానిమీద, అతని కుటుంబం మీదా పీకలదాకా కోపం వుందనీ, ఎలాగైనా యీ ప్రభుత్వాన్ని కూల్చి నిన్ను దేశాధినేత చెయ్యమని ప్రాధేయపడ్డారనీ నిన్ను నమ్మి ముఠాలో జాయిన్ చేసుకొన్నాము. ఇప్పుడు ఇలా చేశావు."

"నన్ను నమ్మరే, నాకూ యే విషయమూ తెలియదని చెబుతున్నానుగా?"

"అయితే నీతో మాకు యేం పనివుంది? ఎలాగూ ప్రభుత్వ చర్యలు నీకు తెలియవుగా?" అన్నాడు కమేండర్.

"అయితే...."

"ఏముంది? మాకు అవసరంలేని వ్యక్తులు మా సంఘంలో వుండకూడదు" అన్నాడు కమేండర్.

"సరే. మీ ఇష్టం" అంటూ కుర్చీలోంచి విసురుగా లేచాడతడు.

అంతే! కమేండర్ చేతిలోని పిస్టల్ గర్జించింది. అతడి చాతి తూట్లుపడిపోయింది.

* * *

'కాబినెట్ మంత్రి వాసుదేవ్ దారుణ హత్య.'

అన్న హెడ్డింగుతో మర్నాడు ప్రముఖ పత్రికలన్నీ అతడి జీవిత విశేషాలనూ, దేశానికి చేసిన సేవలనూ ప్రశంసించాయి. హత్యను తీవ్రంగా ఖండించాయి.

ప్రస్తుతం పోర్టుఫోలియోలెస్ గా వున్న వాసుదేవ్ ప్రధానికి కుడిభుజం. అతడు లేని లోటు యితర తీరనిది....

అనేకమంది ప్రముఖులు తమ సందేశాలను పంపారు.

భూపాల్ ఛటర్జీ చదువుతోన్న పత్రికను ప్రక్కన పెట్టాడు. నెమ్మదిగా లేచి కాన్ఫిడెన్షియల్ రేక్ వైపుకు వెళ్ళాడు. రేక్ లోంచి ఒక బ్లూ ఫైలును తీశాడు. దాంట్లోంచి ఒక కాగితం బయటకు తీశాడు.

అది వాసుదేవ్ మీద తయారుచేసిన చార్జీషీట్.

అతడిని దేశద్రోహిగా నిరూపించటానికి తగిన సాక్ష్యాధారాలన్నీ ఆ ఫైలులో వున్నాయి.

భూపాల్ ఆ కాగితాలను చిన్న చిన్న ముక్కలుగా చింపేశాడు.

తర్వాత వాటినీ ట్రేలో వేసి తగలబెట్టాడు.

దేశానికి పట్టిన పీడ వదిలిందని హాయిగా నిట్టూర్చాడు.

ఆ ఫైలు ప్రక్కనే మరో ఫైలుంది.

అందులో లా మినిస్టర్ సంత్ సింగ్ వివరాలున్నాయి.

అతను కేబినెట్ రహస్యాలను పంజాబు ఉగ్రవాదులకు అందజేశాడు. కానీ అతడి ఉద్దేశ్యం ఎవర్నీ మోసం చెయ్యాలని కాదు. పంజాబు తీవ్రవాదులమీద చర్యలు తీసుకుంటే అక్కడ అరాచకం పెరిగిపోతుందన్న వుద్దేశ్యంతో. అంతేకాదు, వాళ్ళకి సమాచారాన్ని అందజేసి వాళ్ళదగ్గర నుండి దానికి పదింతలు సమాధానాన్ని రాబడుతూన్నాడు. అతడు జాతిశ్రేయస్సు కోసం కన్నా దేశశ్రేయస్సుకు పాటుపడ్డాడు. ఆ ఫైలును కూడా చింపేశాడు భూపాల్. కాని సంత్ సింగ్ పంజాబ్ హిట్ లిస్టులో చేరాడన్న విషయం అతనికి తెలియదు.

—: ఐపోయింది :—

సీరియల్

# రాక్షసహేల

వాణిశ్రీ

(గత సంచిక తరువాయి)

"మీట్ మై ఫ్రెండ్ మిస్టర్ శ్రీనాథ్."

"హౌ ఆర్ యూ? వెంకటసుబ్బయ్య, మేనేజర్, ప్రసాద్ ఇండస్ట్రీస్."

పరిచయం చేశాడు కిరణ్.

ఇద్దరూ షేక్ హేండ్స్ ఇచ్చుకున్నారు.

ముగ్గురూ బార్ లోకి వెళ్ళారు.

"ఏరా మందు పుచ్చుకుంటావా?" అడిగాడు కిరణ్.

"నీ దయవల్ల ఇంకా మొదలు పెట్టలేదు" అన్నాడు శ్రీనాథ్ నవ్వుతూ.

"వెధవా! అమెరికాలో ఉండేవాడివి మందు కొట్టడం మొదలు పెట్టలేదా! షేమ్!.....షేమ్.....!" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ బిత్తరపోయాడు.

"ఆఁ....." అన్నాడు.

కిరణ్ కన్ను గీటాడు.

"అమెరికాలో వున్నంత మాత్రాన తాగుడు నేర్చుకోవాలని ఎక్కడుందిలే!" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"యూ ఆర్ కరెక్ట్ సార్!" అన్నాడు శ్రీనాథ్.

"మీరు అమెరికాలో వుంటారా?" అడిగాడు వెంకట

సుబ్బయ్య శ్రీనాథ్ ని.

"అవున్సార్! వాడు ఇంజనీరు. ఈమధ్యనే వచ్చాడు ఇండియాకి. పెళ్ళి చేసుకుని వైఫ్ తో సహా వెళ్ళిపోతాడు. కదరా!" అన్నాడు కిరణ్.

కిరణ్ చెప్తున్న పచ్చి అబద్ధాలకు విస్తుపోతున్న శ్రీనాథ్ తేరుకుని "అవునవును...." అన్నాడు.

"వీడి అంకుల్ యెప్పుడో పాతికేళ్ళ క్రితమే సెటిల్ అయిపోయాడు అమెరికాలో. ఆయన పేరు వీరన్న. అయితే వీరేన్ అంటూంటారు ఫ్రెండ్స్. పెద్ద స్కాలర్ లెండి ఆయన. విస్కాన్సిన్ యూనివర్సిటీలో ఎం.ఇ, డిగ్రీ తీసుకున్నాడు. హైడ్రాలజీలో పి.హెచ్.డి. చేశాడు. ఆయన ఇంటలిజెన్స్ చూసి అమెరికావాళ్ళు ఆశ్చర్యపోయారనుకోండి. అక్కడే ఓహియో నార్దర్న్ యూనివర్సిటీలో సివిల్ ఇంజనీరింగ్ అసిస్టెంట్ ప్రొఫెసర్ గా చేరిపోయాడు. ప్రస్తుతం న్యూమెక్సికో యూనివర్సిటీలో ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. మనవాడు కూడా అక్కడే యమ్.ఇ., మెకానికల్ ఇంజనీరింగ్ పూర్తిచేశాడు."

ఈ కుర్రాడు అమెరికాలో ఎమ్.ఇ., చదివాడా అని వెంకటసుబ్బయ్య ఆశ్చర్యంగా శ్రీనాథ్ ని చూస్తున్నాడు.

కిరణ్ యూనివర్సిటీ పేర్లతో సహా చెప్తూ సొరకాయలు కోస్తుంటే బిత్తరపోతున్నాడు శ్రీనాథ్.

స్టివర్డు ఆర్డర్ కోసం వెయిట్ చేస్తున్నాడు.

"యం సి. విస్కీ క్వార్టర్, రెండు యాపిల్ జ్యూస్" చెప్పాడు కిరణ్.

వెంకటసుబ్బయ్య క్వార్టర్ విస్కీ తాగేసి కుర్చు

న్నాడు. కిరణ్ మరొక క్వార్టర్ తెప్పించాడు.

"కిరణ్! నిన్ను చూస్తే భలే గమ్మత్తుగా వుంటుందయ్యా! నీ నెలజీతం ఒక్క రోజులో ఇలా తగలేస్తావు! మరి నెలంతా ఎట్లా నెట్టుకొస్తావో యేమోగాని, అసలు నువ్వు ఉద్యోగం ఎందుకు చేస్తున్నావా అని?" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"మీవంటి పెద్దవారిని ప్రసన్నం చేసుకుంటే ముందు ముందు పెద్ద వుద్యోగం దొరక్కుండా పోదా? అని నమ్మకం. ఇక డబ్బుదేముంది? ఏదో అత్తగారిచ్చిన కట్నం మీద వడ్డీ వస్తున్నది" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

శ్రీనాథ్ కు పరిస్థితి అర్థం కావడం లేదు.

ఈ ముసలాయన ముందు తనను అమెరికాలో ఇంజనీర్ అని పొగడ్డం ఎందుకు?

ఈయన చేతిలో యేముంది?

అనవసరంగా కిరణ్ ఆయన్ని కా....కా....పడతాడా?

ఏదో లాభం వుంది. అదేమిటో శ్రీనాథ్ బుర్రకి తట్టడం లేదు.

"మన ప్రొప్రయిటర్ గారి అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారటగా? యేం సార్?" అన్నాడు కిరణ్.

"అవును. దశరథ్ చెప్పాడు."

"ఆ అమ్మాయి పేరు మీకు తెలుసా?"

"అయ్యో! ఎందుకు తెలీదూ? చిన్నప్పటి నుంచి తెలుసు. మా అమ్మాయితో పాటు తిరిగేది. నన్ను అంకుల్....అంకుల్ అంటూ చాలా గొప్పగా పిలుస్తుంది. ఆ అమ్మాయి పేరు వందన" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"ఇంజనీరింగ్ చదివింది అనుకుంటాను."

"అవును."

"మా వాడికి ఆ మాచ్ చూడకూడదూ?" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ అయోమయంలో పడిపోయాడు. ఏదో చిన్న అబద్ధంతో బిజినెస్ పెట్టొచ్చు అనుకుంటుంటే వీడు యేకంగా పెళ్ళి సంబంధమే మాట్లాడేస్తున్నాడే అని భయపడిపోతున్నాడు.

"చూడొచ్చు! కాని మీ వాడు ఎంతలో వున్నాడో? ఆ ప్రసాద్ పీనాసిరకం. కుదురుతుందా అని" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"ఏ విషయం గురించి?"

"పెళ్ళి సంబంధంలో యింకా దేన్ని గురించి వుంటుందయ్యా! అదే కట్నం విషయం. అమెరికాలో ఇంజనీరింగ్ చదివి వచ్చాడంటే అదీ మీ కులంలో ఏ పాతిక లక్షలో కట్నం డిమాండ్ చేస్తారు."

"నో....నో....మా వాడు అటువంటివాడు కాదు లెండి. కాకపోతే మా వాడి బిజినెస్‌కి పెట్టుబడి పెడితే చాలు. ఏరా?" అన్నాడు కిరణ్.

"ఆఁ ...అవునవును " అన్నాడు శ్రీనాథ్ ఏమని చెప్పాలో తోచక.

"మనవాడు పెళ్ళికాగానే న్యూమెక్సికో వెళ్ళిపోతాడు. పదిలక్షలు ఇస్తే చాలు. అమెరికాలో మనం టెన్ పర్సెంట్ కాపిటల్ పెడితే నైంటీ పర్సెంట్ షెడ్యూల్ బాంక్ అప్పు ఇస్తుంది. సో వన్ క్రోర్‌తో అక్కడ ఇండస్ట్రీ స్టార్టు చేస్తాడు" చెప్పాడు కిషోర్.

"పది లక్షలయితే ఒప్పుకుంటాడేమో? అమెరికా

సంబంధం గదా! ఇద్దరమ్మాయిల్ని ఇండియాలోనే ఇచ్చాడు" అన్నాడు వెంకటసుబ్బయ్య.

"మన ప్రొప్రయిటర్ గారితో మీరు కొంచెం చనువుగా వుంటారు గదా! అందుకని చెపుతున్నాను. అదీ గాక అమ్మాయి ఇంజనీర్ కాబట్టి మా వాడు కన్సెషన్ తో ఒప్పుకుంటాడు."

వెంకటసుబ్బయ్య తల వూపాడు.

"మా వాడు అమెరికాలో బిజినెస్ స్టార్టు చేస్తే మీరు, నేను కూడా ఒకసారి సరదాగా వెళ్ళి చూసొద్దాం" అన్నాడు కిరణ్.

వెంకటసుబ్బయ్య నోరు తెరిచి "యెక్కడికి....?" అన్నాడు.

"ఇంకెక్కడికి అమెరికాకే" అన్నాడు కిరణ్ నవ్వుతూ.

"అమెరికా వెళ్ళడం మన జాతకంలో వుందంటావా?" అన్నాడు వెంకటసుబ్బయ్య ఆశగా.

"మీ రీ పెళ్ళి కుదర్చండి. తెలుస్తుంది" అన్నాడు కిరణ్.

## 28

స్కై బ్లూ ఫియట్ కారులో కూర్చుని శ్రీనాథ్ కోసం కబురు చేశాడు కిరణ్.

మహాలింగపురంలో చిన్న ఔట్ హౌస్ లో అద్దెకుంటున్నాడు శ్రీనాథ్. అద్దె నెలకి రెండొందలు.

ఇల్లుగలవారి పనిమనిషి వచ్చి చెప్పింది మీ కోసం యెవరో కారులో వచ్చారని. తన కోసం కారులో వచ్చినవా రెవరా...? అని ఆలోచిస్తూ వచ్చాడు శ్రీనాథ్.

"ఓకేయ్!....త్వరగా ...రా పోదాం" అన్నాడు కిరణ్ కారులో కూర్చుని చెయ్యి వూపుతూ.

"నువ్వటా? ...ఎవరో అనుకున్నాను. కారు దిగవా యేమిటి? పద రూమ్‌లోకి" అన్నాడు శ్రీనాథ్.

"రూమ్‌లోకి ఎందుకు? పోదాం పద. తొందరగా డ్రెస్ చేసుకో."

"పొయ్యిమీద 'టీ' పెట్టాను. తాగిపోదాం" అన్నాడు శ్రీనాథ్.

కిరణ్ కారు దిగి రూమ్‌లోకి వెళ్ళాడు.

"ఏం రూమ్‌రా ఇది డర్టీ" అన్నాడు కుర్చీలో కూర్చుని.

"ఏదో లేరా! నిరుద్యోగి ఇంతకంటే మంచిది ఎక్కడ భరించగలడు?" అన్నాడు శ్రీనాథ్.

"నోర్ముయ్! నిరుద్యోగం సంగతి మర్చిపో. నువ్వు కాబోయే ఇండస్ట్రియలిస్టువి. దర్జాగా వుండడం నేర్చుకో. బీద అరుపులు మానెయ్."

"అదిసరే గాని నన్ను ఇలా వుంచదల్చుకోలేదా? ఏం కోతలురా బాబూ! ఇంజనీరింగ్ అమెరికాలో చదివాననీ, మా అంకుల్ ఎవడో ప్రొఫెసర్ అనీ...."

"కొయ్య అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు. మైండిట్."

"మరి ఇంత దారుణంగానా?"

"దారుణం యేవుంది? నువ్వు ఇంజనీరింగ్ చదివావా లేదా? అది అమెరికాలో అయినా ఒకటే ఇండియాలో అయినా ఒకటే."

"అది సరే!——...."

"ష్....త్వరగా తెములు. పోదాం. రేపు మనం

పెళ్ళిచూపులు చూడాలి."

"ఎవర్ని?"

"ఇంకెవర్ని? మా ప్రొప్రయిటర్ కూతుర్ని!"

"అరేయ్ బాబూ! నా కెందుకో భయంగా వుందిరా! ఈ నాటకం ఆడడం నావల్ల కాదు."

"ధైర్యమే ధనలక్ష్మిరా బడుద్దాయ్! నీ కెందుకు నే నున్నానుగా" అన్నాడు కిరణ్.

ఇద్దరూ 'టీ' తీసుకుని బయల్దేరారు.

కిరణ్ సరాసరి మౌంట్ రోడ్డులో వున్న రేమాండ్స్ షోరూమ్ ముందు కారు ఆపాడు.

"పద...." అన్నాడు కిరణ్.

"నే నెందుకూ? నువ్వెళ్ళి కొనుక్కురా!"

"బట్టలు నాక్కాదురా! నీకే"

"నాకా!"

"అవును. ఇలా పిచ్చి పిచ్చి బట్టలు వేసుకుని తిరుగు తుంటే నువ్వు ఇంజనీరింగ్ చదివావని ఎవడూ నమ్మడు. కాబోయే అమ్మాయి.... సారీ.... భార్య కళ్ళు మెరిసి పోయేటట్లు వుండాలి. దిగు.... దిగు...." అని తొందర పెట్టాడు.

అరడజను జతలు ప్యాక్ చేయించి, ఐదువేలు బిల్లు కట్టాడు. షాపింగ్ చేసి అతనికి కావల్సిన వస్తువులన్నీ కొని వి.ఐ.పి. సూట్ కేస్‌లో సర్ది ఇచ్చాడు.

కారు సునీత ఫ్లాట్స్ పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది.

తెల్లటి యూనిఫాంలో వున్న కుర్రాడు కారు దగ్గర కొచ్చి విష్ చేసి డిక్కీ తీసి సూట్ కేస్ అందుకొన్నాడు.

లిఫ్ట్ నాలుగో అంతస్థులో ఆగింది.

ఫ్లాట్ నెంబర్ దెబ్భై ఏడు.

అత్యంత ఆధునికంగా వుంది ఫ్లాట్. లేటెస్టు డిజైనులో ఈమధ్యనే కట్టారు.

"ఈ ఫ్లాట్ యెవరిది?" ఆశ్చర్యంగా అడిగాడు శ్రీనాథ్ లోపల వున్న ఫర్నిచర్ చూస్తూ.

రెండు బెడ్ రూమ్స్ ఎయిర్ కండిషన్ చేసి వున్నాయి.

"నీదే" అన్నాడు కిరణ్.

"అంటే...."

"అదంతే. అమెరికాలో ఇంజనీరింగ్ చదువుతున్న వాడు ఎంత దర్జాగా వుండాలి?"

"ఈ ఫ్లాట్ కి అద్దె?"

"నెలకి మూడు వేలు."

"మైగాడ్!" అదిరిపడ్డాడు.

"డోంట్ బీ సిల్లీ. ఇక నువ్వు నేలమీద నడిస్తే వూరుకోను. ఎవడికీ అనుమానం రాకుండా బిహేవ్ చెయ్యి. ఎక్కడికెళ్ళినా కారు యూజ్ చెయ్యి. వ్రా డితో సుప్రియాలో భోజనం తెప్పించుకో. ఏం తోచక పోతే ఏదైనా సినిమా కెళ్ళు. అవసరం అనుకుంటే ఇంటికి ఫోన్ చెయ్యి" చెప్పాడు కిరణ్.

"ఈ కారు కూడా అద్దెదేనా?"

"నో....కొన్నాను నిన్ననే."

"నా దగ్గర లైసెన్స్ లేదుగా!"

"ప్చ్....భయపడకు. డబ్బుండాలే గాని అన్నీ వరిగెత్తు కొస్తాయి" అని ధైర్యం చెప్పాడు కిరణ్.

"ఏమోరా నా కొంప ముంచుతావేమో? దడగా వుంది" అన్నాడు శ్రీనాథ్.

"చౌకలో అమెరికా ఇంజనీర్ దొరుకుతున్నాడంటే

ఎగిరి గంతేశాడట రాజేంద్రప్రసాద్. వెంకటసుబ్బయ్య సంబరంగా చెప్పాడు. ఈ మాచ్ కుదురుతుంది. డోంట్ వర్రీ. నందిత బ్యూటీ చూస్తే నువ్వెన్ని అబద్ధాలైనా చెప్పేస్తావ్" అని నవ్వాడు కిరణ్.

శ్రీనాథ్ మాట్లాడలేదు. అతనికి అంతా ఆశ్చర్యంగా వుంది. చిన్న రూమ్‌లో వుండేవాడికి ఒక్కసారిగా ఏ.సి. ఫ్లాట్, కారు, నౌకరు వచ్చేసరికి మతిపోయింది.

"సీ....యూ! విష్ యూ బెస్టాఫ్ లక్" అని వెళ్ళిపోయాడు కిరణ్.

టీపాయ్‌మీద వున్న కారు తాళాలు చేతిలోకి తీసుకుని ఆలోచనల్లోకి జారిపోయాడు శ్రీనాథ్. తనకు తెలియకుండానే రొంపిలోకి దిగుతున్నట్లు యేదో అనుమానం మొలకెత్తుతోంది మనసులో. కిరణ్ తనకోసం ఎందుకు చేస్తున్నాడు ఇదంతా?

ఎంత ఆలోచించినా అతనికి సమాధానం దొరకడం లేదు.

మర్నాడు ఉదయమే కిరణ్, విజయ అతని ఫ్లాట్‌కి వచ్చారు. అప్పుడే టిఫిన్ చేసి అలవాటు ప్రకారం వాంటెడ్ కాలమ్స్ వెతుకుతున్నాడు పేపర్లో.

కిరణ్ భార్యని వెంట తీసుకుని వచ్చేసరికి కంగారుపడ్డాడు.

"ఇంకా రెడీ కాలేదా?" అన్నాడు వస్తూనే కిరణ్.

"ఎక్కడికి?" అన్నాడు శ్రీనాథ్ అయోమయంగా.

"ఇంకెక్కడికి? పెళ్ళి చూపులకి."

శ్రీనాథ్ సిగ్గుపడ్డాడు.

"జస్టేమినిట్..." అని బెడ్‌రూంలోకి వెళ్ళాడు. పదినిముషాల తర్వాత వచ్చాడు శ్రీనాథ్.

"ఇప్పుడు స్మార్టుగా వున్నావురా!" అని మెచ్చుకున్నాడు కిరణ్.

శ్రీనాథ్ పొడగరి. తెల్లటి రంగు రెడీమేడ్ బట్టల్లో ట్రిమ్మ్‌గా ముస్తాబయ్యేసరికి అందంగా కనిపిస్తున్నాడు.

ముగ్గురూ కార్లో బయల్దేరారు.

వీళ్ళకోసమే ఎదురు చూస్తున్నట్లు పోర్టికోలో నిల్చుని వున్నాడు రాజేంద్రప్రసాద్.

కారు దిగగానే విష్ చేశాడు అందరికీ.

అతన్ని చూడగానే విజయ ముఖం ఎర్రబడింది కోపంతో. బలవంతంగా కోపాన్ని అణచుకుంది.

హాల్లో కూర్చున్నారు ముగ్గురూ. తర్వాత వెంకట సుబ్బయ్య కూడా వచ్చాడు. రాజేంద్రప్రసాద్ బ్రతిమాలినా ఆయన ఎదురుగా కూర్చోవడానికి ఒప్పుకోలేదు.

దశరథ్‌ని, అతని భార్య రేవతిని పరిచయం చేశాడు రాజేంద్రప్రసాద్.

రేవతి లోపలకు వెళ్ళి నందితను తీసుకొచ్చి సోఫాలో కూర్చోబెట్టింది.

నందిత "నమస్తే" చెప్పింది.

శ్రీనాథ్ కంగారుగా ప్రతి నమస్కారం చేశాడు. అతన్ని ధైర్యంగా వుండమని కళ్ళతోనే చెప్తున్నాడు కిరణ్. అప్పుడప్పుడు మోచేత్తో పొడవడం, గిల్లటం వంటివి చేస్తున్నాడు.

నందిత చంద్రికంటే పొడుగ్గా వుంది. గుండ్రటిముఖం. ఆ ముఖంలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడుతోంది. ఆమె కళ్ళు సూటిగా చూస్తున్నాయి శ్రీనాథ్‌ని గుచ్చిగుచ్చి.

శ్రీనాథ్ పర్సనాల్టీ అందరికీ నచ్చినట్లే కన్పించింది

కిరణ్ చెప్పినట్లుగా అమెరికా విశేషాలు బట్టీపట్టి అప్పగించేశాడు శ్రీనాథ్.

శ్రీనాథ్‌కి తల్లిదండ్రులు లేరనీ, బ్రదర్స్‌తో కాంటాక్ట్స్ లేవనీ తెలిసి సంతోషించాడు రాజేంద్ర ప్రసాద్. దశరథ్‌కి కూడా ఈ సంబంధం నచ్చింది. పెళ్ళికాగానే అమెరికా వెళ్ళిపోతున్నందున అతనికి ఇబ్బంది ఏమీ లేదు.

"అమెరికాలో ఏం ప్లాన్ చేస్తున్నారు? ఎంత కావాల్సి వుంటుంది?" అని ఆఖరిగా అడిగాడు రాజేంద్ర ప్రసాద్.

"మినీ జనరేటర్స్ మాన్యుఫాక్చరింగ్ ప్లాన్ చేస్తున్నాను ఆసియాలో మంచి డిమాండ్ వుంది" చెప్పాడు శ్రీనాథ్.

"గుడ్. మీరు చెప్పింది నిజమే. కరెంట్ కోత రోజురోజుకీ పెరుగుతోంది కూడా."

"మా యూనివర్సిటీ రిసెర్చి సెంటర్‌లో నమూనా తయారుచేశాం. కిరోసిన్‌తో పెద్ద శబ్దం లేకుండా స్మూత్‌గా నడుస్తుంది. లో కాస్టు. ఈజీ మెకానిజం. మిడిల్ క్లాస్ ఫామిలీ వాళ్ళు కూడా కొనుక్కోవచ్చు."

శ్రీనాథ్ మినీ జనరేటర్ గురించి వివరాలు చెప్పాడు. పదిలక్షలు వుంటే చాలు అన్నాడు.

రాజేంద్రప్రసాద్‌కి అతని ప్రతిపాదన నచ్చింది. నందితకూడా ఎలక్ట్రానిక్స్ ఇంజనీర్ కాబట్టి ఇద్దరూ కలిసి సక్సెస్‌ఫుల్‌గా ఇండస్ట్రీ డెవలప్ చేస్తారని అతనికి నమ్మకం కలిగింది.

కిరణ్ తనకి బెస్టు ఫ్రెండ్ అని చెప్పాడు శ్రీనాథ్.

గంట తర్వాత కూల్‌డ్రింక్స్ మాత్రం తీసుకుని

బయల్దేరారు ముగ్గురూ.

రాజేంద్రప్రసాద్, దశరథ్ గేటువరకు వచ్చి సెండాఫ్ చెప్పారు.

నందిత కళ్ళతోనే వీడ్కోలు చెప్పింది శ్రీనాథ్‌కి.

సాయంకాలం మళ్ళీ కలుస్తానని చెప్పి వెళ్ళిపోయాడు వెంకటసుబ్బయ్య.

ఆ పూట అతను ఆఫీసుకు రాలేదు.

ఈవెనింగ్ వచ్చి కిరణ్‌ని తీసుకుని మౌంట్‌రోడ్డుకి బయల్దేరదీశాడు వెంకటసుబ్బయ్య. పెళ్ళి కుదిరినందుకు ఆనందపడి గజేంద్రవిలాస్‌లో హాఫ్ బాటిల్ విస్కీ తాగి కక్కుకున్నాడు వెంకటసుబ్బయ్య.

# 29

శ్రీనాథ్, నందితల పెళ్ళయింది.

నెల తర్వాత హనీమూన్ నుంచి తిరిగివచ్చారు. వచ్చీ రాగానే కిరణ్ కోసం ఇంటికి వచ్చాడు శ్రీనాథ్.

"ఏమంటున్నది నందిత?" ప్రశ్నించింది విజయ.

"షీ ఈజె ఫైన్ గర్ల్" చెప్పాడు శ్రీనాథ్.

హనీమూన్ కబుర్లు చెప్పాడు చాలాసేపు. అతను చాలా సంతోషంగా వున్నాడు.

"పాత జీవితం అంతా పీడకలలా వుందిరా! ఇప్పుడు నేను స్వర్గంలో వున్నట్లు ఫీలవుతున్నాను. ఐ యామ్ వెరి వెరీ హేపీ. ఇదంతా నీవల్లనేరా" అన్నాడు శ్రీనాథ్.

"ఇప్పుడు సుఖంగా వుందని పొంగిపోకు. ముందు ముందు కష్టాలు యెదురైనా ఎదుర్కొనే ధైర్యం సంపాదించుకోవాలి" అన్నాడు కిరణ్.

"కష్టాలు నాకు కొత్తకాదు."

"గుడ్. ముందే చెప్తున్నా నువ్విప్పుడు సొసైటీలో చాలా గొప్పవాడివి. నేను మీ మామగారి ఇండస్ట్రీలో చిన్న ఉద్యోగిని. కాబట్టి మనం దూరం దూరంగా వుండడం మంచిది. ముఖ్యంగా ఆఫీసులో నన్ను కలుసుకో వద్దు. ఎప్పుడైనా ఇంటికిరా" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ ఖిన్నుడయ్యాడు. ముఖం వెలవెలపోయింది.

"అవేం మాటల్రా! నేను యెంత గొప్పవాడినైనా అదంతా నీవల్లనే. మన ఫ్రెండ్‌షిప్‌కి అవేం అడ్డు రాకూడదు" అన్నాడు శ్రీనాథ్.

"డోంట్ టెల్ డ్రామా డైలాగ్స్. నేనేం చెప్పినా దానికి కొంత అర్థం వుంటుందని గ్రహించు" అన్నాడు కిరణ్.

"ఏమోరా! నీ మాటలు నాకేం అర్థంకావడంలేదు."

"అవే అర్థమౌతాయిలే. ఇంకొక నెలరోజులు ఆగి నీ ప్లాన్ మీ మామగారి ముందు పెట్టు. ఏమంటాడో చూద్దాం" అన్నాడు కిరణ్.

శ్రీనాథ్ తల వూపాడు.

విజయ అతన్ని డిన్నర్‌కి వుండమన్నా నందిత ఎదురు చూస్తుందని వెళ్ళిపోయాడు.

"ఈసారి చాలా లేటవుతోంది కిరణ్" అంది విజయ అతని ప్రక్కనే కూర్చుంటూ.

"ఏం?"

"ఇంతవరకు కథ ముందుకు జరగడంలేదు రాజేంద్ర ప్రసాద్ విషయంలో."

"ఇదిగో ఇక మొదలవుతోంది చూడు."

"శ్రీనాథ్ గూడా అనుమానితుడేనా ! రాజేంద్ర ప్రసాద్ మర్డర్ జరిగాక."

"నీకా అనుమానం ఎందుకు?"

"ఇతను మీ క్లోజ్ ఫ్రెండ్ కదా!"

"అయితే ఏం?"

"అతనికి ఇబ్బంది కదా!"

"అంతేకదా! అతన్నేం ముద్దాయిని చెయ్యడంలేదు మనం. వాళ్ళ మామని మర్డర్ చెయ్యమని పంపడంలేదు. ముందెప్పుడో పోలీసులు అనుమానిస్తారు దట్సాల్."

"శ్రీనాథ్ ఏం ప్లాన్ వేస్తున్నాడు?"

"బిజినెస్. మినీ జనరేటర్స్ ఇక్కడే మాన్యుఫాక్చర్ చేసేందుకు ప్లాన్."

"ఇప్పుడు తెలిపోతుందన్నమాట శ్రీనాథ్ అమెరికా అల్లుడు కాదని."

"ఎలా తెలుతుంది?"

"అమెరికా తిరిగి వెళ్ళడానికి ప్రయత్నించడు కాబట్టి."

"దాండే వుంది? అమెరికాలో చదువుకున్నవాళ్ళు అక్కడే సెటిల్ అయిపోవాలా?"

"అతను సెటిల్ అవుతానని కోతలు కొయ్యబట్టేకదా పిల్లనిచ్చింది."

"కావచ్చు. అమ్మాయి కళ్ళముందే వుంటానంటే యే తండ్రి అయినా అభ్యంతరం చెప్పడు" అన్నాడు కిరణ్.

"ఇతనికి వాళ్ళ మామకి ఎలా చెడుతుంది? నాకు అర్థంకావడంలేదు" విజయ.

"ఇండియాలో సెటిల్ కావడానికి రాజేంద్రప్రసాద్ ఒప్పుకున్నా అతని బావమరిది దశరథ్ చస్తే ఒప్పుకోడు."

"ఏం?"

"ఎదురుగా అల్లుడు వుంటే బావమరదిమీద ఎవరికి ప్రేమ వుంటుంది?" అని నవ్వాడు కిరణ్.

అందులో వున్న లాజిక్ నెమ్మదిగా అర్థమౌతోంది విజయకి.

నెల గడిచిపోయింది.

తను ఇండియాలోనే ఇండస్ట్రి స్టార్టు చేసే విషయం మామగారితో మాట్లాడే ముందు నందితకు కూడా చెప్పడం మంచిదని అనిపించింది శ్రీనాథ్ కి. పెళ్ళయిన దగ్గర్నుంచి టెక్నికలర్ స్వప్నంలో విహరిస్తున్నట్లుగా వుంది అతనికి. అది ఎక్కడ జారిపోతుందోనని భయం పట్టుకుంది ఇప్పుడు. ఆ కల శాశ్వతం చేసుకోవాలని తాపత్రయ పడసాగాడు.

గోడమీద వున్న డిజిటల్ క్లాక్ పదకొండు గంటలు చూపుతోంది. ఎర్రటి అంకెలు త్వర త్వరగా మారి పోతున్నాయి. సిటిజన్ క్వార్ట్జ్ క్లాక్ పదకొండు గంటలు కొట్టింది.

టి.వి.లో 'బ్లూ లగూన్' వస్తోంది. బ్రూక్ షీల్డ్స్ నగ్నంగా సముద్రపు ఇసకలో పరిగెత్తుతోంది.

ఏ.సి. సన్నగా చప్పుడు చేస్తోంది.

ఆలివ్ గ్రీన్ డిజైన్స్ వాల్ పేపరు షాండిలీర్స్ వెలుగులో అద్భుతంగా కనిపిస్తోంది. ఆ గది అందాన్ని రెట్టింపు చేస్తోంది.

శ్రీనాథ్ డబుల్ కాట్ మీద పడుకుని టి.వి. చూస్తున్నాడుగాని అతని మనసు ఎక్కడో వుంది. నందితతో ఆ విషయం ఎలా మొదలు పెడితే బాగుంటుందో ఆలోచిస్తున్నాడు. ఆమె మనసు చాలా సున్నితంగా వుంటుం

దని సంగతి ఈ రెండు నెలల్లో బాగా అర్థం చేసు కున్నాడు.

నందిత సోఫాలో కూర్చుని ఛేజ్ నవలలో లీనమైంది. పుస్తకం మొదలు పెట్టిందంటే అది పూర్తయ్యేవరకూ ఆమె నిద్రపోదు.

ఆమె రోజ్ కలర్ ఇంపోర్టెడ్ నైటీలో ఆకర్ష ణీయంగా కనిపిస్తోంది. తెల్లటి పాలరాతి విగ్రహం గుర్తు కొస్తోంది నందితను చూస్తూవుంటే.

శ్రీనాథ్ కళ్ళు మూసుకుని ఆలోచనలో వుండి పోయాడు. అరగంట తర్వాత నందిత లైట్లు ఆఫ్ చేసి, బెడ్‌లాంప్ ఆన్ చేసి వచ్చిన సంగతి అతను గమనించ లేదు.

"డియర్!"

శ్రీనాథ్ చెవికి నందిత మృదువైన పెదవులు మెత్తగా తాకాయి. పట్టుకుచ్చు వంటి ఆమె జుట్టు ముఖంమీద గిలి గింతలు పెట్టింది.

"డార్లింగ్!"

శ్రీనాథ్ ఆమెను మీదికి లాక్కున్నాడు.

నందిత చేతులు అతన్ని పాముల్లా చుట్టుకున్నాయి.

అతని చేతులు ఆమె నైటీని నెమ్మదిగా తొలగిం చాయి. ఆమె అతని కౌగిలిలో కరిగిపోతూ వున్నది.

"డార్లింగ్!"

"ఊఁ...." మత్తుగా అంది నందిత. ఆమెకు నిత్య నూతనంగా వుంది ఆ అనుభవం. గాలిలో తేలిపోతున్న ట్లుగా, శరీరం కరిగిపోతున్నట్లుగా వుంది.

"నందితా, మనం త్వరలో విడిపోతున్నాం" అన్నాడు శ్రీనాథ్.

ఆమె వులిక్కిపడింది.

"ఇంపాజిబుల్" గట్టిగా అరిచింది.

"ఒక వారంలో న్యూమెక్సికో వెళ్తున్నాను."

"ఏం?"

"ఎన్నాళ్ళు మామగారింట్లో వుండాలి? యేదోక మార్గం చూసుకోవాలి గదా! అమెరికాలో మినీ జనరేటర్ ఇండస్ట్రీ స్టార్ట్ చెయ్యాలి. ఇక్కడ్నా అక్కడ అంచాలిస్తే లైసెన్సులు రావు. అంతా రూల్ ప్రకారం చేస్తారు. కనీసం సంవత్సరమైనా పడుతుంది. అన్నాళ్ళూ నేను అక్కడ మా అంకుల్ ఇంట్లో వుండి పనులు చూసుకుంటాను. నువ్వు ఇక్కడ వుండు. ఏం?"

"నో...."

"ఏమిటి 'నో'?"

"నేనిక్కడ ఒంటరిగా వుండడం."

"మరెలా?"

"నేనూ వస్తాను."

"ఎలా కుదురుతుంది? నేను పగలంతా యెక్కడెక్కడో తిరుగుతుంటాను, పనులమీద న్యూయార్క్ వెళ్తుంటాను. నీకు బోర్ గా వుంటుంది. అదీగాక సంపాదన లేకుండా ఫ్యామిలీ మెయింటైన్ చెయ్యడం కష్టం. ఇండస్ట్రీ మొదలైన తర్వాత నిన్ను తీసుకెళ్తాను. ఏం?"

"ఆ ఇండస్ట్రీ యేదో ఇక్కడ పెట్టకూడదా? మద్రాస్‌లో యెన్నో ఇండస్ట్రీస్ వున్నాయే" అంది నందిత.

శ్రీనాథ్ ఐడియా ఫలించింది.

"నిన్ను వదిలి ఎలా వుండడమా అని లోలోపల యెంత మథనపడుతున్నానో నీకు అర్థంకాదు. నీ సలహా

అద్భుతంగా వుంది నందితా? థాంక్స్! థాంక్యూ—"

అతను నందితను ఆవేశంతో చూస్తున్నాడు. ముద్దుల వర్షం కురిపించి ఆమెను ఉక్కిరిబిక్కిరి చేశాడు.

నందితకు అతని ఆవేశం యెంతో హాయిగా వుంది. మైమరపుతో ఆమె కళ్ళు మూతలు పడుతున్నాయి.

"మీ నాన్న యేమంటాడో నందితా?"

"ఆయన యేమంటాడు? 'యస్' అంటాడు" నవ్వింది నందిత.

"కాని నాకు మామగారింట్లో పర్మనెంటుగా వుండి పోవడం ఇష్టంలేదు."

"ఏం? ఆయనకి మాత్రం ఎవరున్నారు? నేనుగూడా యింట్లోంచి వెళ్ళిపోతే ఆయన మరీ ఒంటరివాడయి పోడూ!"

నందిత మనసు శ్రీనాథ్‌కి అర్థమైంది.

మర్నాడు శ్రీనాథ్, నందిత కలిసి రాజేంద్రప్రసాద్ దగ్గరికి వెళ్ళారు. ఇద్దరూ ఒకేసారి రావడంతో యేదో విశేషం వుందని అతను అనుకున్నాడు.

"రండి....రండి...." అని సోఫా చూపించాడు.

ఇద్దరూ కూర్చున్నారు.

"నాన్నా! ఆయన మినీ జనరేటర్ ఇండస్ట్రీ యిక్కడే పెట్టాలనుకుంటూన్నారు" అంది నందిత.

"నేను కాదండీ! మీ అమ్మాయి సలహా" అని నవ్వాడు శ్రీనాథ్.

"అవును. ఇండస్ట్రీ యిక్కడైతేనేం?" అంది.

రాజేంద్రప్రసాద్ తల వూపాడు.

"ఏమంటావు నాన్నా!"

"నాకేం అభ్యంతరం లేదు. ఇక్కడే అయితే యే

ఇవ్వండి లేదు. మన డిస్ట్రిబ్యూటర్స్ వున్నారు. డిపాజిట్స్ కలెక్ట్ చెయ్యొచ్చు. నో ప్రాబ్లమ్" అన్నాడు రాజేంద్రప్రసాద్.

ఇంతలో రూమ్‌లోకి దశరథ్ ప్రవేశించాడు.

"ఏమిటి ప్రొద్దున్నే సీరియస్‌గా డిస్కస్ చేస్తున్నారు?" అన్నాడు.

రాజేంద్రప్రసాద్ చెప్పాడు.

అదంతా విని దశరథ్ ముఖంలో రంగులు మారాయి. రాజేంద్రప్రసాద్ అల్లుళ్ళెవరూ మద్రాస్‌లో వుండడం అతనికి యిష్టం వుండదు. దానికి చాలా కారణా లున్నాయి.

పెద్దల్లుడు డాక్టర్, చిన్నల్లుడు పైలెట్ సంబంధాలు సెలక్ట్ చేసింది కూడా అతనే. కాని మూడో అల్లుడితో చిక్కొచ్చింది. ఇతను మెకానికల్ ఇంజనీర్. అమెరికా వెళ్ళిపోతాడనే ఆలోచనతో ఒప్పుకున్నాడు గాని లేక పోతే ఏదో అడ్డుపుల్ల వేసేవాడే. అయితే దశరథ్ చాలా తెలివయిన ఘటం.

"అయితే మీరు ఇక్కడే ఇండస్ట్రీ స్టార్టు చేద్దామనుకుంటున్నా రన్నమాట" అన్నాడు దశరథ్, శ్రీనాథ్‌తో.

"యస్ అంకుల్, నందిత ఐడియా! నాకయితే అమెరికా వెళ్ళాలనే వుంది" అన్నాడు శ్రీనాథ్.

"అమెరికా ఎందుకు వెళ్తావు మిస్టర్ శ్రీనాథ్? వెళ్ళవని నాకు తెలుసు. వెళ్ళలేవని కూడా తెలుసు" సీరియస్‌గా అన్నాడు దశరథ్.

శ్రీనాథ్ కంగారుపడ్డాడు.

"ఏమిటి అంకుల్ మీరంటున్నది?" అన్నాడు.

నందిత, రాజేంద్రప్రసాద్ అయోమయంగా ముఖాలు చూసుకున్నారు.

శ్రీనాథ్ ముఖం కళ తప్పింది. తన రంగు దశరథ్‌కి తెలిసిపోయిందేమో అని అనుమానం లీలగా మనసులో మెదిలింది.

"నువ్వసలు అమెరికా ముఖం చూళ్ళేదు. అక్కడ చదవలేదు. వరంగల్‌లో ఇంజనీరింగ్ చదివావు" అన్నాడు దశరథ్.

శ్రీనాథ్ నెత్తిన బాంబ్ ప్రేలింది.

"నో...." అన్నాడు గట్టిగా.

"యస్ మిస్టర్ శ్రీనాథ్. నువ్వు హనీమూన్ వెళ్ళి నప్పుడు మీ పెద్దన్న వచ్చి నన్ను కలిశాడు. పేపర్లో మీ పెళ్ళి ఫోటో చూశాడట. పెళ్ళికి వాళ్ళెవర్నీ పిలవలేదని బాధ పడ్డాడు" చెప్పాడు దశరథ్.

రాజేంద్రప్రసాద్ బిత్తరపోయి విన్నాడు.

నందిత ముఖం కోపంతోను, అవమానంతోను ఎర్రబడి పోయింది. ఆమె కళ్ళు పెద్దవిచేసి "యూ! చీట్" అని కేక పెట్టింది.

చరచర వెళ్ళిపోయింది.

"నందితా!" అంటూ శ్రీనాథ్ ఆమె వెంట వెళ్ళాడు.

నందిత ఏడుస్తూ సోఫాలో కూలబడింది.

శ్రీనాథ్ ఆమె దగ్గరగా వెళ్ళి "ప్లీజ్ నందితా! చెప్పింది విను" అంటూ ఆమె మీద చెయ్యి వేశాడు.

ఆతని చేతిని విసిరికొట్టి "ఐ హేట్ యూ! గెటౌట్" అంది.

శ్రీనాథ్ బిత్తరపోయాడు.

"మోసగాళ్ళంటే నాకు అసహ్యం. ఛీ....నీ ముఖం

నాకు చూపించకు" అని గట్టిగా అరిచింది.

నౌకర్లు చూస్తున్నారు ఆ సీన్. అతనికి తల కొట్టేసి నట్లనిపించింది. నందిత కోపంతో వుంది. హర్ట్ అయింది. ఇప్పుడు పలకరించి లాభం లేదు. కోపం తగ్గనీ అనుకుంటూ అతను వెళ్ళిపోయాడు.

రాజేంద్రప్రసాద్ ఆ షాక్ నుంచి ఇంకా తేరుకో లేదు. కారు డ్రైవ్ చేసుకుంటూ వెళుతున్న శ్రీనాథ్ ని చూస్తూ నిశ్శబ్దంగా వుండిపోయాడు. దశరథ్ చెప్తున్న మాటలు అతని చెవికి ఎక్కడం లేదు.

శ్రీనాథ్ సరాసరి తన ఫ్లాట్ కి వెళ్ళిపోయాడు.

ప్రసాద్ ఇండస్ట్రీకి ఫోన్ చేశాడు కిరణ్ కోసం. అతను జాబ్ మానేసి నెల రోజులు కావొచ్చిందని చెప్పారు. ఇంటికి ఫోన్ చేశాడు. కిరణ్ పలికాడు.

"నేను శ్రీనాథ్ ని మాట్లాడుతున్నాను."

"ఏరా! ఏమిటి సంగతి?"

"అంతా అప్ సెట్ అయిపోయిందిరా!"

"ఏమిటో జరిగింది చెప్పు."

"నేను అమెరికాలో చదవలేదని, అక్కడ నా అంకుల్ ఎవరూ లేడని, నేను వరంగల్ లో చదివానని తెలిసిపోయింది. దశరథ్ అంతా చెప్పేశాడు. హనీమూన్ లో వున్నప్పుడు మా పెద్దన్నయ్య వచ్చాడట."

"అలాగా! సో వాట్?" అన్నాడు కిరణ్.

"ఇప్పుడేం చెయ్యాలి? నందిత నన్ను గెటౌట్ అంది."

"డోంట్ వర్రీ. కొన్నాళ్ళు పోతే తనే సర్దుకుంటుంది. హిందూదేశపు స్త్రీ కదా! పతియే ప్రత్యక్ష దైవం అని నీ దగ్గరికి రాక తప్పదు."

"నీకు ఎగతాళిగా వుందా! నేను కొంప మునిగి చస్తుంటే?"

"నీ కొంప ఏం మునగలేదు. మునిగింది మీ మామ."

"అది సరే! ఇప్పుడు నేనేం చెయ్యాలి?"

"ఏమీ చెయ్యొద్దు. హాయిగా తిని పడుకో. రేపొద్దున ఇక్కడికి వచ్చెయ్ మాట్లాడుకుందాం. డోంట్ వర్రీ" అన్నాడు కిరణ్.

"ఈ రాస్కెల్ వల్లనే ఈ గొడవంతా వచ్చింది" అనుకుని తిట్టుకుంటూ ఫోన్ విసురుగా పడేశాడు శ్రీనాథ్.

## 30

"ఏమంటున్నది నందిని?" నవ్వుతూ అడిగాడు కిరణ్.

శ్రీనాథ్‌కి మండిపోయింది.

"నాకు విడాకులు ఇస్తానంటోంది."

"అదంత తేలిక కాదులే."

"ఏం?"

"నువ్వు ఒప్పుకోవుగా. అదీగాక ఇద్దరూ విడివిడిగా రెండేళ్ళున్నట్లు నిరూపించుకోవాలి. మీ పెళ్ళయి రెండు నెలలేగా!"

"ఇదంతా ఆ దశరథ్ గాడివల్ల జరిగింది" కోపంగా అన్నాడు శ్రీనాథ్.

"దశరథ్ మీద నీకు పగ తీర్చుకోవాలని వుందా?"

"ఎలా?"

"నిన్ను ఆ ఇంట్లోంచి నెట్టేశాడు. నువ్వు వాడిని మెడపట్టి గెంటేటట్లు చెయ్యాలి."

"ఎలా?"

"చెప్తాను. మీ మామ పర్సనల్ నెంబర్ నీకు

తెలుసా?"

"తెలుసు."

"అయితే రింగ్ చెయ్యి."

శ్రీనాథ్ రిసీవర్ ఎత్తి రింగ్ చేశాడు.

"రాజేంద్రప్రసాద్ హియర్" లైన్లోకి వచ్చాడు.

"హల్లో హల్లో.... ప్రసాద్ ఇండస్ట్రీస్ ప్రొప్రయిటర్ గారేనా?"

"అవును."

"మీరు రాజేంద్రప్రసాదేనా!"

"అవునయ్యా బాబు! మీరెవరు?"

"నా పేరు జగదీష్ సార్! నీలిమ ఎంటర్ప్రైజెస్ ప్రొప్రయిటర్ని. నెల్లూరు నుంచి యస్. టి. డి.లో మాట్లాడుతున్నా."

"చెప్పండి."

"నేను నెల్లూరులో మీ ప్రొడక్ట్సుకి డిస్ట్రిబ్యూటర్ని."

"అలాగా! చెప్పండి ఏం కావాలి? ఏదయినా ఆర్డర్ చెప్తారా?"

"ఆ విషయమే మీకు చెప్పాలని ఫోన్ చేస్తున్నా. దాదాపు ఆర్నెల్ల నుంచి మీ కంపెనీ సరుకు సరిగ్గా మూవ్ కావడం లేదు."

"వాట్?"

"అవున్సార్! గ్యారంటీ పిరియడ్ యెంత ఇస్తున్నా లాభంలేకపోతోంది. నేనిక్కడ ఎంక్వయిరీ చేశాను. మన కంపెనీసరుకు చాలా చౌకగా వేరేకొన్ని షాప్సులో అమ్ముతున్నట్లు తెలిసింది. సీలింగ్ ఫాన్ ఆరొందలది, మూడొందలకి, మిక్సీలు పధ్నాలుగు వందలది, ఎనిమిది వందలకు అమ్ముతున్నారు."

"ఎలా అమ్ముతున్నారు? వాళ్ళకి అంత చౌకగా ఎలా వస్తోంది సరుకు?

"మీరు చెప్పే వస్తువులలో లేదో, మీ ఇండస్ట్రీలో మీకు నమ్మకమైనవాళ్ళే డూప్లికేట్ సరుకు తయారు చేయించి అమ్ముతున్నారు. అదంతా మద్రాసులోనే తయారవుతోంది."

"ఈజిట్?"

"యస్సార్! ఆ అడ్రస్ గూడా నాకు తెలుసు. ఎన్నూర్‌లో సరుకు తయారవుతుంది. వాటిని మార్కెట్ చేసే వ్యక్తి పేరు దశరథ్."

"వాట్? దశరథ్."

"యస్! దశరథ్. అతను లేకపోతే అతని బావమరది హరిహరదాసు గాని సరుకు మార్కెట్ చేస్తారు."

"వండర్‌ఫుల్‌గా వుందే."

"మీరు వెంటనే మీ కంపెనీ మేనేజర్స్‌కి గూడా తెలియకుండా పోలీస్ కంప్లెయింటు ఇచ్చి వెంటనే పట్టుకోండి. లేకపోతే మేం మీ కంపెనీసరుకు అమ్మలేం. ప్రజలకి తెలీదు గదా యేది అసలో, యేది నకిలీనో."

"అవును జగదీష్‌గారూ! నేను వెంటనే వాళ్ళని పట్టుకుంటాను. వీలైతే మీరు గూడా అక్కడ పోలీస్ కంప్లెయింటు ఇవ్వండి."

"అలాగే సార్!"

"థాంక్యూ! జగదీష్!"

"నో మెన్షన్ సార్!"

కిరణ్ ఫోన్ పెట్టేశాడు.

శ్రీనాథ్ వాళ్ళ సంభాషణ ఆశ్చర్యంగా వింటున్నాడు.

"ఏమిట్రా మొఖం అలా పెట్టావ్?" నవ్వుతూ అడిగాడు కిరణ్.

"నువ్వు చెప్పేదంతా!"

"సెంట్ పర్సెంట్ కరెక్ట్."

"ఎలా తెలుసుకున్నావు?"

"అదంతా అడక్కు. రేపు పేపర్లో పడుతుంది ఈ వార్త చదువుకో" అన్నాడు కిరణ్.

మర్నాడు పేపర్లో ప్రముఖంగా పడింది. 'నకిలీ కంపెనీ పట్టివేత' అనే హెడ్డింగుతో.

'గత పదిహేను సంవత్సరాలుగా ప్రసాద్ ఇండస్ట్రీస్ తయారుచేసే వస్తువులకు మార్కెట్లో పేరు ప్రఖ్యాతులు వున్న సంగతి పాఠకులకు తెలిసిందే. ప్రసాద్ ఇండస్ట్రీస్ పేరుతో నకిలీ వస్తువులు తయారుచేసి మార్కెట్టు చేసి చౌకగా ప్రజలకు అందిస్తున్న హరిహరదాస్ అనే వ్యక్తిని పోలీసులు నేడు ఎన్నూరులో అరెస్టు చేశారు. అప్పుడు అతనికి నకిలీ ఫ్యాక్టరీలో ఇరవై వేల ఫ్యాన్లు, మిక్సీలు, వగైరా వస్తువులు దొరికాయి. పోలీసులు వాటిని స్వాధీనం చేసుకున్నారు. నెల్లూరుకు చెందిన నీలిమ ఎంటర్ప్రైజెస్ ప్రొప్రయిటర్ శ్రీ జగదీష్ ఫోన్ చేసి తనకీ విషయం తెలియచేశారని ప్రసాద్ ఎంటర్ప్రైజెస్ ప్రొప్రయిటర్ శ్రీ రాజేంద్రప్రసాద్ విలేఖరులకు చెప్పారు. తను మొదట ఆశ్చర్యపోయాననీ, నమ్మలేకపోయాననీ ఆయన తెలియజేశారు. వెంటనే పోలీసులకు కంప్లెయింటు ఇచ్చాననీ వారు నకిలీ ఫ్యాక్టరీని స్వాధీనపరుచుకున్నారనీ అన్నారు. ఇంకొక గమ్మత్తయిన విషయం యేమిటంటే ప్రసాద్ ఇండస్ట్రీస్ జనరల్ మేనేజర్ శ్రీ దశరథ్ హస్తం నకిలీ ఫ్యాక్టరీలో

వుండడం. శ్రీహరిహరదాస్, దశరథ్ బావమరది అని తెలిసింది. ప్రసాద్ ఇండస్ట్రీసు జనరల్ మేనేజర్ దశరథ్, ప్రొప్రయిటర్ శ్రీరాజేంద్రప్రసాద్‌కి స్వయాన బావమరది. శ్రీదశరథ్ పరారీలో వున్నట్లు తెలిసింది. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ శ్రీ పళనిస్వామి కేసు దర్యాప్తు చేస్తున్నారు.'

శ్రీనాథ్ వెళ్ళేసరికే కిరణ్, విజయ పేపర్లు చూస్తున్నారు. కొన్ని డెయిలీలలో ఫొటోలు ప్రచురించారు. హరిహరదాస్ సంకెళ్ళతో ఫ్యాన్లు, మిక్సీల వెనుక నిల్చుని వున్నాడు.

"రా....రా....నీ కోసమే చూస్తున్నాం" అన్నాడు కిరణ్.

"నిన్న నువ్వు చెప్పింది నమ్మలేకపోయాను. ఉదయం పేపర్లో చూసి వండర్ అయ్యాను. ఎంత గమ్మత్తుగా మోసం చేశాడు దశరథ్!" అన్నాడు శ్రీనాథ్.

"ఇప్పుడు తెలిసిందా దశరథ్ నీ గుట్టు ఎందుకు బైట పెట్టాడో?" అడిగాడు కిరణ్.

"నేనుంటే ఇది ఎప్పుడో ఒకప్పుడు బయటపడుతుందని భయపడుంటాడు. అదీగాక ఇండస్ట్రీలో అల్లుడుగా నేను అతన్ని డామినేట్ చేస్తానేమోనని సంశయం కూడా వుండివుంటుంది."

"నువ్వు అమెరికా వెళ్ళడానికి సిద్ధపడి వుంటే అతను నీ గుట్టు బైటపెట్టేవాడు కాదు" అన్నాడు కిరణ్.

"అవును."

"నందితను మళ్ళీ కలిశావా?"

"లేదు."

"ఏం?"

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క-మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా గ్యారంటీగా అందుతాయి. ఇంకా రెండేసి నెలల కొకసారి V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

"లాభం లేదు. నామీద ఇంకా కోపం పోలేదు."

"ఎలా తెలుసు నీకు?"

"నన్ను చూస్తూనే ముఖం చిట్లించుకుని లోపలకు వెళ్ళిపోయింది.

"ఓరి పిచ్చివాడా! ఆడదాని సంగతి నీకు సరిగా తెలీదు. 'అవునంటే కాదనీ, కాదంటే అవుననీ' సినిమా కవి చెప్పాడు నీకు తెలుసో. లేదో వెళ్ళు.... వెళ్ళి మొదట బ్రతిమాలు. లేదంటే మన ఫ్లాట్ కి వెడదాం రమ్మని బెదిరించు. గట్టిగా అరువు. ఇరుగు పొరుగు వింటారేమో పరువు పోతుందని మీ మామ నందితకు సర్ది చెప్తాడు."

"అంతేనంటావా?"

"అంతే. లేకపోతే ఎన్నాళ్ళున్నా నీ ప్రాబ్లమ్ సాల్వ్ కాదు."

శ్రీనాథ్ కి నందితతో గడిపిన మధుర క్షణాలు గుర్తొస్తుంటే పిచ్చెక్కిపోయింది. ఆమె తోడు లేకుండా జీవించడం వృధా అనిపించింది. నందిత పొందుకోసం యేమైనా చెయ్యడానికి, అఖరికి నందిత కాళ్ళు పట్టుకునయినా.... బ్రతిమాలాలనిపించింది. ఆమెను ప్రసన్నం చేసుకోవాలనే దృఢ నిశ్చయంతో వెళ్ళాడు.

కారు దిగి లోపలకు వస్తున్న అల్లుడ్ని చూసి రాజేంద్ర ప్రసాద్ ముఖం చిట్లించుకున్నాడు. పలకరించలేదు. చూసీ చూడనట్లు తన రూమ్ లోకి వెళ్ళిపోయాడు.

శ్రీనాథ్ మనస్సు చివుక్కుమంది.

'పలకరిస్తే పీడపోయ్యేం పోయిందో' అనుకున్నాడు.

నందిత బెడ్ రూమ్ తీసే వుంది.

పిల్లిలా లోపలకు ప్రవేశించాడు.

నందిత డ్రెస్సింగ్ మిర్రర్ ముందు నిల్చుని తల దువ్వు

కుంటోంది. షాంపూ చేసుకున్న జుట్టు గాలికి రెపరెప ఎగురుతున్నాయి. ఆమె నుంచి ఇంపోర్టెడ్ మిక్స్ పరిమళం ముక్కులకు తగిలింది. గ్రీన్ కలర్ గార్డెన్ చీరలో నందిత అప్సరసలా మెరిసిపోతోంది. తల దువ్వుకుంటున్నప్పుడు చేతులు పైకి ఎత్తుతుంటే ఆమె గుండె కదులుతూ అతనికి వెర్రెక్కించేస్తోంది. ఆమె రెండు మూడు సార్లు పయిట సర్దుకుంది. ఎత్తుగా కనపించిన స్తనద్వయం కళ్ళంతా కళ్ళు చేసుకుని చూశాడు. కదిలితే ఎక్కడ కల చెదిరిపోతుందోనని నిశ్శబ్దంగా నిల్చున్నాడు.

నందిని గిరుక్కున వెనక్కి తిరిగింది.

శ్రీనాథ్ నిల్చుని వున్నాడు దోషిలా.

ఆమె ముఖం ఎర్రపడింది కోపంతో.

"నందితా."

ఆమె పలుక లేదు.

"నందితా ప్లీజ్ మాట్లాడు."

"............"

"డార్లింగ్! నేను కావాలని నిన్ను మోసం చెయ్యలేదు."

"చూడు కావాలని చేసినా, కావాలని చెయ్యక పోయినా మోసం మోసమే. గుర్తుంచుకో! మళ్ళీ ఎందుకు వచ్చావిక్కడికి?" తీవ్రంగా వుంది ఆమె స్వరం.

అతను గతుక్కుమన్నాడు.

"నా మీద కోపం తగ్గలేదనుకుంటాను."

"అది ఎప్పటికీ తగ్గదు."

"ప్లీజ్ అలా అనకు డార్లింగ్! ఎంత కాదనుకున్నా నేను నీ భర్తని. కొన్నాళ్ళు కాపురం చేశాం"

(ఇంకా వుంది)

